# ప్రకృ చికిత్సాగ్రం ములు

## సూర్యకిరణచికిత్సాగ్రంథములు

| | వెల ఇతరులకు | వెల చందాదార్లకు |
|---|---|---|
| సునిశితవైద్యం | 4 8 0 | 8 0 |
| ప్రౌఢప్రభాకరం | 2 0 0 | 8 0 |
| సూర్యకిరణచికిత్స | 0 12 0 | 8 0 |
| ఆరోగ్యప్రభాకరం | 0 4 0 | 3 0 |
| వర్ణచికిత్స | 0 6 0 | 4 0 |
| వర్ణవైద్యమంజరి | 0 6 0 | 4 0 |
| ౨ము | 0 5 0 | 4 0 |

| | వెల ఇతరులకు | వెల చందాదార్లకు |
|---|---|---|
| మహారోగము | 0 8 0 | 0 6 0 |
| పొగచుట్ట — ముక్కుపొడుం | 4 0 | 0 3 0 |
| కలుముంత - సారాపీపా | 4 0 | 0 3 0 |
| ఔషధవైద్య మొకయూహాశాస్త్రము | 0 4 0 | 0 2 0 |
| టీకాలవలనేమి? డాక్టర్లఅభిప్రాయము | 0 4 0 | 0 2 0 |
| అల్యూమినియంపాత్రలు | 2 0 | 0 1 0 |
| తేనీరు విషతుల్యము | 6 0 | 0 4 0 |
| తెల్లచక్కెరవలనివిపత్తు | 6 0 | 0 4 0 |

## జలచికిత్సాగ్రంథములు

| | | |
|---|---|---|
| ౧ము | 3 0 0 | 2 8 0 |
| లక్ష్మణజలచికిత్స | 0 12 0 | 0 8 0 |
| నైపీయ జలచికిత్స | 0 12 0 | 0 8 0 |
| తొట్టిస్నాననియమములు | 0 6 0 | 0 4 0 |
| ధారాచికిత్స | 0 4 0 | 0 3 0 |
| వేడినీటికాపు ఉబ్బసపుచికిత్స | 0 6 0 | 0 4 0 |
| ఉషఃపానము | 0 6 0 | 0 4 0 |
| కూనేమహర్షిబోధ | 0 2 0 | 0 1 0 |
| జబ్బుచికిత్స | 0 10 0 | 0 8 0 |

## ఆరోగ్యవిషయకగ్రంథములు

| | | |
|---|---|---|
| స్వాభావికచికిత్సానియమములు | 0 5 0 | 0 4 0 |
| ఆరోగ్యాదర్శము | 0 8 0 | 0 7 0 |
| ప్రకృతిచికిత్సాఉపన్యాసములు 3 భాగములు, ఒక్కొక్కటి | 0 5 0 | 0 4 0 |
| శిశుమాతలకొక సందేశము | 0 4 0 | 0 3 0 |
| ఆరోగ్యము - కామేచ్ఛ | 0 3 0 | 0 2 0 |

## ఆహారశాస్త్రగ్రంథములు

| | | |
|---|---|---|
| నిర్వికారభావిజీవనము (కొబ్బరినిగూర్చి) | 1 8 0 | 1 0 0 |
| ఆహారము 1 భాగము | 0 12 0 | 0 8 0 |
| డిటో 2 భాగము | 0 4 0 | 0 3 0 |
| పచ్చితిండివలనిప్రయోజనములు | 0 12 0 | 0 8 0 |
| తెల్లచక్కెరవలని విపత్తు | 0 6 0 | 0 4 0 |
| తేనీరు విషతుల్యము | 0 6 0 | 0 4 0 |
| జంబీర చికిత్స | 0 3 0 | 0 2 0 |
| సమరసాహారము విరుద్ధాహారమిశ్రమం | 0 2 0 | 0 1 0 |
| ఆహారసమ్మేళనపు గోల | 0 2 0 | 0 1 0 |
| అల్యూమినియంపాత్రలు | 0 2 0 | 0 1 0 |
| క్షీరచికిత్స | 0 4 0 | 0 3 0 |
| అపక్వశాకాహారఅదె | 2 0 0 | 2 0 0 |

## దురభ్యాసఖండనములు

| | | |
|---|---|---|
| | 0 4 0 | 0 3 0 |
| అనుభవానందము | 0 12 0 | 0 8 0 |

## వివిధచికిత్సాగ్రంథములు

| | | |
|---|---|---|
| ప్రకృతి గృహవైద్యం | 2 8 0 | 2 0 0 |
| దీర్ఘరోగచికిత్సాసారము | 1 8 0 | 1 8 0 |
| ప్రాకృత చికిత్సార్ణవములు | | |
| 1 భాగము | 1 8 0 | 1 0 0 |
| 2 భాగము | 1 4 0 | 0 15 0 |
| 3 భాగము | 1 8 0 | 0 0 |
| 4 భాగము | 0 6 0 | 4 0 |
| 5 భాగము | 0 6 0 | 4 0 |
| 6 భాగము | 0 6 0 | 4 0 |
| 7 భాగము | 0 6 0 | 4 0 |
| ఉపవాసచికిత్స | 1 0 0 | 0 12 0 |
| జబ్బుచికిత్స | 0 10 0 | 0 8 0 |
| ధ్యానచికిత్స | 0 8 0 | 0 6 0 |
| జంబీరచికిత్స | 3 0 | 0 2 0 |
| యోగచికిత్స | 6 0 | 0 4 0 |
| సంవాహనచికిత్స | 6 0 | 0 4 0 |
| రక్తప్రక్షాళనచికిత్స | 5 0 | 0 3 0 |
| స్వాభావికచికిత్సా నియమములు | 5 0 | 0 4 0 |
| వైదికచికిత్సాపద్ధతి | 5 | 0 2 0 |

అడ్రసు—మేనేజరు ప్రకృతి, బెజవాడ.

సంవత్సరచందా
రు 3-0-0




విడిసంచిక
రు 0-4-0

సహజ వైద్య సచిత్ర మాసపత్రిక

సంపుటము 20 | ★ బెజవాడ. డిసెంబరు 1938 | సంచిక 12

## విషయసూచిక



## ఆరోగ్యపుచిటకాలు

1. యుక్తాయుక్త విచక్షణజ్ఞానం ఉపయోగించి మరీ తినాలి.
2. ఎక్కువనీళ్లూ, పళ్ళరసం తాగాలి.
3. దేహంలోని మలాల విమోచనం బాగా జరగాలి.
4. శుభ్రంగా స్నానం చెయ్యాలి.
5. బుద్ధిఉపయోగించి వ్యాయామం చెయ్యాలి.
6. ఉత్సాహంతో ఆడుకోవాలి.
7. తగినంత విశ్రాంతి అనుభవించాలి.
8. కావలసినంత నిద్రపోవాలి.
9. అప్పుడప్పుడు ఉపవాసం చెయ్యాలి.

(ఓం ఘృణి సూర్య ఆదిత్యోమ్)



# సౌర అష్టా

## II అధ్యాయము

### (1) మన్త్రాక్షరముల గణన

మన్త్రము = "ఓం ఘృణి, సూరియ ఆదిత్యోమ్"

ఇదియే సర్వోత్కృష్టమయిన సౌరాష్టాక్షరీమన్త్రము. ఈ మన్త్రము యజుర్వేదమునందును, అథర్వవేదమునందును గానవచ్చుచున్నది. యజుర్వేదపాఠక్రమమునను సరించి 'ఘృ-ణి, సూ-రి-య, ఆ-ది-త్య' అని యెనిమిదిఅక్షరముల 1-2-3-4-5-6-7-8 సంఖ్య, యీమన్త్రాక్షరములకు గలిగినది. "ఘృ-ణి రితి ద్వే అక్షరే, సూ-రి-య ఇతి త్రీణి, ఆ-ది-త్య ఇతి త్రీణి, ఏతద్వై సావిత్రస్యాష్టాక్షరంపదమ్" ఆద్యంతముల నున్న ఓంకారములు రెండును యీ మన్త్రాక్షరములక్రింద గణింపరు. అందుకు కారణము మాన్త్రికులిట్లు జెప్పుచున్నారు:— ఈమన్త్రమునందు సౌరశక్తి అణగియున్నది. ఈ మన్త్రము నుచ్చరించినతోడనే అందుండి యీ శక్తి వెలువడును. మన్త్రము ముగిసినతోడనే, అందే యీశక్తి లయించును. ఇట్టి సౌరశక్తియొక్క ప్రభవప్రళయములు జనన-మరణములను బోలియున్నందున యీసూతికాశౌచమునుండి శుద్ధినిబొందుటకై మన్త్రాద్యంతములయందు మాన్త్రికులు ప్రణవోచ్చారణజేయుదురు. కావుననే వీరు ప్రణవమును అష్టాక్షరములలో నొకటిగ లెక్కింపరు. 'సూర్య' శబ్దమును 'సూ-రి-య' అని విభజించిననేగాని అష్టాక్షరముల గణన కుదురదు. ఈమన్త్రపాఠమే యిప్పుడు యెక్కువ ప్రచారములో నున్నది.

ఇక అథర్వవేదీయమగు సూర్యోపనిషత్తునందు యీ సౌరమన్త్రపాఠము మఱియొకవిధముగ చెప్పబడినది. మన్త్రము:— "ఓం[1] ఘృ[2]-ణి[3], సూ[4] - ర్య[5] - ఆ[6] - ది[7] - త్య[8]" ఇందుకు ప్రమాణము - "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ। ఘృణిరితి ద్వే అక్షరే। సూర్యఇత్యక్షరద్వయం। ఆదిత్యఇతి త్రీణ్యక్షరాణి। ఏతస్యైవసూర్యస్య అష్టాక్షరో మనుః" ఆథర్వణికులు ఆది ఓంకారమును మన్త్రాక్షరములలో నొకటిగ లెక్కించుటచేత, సూర్యశబ్దమును 'సూ - రి - య' యని మూడుగ విడదీయనక్కరలేదు. ఓంకారమే పరబ్రహ్మస్వరూపమై యున్నది. "ఓమ్ ఇత్యేకాక్షరం బ్రహ్మ" ఆ ఓంకారమునుండియే యితర మన్త్రాక్షరములన్నియు గలుగుచున్నవి. "ఓంకారోచ్చారణం

# క్షరీ మన్త్రము

నృణాం దురితక్షయకారణమ్" ఓంకారము నుచ్చరించినమాత్రమున అన్నిపాపములు పారిపోవును. కావున యీఅష్టాక్షర మన్త్రమునుండి ఓంకారమును విడదీయుటకువీలులేదు. వీరిమతప్రకారము మంత్రాదియందుమాత్రమే ఓంకారముండవలయును. అంతమునందక్కఱలేదు. ఏలనన, అథర్వణవేదమన్త్రములు సిద్ధమన్త్రములు. మాన్త్రికులుజెప్పు మన్త్రమాతికాఽశౌచములు యీవేదమన్త్రములకు లేవు. "నతిథిర్న చనక్షత్రం న గ్రహో న చ చన్ద్రమా। అథర్వమన్త్ర సంప్రాప్త్యా - సర్వసిద్ధిర్భవిష్యతి" అని శ్రుతిప్రమాణము. కనుక, సూర్యోపనిషత్తు ననుసరించి మన్త్రమును "ఓం ఘృణి స్సూర్య ఆదిత్య" యనియే పఠించవలయును. ఇక మన్త్రాక్షరముల సంకేతము జెప్పబడును.

## (2) మన్త్రాక్షరముల సంకేతము

"భూమిరాపోఽనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ
అహంకార ఇతీయంమే భిన్నాప్రకృతిరష్టధా॥"
గీత.

పృథ్వ్యాదిపంచభూతములును, మనోబుద్ధ్యహంకారములును గలిసి అష్టప్రకృతు లయినవి. అందు సూర్యుడు అక్షరుడై యున్నాడు. అక్షర శబ్దమునకు అశ్ - వ్యాపించుట అను ధాతువునుండి వ్యుత్పత్తి (అశ్నేః సరః; అశ్నుతే - వ్యాప్నోతి ఇతి అక్షరః). అక్షరుడనగ వ్యాపించి యుండువాడు. అష్టప్రకృతులయందు సూర్యుడు వ్యాపించి యుండుటచే, సూర్యునికి అష్టాక్షరుడనిపేరు. అట్టివానిని జెప్పు మన్త్రము అష్టాక్షరి. సృష్ట్యాదియందు సూర్యుడు సృష్టింపదలచి ఘనీభూతుడయ్యెను. "విచికీర్షుర్ ఘనీభూతః" సూక్ష్మాంశములు నక్రమముగ స్థూలములయ్యెను. మిక్కిలి స్థూలము లయినవి భూమి, నీరు. కాఠిన్యమును సూచించు పరుషాక్షరములగు 'ఘృ-ణి' అను రెండిటిచే యీ రెండు తత్త్వములు సూచితము లయినవి. ఇవి రెండును 'భూః' అను వ్యాహృతి. ఇక, స్రవించు అనగ, చరించుస్వభావముగలవియును భూమికంటె నీటికంటె సూక్ష్మము లయినవి అగ్ని, వాయుపదార్థములు. ఇవి (సరతీతి సూర్యః) స్రవించుట అను ధాత్వర్థము గలదియును, సరళాక్షరములుగల సూర్యశబ్దముచే సూచితము లయినవి. ఇవి 'భువః' అను వ్యాహృతి. ఇక పైనజెప్పిన తత్త్వములకు 'ఆది' అనగా మూలకారణము లయినట్టివియు, అంతకంటె సూక్ష్మమైనవియు కావున "త్య"ము లయినవియు, అనగ అమూర్తములై అవ్యక్తము లయినట్టివియు అగు ఖం-మనో-బుద్ధు లను మూడు తత్త్వములును మూడక్షరములగు "ఆ-ది-త్య" శబ్దముచేత సూచింపబడినవి. ఇవి 'స్వః'అను వ్యాహృతి. ఇట్లు వ్యాహృతిరూపమయినసప్తప్రకృతులనుసప్తసప్తియగుసూర్యుడుతనశరీరముగాధరించి అందు "అహం"వాచ్యుడై యున్నాడు. సూర్యునకు 'అహమ్'అనునది రహస్యనామమని శ్రుతులు జెప్పుచున్నవి. ఇదియే "అహంకారము" ఇది

యెనిమిదవప్రకృతి. 'అహమ్' అనునది "ఓమ్" అను అక్షరముచేత సూచింపబడినది; సప్తప్రకృతులపై నున్నది. 'అహమ్' లేక "ఓమ్" దీనినే 'ఓమ్ ఇత్యేకాక్షరం బ్రహ్మ' అని యుపాసించెదము.

ఇట్టి అష్టప్రకృతులు మనశరీరమునందేయున్నవి. అందు సూర్యు డంతర్యామియై యున్నాడు. కావున, యీ అష్టాక్షరిచేత, అంతర్వర్తియగు సూర్యుని స్తోత్రముజేసినయెడల అష్టప్రకృతులు సాధకునికి వశమయి, మనస్సు అచంచలమై సాధకునికి సూర్యప్రసాదము కలుగును. మరియు సూర్య పురుషదర్శన భాగ్య మబ్బును. శ్వేతాశ్వతరోపనిషత్తునందు "(1) యుంజానః ప్రథమం మన స్తత్త్వాయసవితాధియః। అగ్నే ర్జ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత్॥ (2) యుక్తేన మనసా వయం దేవస్య సవితుస్సవే। సువర్గేయాయ శక్త్యా॥ (3) యుక్త్వాయ మనసా దేవాన్ సువర్యతో ధియాదివం। బృహజ్జ్యోతిః కరిష్యత స్సవితా ప్రసువాతితాన్॥ (4) యుంజతే మన ఉత యుంజతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః। విహోత్రాదధే వయునావిదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః." శ్వే (౨- ౧ to ౪) సూర్యుడు మనస్సును తన పరతత్త్వమునందు జేర్చి, తన జ్యోతిని జపకాలమందు కనబఱచి యీ దేహమందుండెడి అష్టతత్త్వములను నిగ్రహించియుంచునుగాక. సూర్యానుగ్రహముచేత మనస్సును నిరోధించి, సూర్యసాయుజ్యమును బొందు సామర్థ్యము మనము గలిగియుందుముగాక!

సూర్యుడు మనమనస్సును నిర్విషయముగా జేసి, మనోబుద్ధ్యహంకారములను నిగ్రహించి, బృహజ్జ్యోతియగు సూర్యపురుషుని దర్శించునట్టి శక్తి మనలకు ఇచ్చుగాక!

ఏమనుష్యులు తనమనస్సును, బుద్ధ్యాది ఇతర [illegible]ములను వశము చేసుకొనగోరెదరో, వారు మొదట అక్షరుడును అంతటవ్యాపించి,అంతయు దెలుసుకొనువాడగు సూర్యునియొక్క దయను సంపాదింపవలయును.

ఇట్టి సూర్యునికృపను సంపాదించుటకు అష్టప్రకృతులను సూచించు అష్టాక్షరీమన్త్రజపమే యుపాయము. సూర్యానుగ్రహమున అచంచలమగు మనస్సుగలిగి ధ్యానధారణసమాధియోగములు జాపకునికి లభించును.

ఇది మన్త్రాక్షరముల సంకేతము. ఇక మన్త్రదేవతయొక్క రూప మెద్దియో విచారింతము.

## (3) మన్త్రదేవతారూపము

"దేవతాయాః శరీరంతుబీజాదుత్పద్యతేధ్రువమ్" దేవతయొక్క శరీరము బీజాక్షరములనుండియే గలుగుచున్నది యని మన్త్రశాస్త్రము. బీజమునకే అక్షరమనియు, వర్ణమనియు, మాతృకయనియు నామాంతరములు.(నక్షరతీతిఅక్షరమ్) నశించునది కాదు కావున, అక్షరమునకు అక్షరమని పేరుగలిగెను. ఘృణ్యాదిఅష్టాక్షరములు సృష్టిప్రళయములందును నాశమును బొందవు. ఈ యెనిమిదియు అవినాశిగా నిత్యమై యుండును. అవినాశియగు సూర్యదేవునకు అవినాశియగు యీ యెనిమిది అక్షరములే శరీరము. కావున మన్త్రమే దేవత. ఈ అష్టాక్షరీమంత్రమునందు సూర్యు డంతర్యామియై యున్నందున, యీమన్త్రమే ఆయనరూపము. ఈఅక్షరములకు వర్ణము లనియుపేరు. ప్రతిఅక్షరమునకు నొకవిధమగు వర్ణము (అనగ రంగు) యున్నందున, అక్షరమునకు వర్ణమనిపేరు గలిగినది. అక్షరముల నుచ్చరించినతోడనే, అందుండి గలుగుధ్వనులు రంగులు మారి రూపముల

దాల్చును. ఇవియే మాతృకలు; దేవరయొక్క రూపమును గలుగజేయుటకు మాతలు; ఉత్పత్తి స్థానములు. కావున జాపకుడు అష్టాక్షరిని జపించుచు వచ్చినయెడల కొంతకాలమునకు యేదేవతను జపించునో ఆదేవతారూపము ధ్యానకాలమునందు గోచరించును. అట్టి ధ్యానధారణ సమాధులు కుదురునంతవఱకు యేదియో రూపకల్పనలతోనే దేవతను స్మరింపవలయును.

## (4) దేవతారూపము - 'ఘృణి'

"యస్య యస్య చ మన్త్రస్య - ఉద్దిష్టా యా చ దేవతా । చింతయిత్వా తదాకారం-మనసా జపమాచరేత్॥" అనిభూతశుద్ధితంత్రమున జెప్పబడినది. దేవతయొక్క నామస్మరణ చాలదు. రూపచింతనయును జేయవలయును. అట్లు నామరూపముల రెంటినిజేర్చి చేయు జపమే ఫలకారియగును. మఱియు ఉపాస్యదేవతను దెలిసికొనక జేయు యుపాసనను వేదము నిషేధించుచున్నది. "ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావ మన్వాయత్తా తాం చే దవిద్వాన్ప్రస్తోష్యసి- మూర్ధా తే విపతిష్యతీతి" (ఛాం. ౧-౧౦-౯) ఓ ప్రస్తోత! యేదేవతను నీవు స్తోత్రము జేయుచున్నావో అట్టి దేవతను నీవు దెలిసికొనకయే స్తోత్రము జేయుదువేని 'నీతల బ్రద్దలగును' అని చాక్రాయణ ఋషి ప్రస్తోతను శపించినట్లు శ్రుతివలన దెలియుచున్నది. కావున, "ఘృణి" అనియు, "సూర్య"అనియు రెండుశబ్దములచేత 'సూర్యరూపము'ను యీ సౌరాష్టాక్షరి తెలియజేయుచున్నది. ఇచ్చట 'ఘృణి' యన నేమో విచారింతము. ఘృణ అనగ ప్రకాశము- తేజస్సు. ఘృణ్ (ఘృణోతి)-ప్రకాశించుట అని ధాత్వర్థము. అట్టి ఘృణగలవాడు ఘృణి - సూర్యుడు. సూర్యునకు 'ఘృణి' యనియేగాక ఘూర్ణి (ఘూర్ణిః) అను పేరు కూడ గలదు. 'ఘృత' యనుపేరుకూడ గలదు. కాంతి ముద్దయై ఘనీభూతమైనవాడు ఘృతుడు= సూర్యుడు. అట్టి ఘృతమైన సూర్య మండలము ఘూర్ణమయినది. వర్తులాకారముగ దిరుగుచు నుండునది యని యర్థము. మండలాకారముననున్నవాడు గావున సూర్యునికి "మండలీ" యని పేరు. కావున 'ఘృణి' శబ్ద ముచ్చరించినపుడు కాంతి ఘనీభవించి, కాంతి ముద్దగ మండలాకారమున నున్నవాడు సూర్యుడని రూపచింతన జేయవచ్చును. ఇచ్చట గమనింపవలసిన విషయమొకటి యున్నది.

ఆకాశమునందు ప్రకాశించునది మనకంటికి గనబడు ఖగోళముగాదు. సూర్యమండలమునకు స్వయముగ కాంతిలేదు. చంద్రమండలమువలె సూర్యమండలమును చీకటిగోళమే. ఆ మండలమధ్యవర్తియగు దేవుడే ప్రకాశించుచున్నాడు. తాను జగత్తును సృష్టింప నిచ్ఛగించి, తన కిరణప్రసారము జేయును. ప్రళయకాలమునందు తన కిరణముల నుపసంహరించుకొని, తాను ప్రసుప్తి నొందును. అప్పుడు సూర్యగోళము చీకటిగోళమై "ఘృణ" యనగ 'కాంతి' లేకయుండును; చీకటిగోళమై యుండును. సూర్యబింబము మాత్ర ముండునుగాని కాంతి యుండదు. ఇట్లు చల్లారి చీకటిగ్రమ్మిన సూర్యగోళములు (Dark Stars) నాలుగులక్షలకోట్లు ( 4000,000,000,000 ). ఆకాశమం దిప్పటికి అర్వాచీన నక్షత్ర శాస్త్రజ్ఞులు తమ యంత్రములచే జూచియున్నారు. ఆదిత్యాంతర్గత పురుషుడు మేల్కాంచి సృష్ట్యారంభము జేయునపుడు, మఱియొక కల్పము ప్రారంభమయి, చీకటిగ్రమ్మిన ఖగోళమునుండి మఱల కిరణ ప్రసారమై సృష్టి ప్రారంభ మగును. [సశేషము]

# అలవాట్లూ మానసికారోగ్యమూ

మూర్తి
బి. ఏ. [ ఆనర్సు ]

దైహిక శ్రేయస్సుకీ, నైతిక శ్రేయస్సుకీ "అలవాటు" ఎంత ప్రధానమైన విషయమో చాలామంది ఎరగరు. మనకి అనేకములైన అలవాట్లు ఉంటాయి. అలవాటు మన రెండవ ప్రకృతి. అంటే ప్రతి మానవుడికీ కొన్ని విలక్షణమైన గుణా లుంటాయి. ఆ విలక్షణమైన గుణా లుండటం వల్లనే ఒక్కొక్క మానవుడికి ఒక్కొక్క ప్రకృతి ఉందని నిర్ణయించటానికి వీలుకలుగుతుంది. ఒక మనిషినిగూర్చి "అదేమిటిరా!" అంటే "అది ఆయనప్రకృతి" అని జవాబువస్తుంది. కాని కొన్ని "అలవాట్లను" మనం అలవాటుచేసుకొన్నట్టయితే— మంచివికానియ్యండి, చెడ్డవి కానియ్యండి— ఆ అలవాట్లు మన ప్రకృతికింద చేరిపోతాయి. అంటే ఇప్పుడు తేలిం దేమిటంటే మన పుట్టుకతోటి మనకొక ప్రకృతి ఉంటే అలవాట్లవల్ల ఏర్పడ్డ ప్రకృతి ఇంకొకటన్నమాట. అలవాటు రెండవ ప్రకృతి అనడంలో అదే అర్థము. అలవాటు రెండవ ప్రకృతిగా మారడం, లేక ఏర్పడటం మన నిత్యజీవితంలో ప్రత్యక్షంగా చూస్తూనే ఉంటాము.

మంచి అలవాట్లు మనం అలవడజేసుకొంటే జీవితంలో అనేక విషయాల్నిగురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసిన అవుసరం ఉండదు. ఈ అలవాట్లు మన రెండవ ప్రకృతి అయిపోవడంచేత ప్రతిదినం సహజంగా మనం కొన్నిపనులు నెరవేరుస్తూ ఉంటాం, అవి చేస్తున్నామని తెలియకుండానే. దానివల్ల మనకి తెలియకుండానే మేలుకలుగుతుంది. ఉదాహరణగా కొన్ని అలవాట్లు పేర్కొంటాను వినండి. మంచి గాలీ, వెలుతురూ ఉన్నగదుల్లో నివసించటం, మంచి వ్యాయామం అభ్యాసం చెయ్యటం, మంచి ఆహారం మితంగాతినటం, బాగా నమిలి అన్నం తినటం, సకాలంలో ఆహారం సేవించటం, కాలవిరేచనం అయ్యేట్టు చూసుకోవటం— ఈ మొదలైన అలవాట్లవల్ల మన కెంత మేలు చేకూరుతుందో ఆలోచించుకోండి. ఈ అలవాట్లన్నిటిని అలవరుచుకోవచ్చు. ఆ తరువాత అవి మన రెండవ ప్రకృతికింద మారిపోతాయి. మనం ఏమీ ప్రయత్నంలేకుండానే వీటిని మన నిత్య జీవితంలో అభ్యసిస్తో ఎంతో మేలుపొందుతాము.

మన అలవాట్లవల్ల మనజీవితాన్ని మనం నియమితపరచుకోగలిగినట్లయితే మన నాడీశక్తి చాలా అభివృద్ధిపొందుతుంది. ఎందుచేతనంటే అనేకములైన పనులు చెయ్యటానికి మనం మనశ్శక్తి వినియోగించి ప్రయత్నంచేత చెయ్యనక్కరలేదు. అలవాటువల్ల వాటంతటవే మనకి తెలియకుండానే మనం ప్రత్యేకశ్రద్ధ వినియోగించి మనశ్శక్తిని, నాడీశక్తిని వృథపరచుకోనక్కరలేకుండానే జరిగిపోతాయి. ఈ విధంగా చెయ్యడంవల్ల ఎల్లప్పుడూ ఆనందంగావుండటం, పరోపకారంచెయ్యటం, ఆత్మవశీకరణం మనకి అలవాటుకింద మారిపోయేటట్లు చేసికోవచ్చు. ఈ చక్కని అలవాట్లు మనం అలవర్చుకొన్నట్లయితే మనజీవితంలో అనవసరంగాపొందే శోష, ఘోష అంతా చాలా భాగం తగ్గిపోతుంది. మనకి జీవితంలో తృప్తీ, ఆనందమూ, శాంతీ ఏర్పడుతవి.

మన జీవితంమీద మన మానసికదృక్పథం మారవలసిన అవసరం చాలాఉంది. ఇంతేకాదు. మన అనారోగ్యపు అలవాట్లమీదకూడా మన మానసికదృక్పథం మారాలి. సాధారణంగా చాలా మంది తమ చెడ్డ అలవాట్లనుగురించి చెపుతూ "ఏమిచేస్తామండి బాబూ? ఏదో అలవాటైపోయాయి" అంటారు. ఈ దృక్పథం మారుతేనేగాని బాగుపడటం సంభవించదు.

నిజంగా కష్టం ఎక్కడఉన్నదంటే అలవర్చుకొన్న అలవాట్లను మార్చుకోవడంలోనే ఉంది. ఈ అలవాట్లని మార్చుకొన్నతరువాత నియమరహితమైన జీవితం గడపటం ఎంత తేలికో అంతే తేలిక, నియమబద్ధమైన జీవితం గడపటంకూడా. ఆరోగ్యనియమాలు మనల్ని బంధించవు. విముక్తుల్ని చేస్తాయి. మొట్టమొదట అవి మనల్ని బంధించినట్టు కనపడతాయి. ఎందుచేతనంటే మనం చాలా కాలంనుండీ చెయ్యటానికి అలవాటుపడ్డవాటిని వద్దనిచెపుతాయి కాబట్టి. కాని కొన్నాళ్లయిం తరువాత ఈ నియమాలు మనల్ని బంధించేవికావు. జీవితబంధాల్లోనుండి విముక్తుల్ని చేసేవేనని గ్రహిస్తాము. ఎందుచేతనంటే మునపటి అలవాట్లు మనకి తెలియకుండానే మనల్ని బంధించేవి. మనల్ని జీవితమాధుర్యం ఆస్వాదించకుండా జేసేవి. మన జీవితాలు నిరుపయోగంచేసేవి. ఇంతకంటే బంధించడం అంటే ఏమిటో ఆలోచించుకోండి! కాబట్టి మన పరిమిత పరిస్థితుల్లోనుండి అపరిమిత పరిస్థితుల్లోకి మనల్ని ఎత్తి ఉన్నతశిఖరాధిష్ఠితుల్ని చేసేవిగాని ఆరోగ్యనియమాలంటే మనల్ని అధోగతిపాలుజేసేవికాదని గట్టిగా మనం తెలుసుకోవాలి. ఈ ఆరోగ్యనియమాల్ని పాలించడం మొదలుపెడితే కష్టమైనవిగాక తేలికైనవేననీ; నిరాడంబరమైనవనీ మనం తెలుసుకోగలుగుతాము. నిజంగా అవి తేలికగా అందరకీ అందుబాటులో ఉండబట్టే మనం వాటిని జాగ్రతగా నిరంతరం ఆచరించటంవల్ల వచ్చే సత్ఫలితాలు గుర్తించలేకపోతున్నామంటే ఏమీ అతిశయోక్తి లేదు.

దురదృష్ట మేమిటంటే రోగులు వాళ్ల అలవాట్లు మార్చుకోడానికి ఒప్పుకోరు. రోగం కుదుర్చుకోడానికి డాక్టరుదగ్గిరికి వెడతారు. చక్కటి అందమైన సీసాలో మందు—ఇంకేమీ ఇతర ఆరోగ్య నియమపాలనం అక్కర్లేకుండా - గుక్కెడుతాగుతే చేత్తో తీసివేసినట్టు రోగాన్ని తీసివేస్తే చాలు వాళ్లకి. వాళ్ళకి ఉన్నవి చెడ్డఅలవాట్లని వాళ్లే అంగీకరిస్తున్నాసరే ఆ అలవాట్లు మార్చుకోడానికి ప్రయత్నంచెయ్యరు. ఆ అలవాట్లని మార్చుకోవాలంటే నిరంతర ప్రయత్నం కావాలి. సాధారణ రోగాల్ని కుదుర్చుకోవాలంటే పాతఅలవాట్లు మానేసి కొత్త అలవాట్లు అలవర్చుకోవాలి. ఆరోగ్య నియమపాలనం అంటే నిజంగా పాతఅలవాట్లు మానేసి కొత్త అలవాట్లను అలవర్చుకోవడమే. ఏదో కొద్దికొద్ది రోగచిహ్నాల్ని రూపుమాపి రోగం నయమయిందనటం కంటే పూర్తిగా ప్రాతఅలవాట్లు మానేసి క్రొత్తఅలవాట్లను అలవర్చుకోవాలి. అసలు రోగం అలాగే ఉండగా రోగచిహ్నాల్ని నయంచేస్తేమట్టుకు ఏమిలాభం ?

పై వాటివల్ల తేలిందేమిటంటే మంచి దైహికపుఅలవాట్లు అలవరుచుకొంటే జీవితంలో అనవసరమైనభారం చాలావరకు తగ్గిపోతుందనీ, నాడీశక్తి దుర్వినియోగంకూడా తగ్గిపోతుందనీ తేలింది.

ఈ విధంగానే మానసిక పరిస్థితుల్ని కూడా మార్చుకోవచ్చు. జీవితంలో నిరుత్సాహం, దైన్యము మొదలైనవన్నీ రూపుమాపవచ్చు. ఈ విధంగా పూర్వపుస్థితికీ ప్రస్తుతపుస్థితికీ కావలసినంత మార్పు తీసుకురావచ్చు.

కాని ఒక్కటిమాత్రం బాగా జ్ఞాపకముంచుకోవాలి. ఏమిటంటే అలవాట్లు మంచివి అలవర్చుకొంటే ఎంత సుందరంగానూ, సౌరభోపేతంగానూ జీవితాన్ని మారుస్తాయో అంతే అధోగతిలోకి తెస్తాయి చెడ్డఅలవాట్లు.

కాబట్టి దైహికపు టలవాట్లు సక్రమమైనవి అలవర్చుకోవట మేగాకుండా మానసికపు టలవాట్లుకూడా అలవర్చుకోవాలి. తగిన మానసికప్రవృత్తీ, తగిన విశ్రాంతీకూడా కావాలి. మన మనఃప్రవృత్తి ఎంత నిర్మలంగాఉంటే అంతమంచిది. మనం ఆరోగ్యంగాఉండాలంటే మన మానసికపు టలవాట్లు ఆరోగ్యవంతంగా ఉండాలి. మనస్సుకి శాంతీ, ప్రసన్నత ఉండాలి. ఉద్రేకం ప్రాణమిస్తుంది, ఉల్లాసాన్నికూడా కలగజేస్తుంది, ఒక్కొక్కపుడు తాత్కాలికంగా దుఃఖాన్ని ఆపివేస్తుంది. కాని అది మామూలుగా నిత్యజీవితంలో ఉండవలసిన పరిస్థితి కాదు. ఉద్రిక్తమానసుడై ఉన్నపుడు మానవుడు తన్నుతాను మరచిపోతాడు. తన వ్యక్తి నీడలోకి పోతుంది. పొంగిపొరలుకొస్తోఉన్న మనోవేగాల్లో అణగిమణగిపోతుంది. అట్లాగాకుండా నిర్మలమైందీ, శాంతయుతమైందీ జీవితముగడపాలి. శాంతి, నిర్మలత్వము వీటికోసం ఆత్మప్రతపొందడం అంటే ఆత్మజ్ఞానం కలిగిఉండడంఅన్నమాట. సహజమైన జీవితం గడపటానికి ఆత్మప్రత పొందటం అన్నమాట. ఆ నైర్మల్యం కలిగిఉండటంఅంటే పవిత్రుడై ఉండటం అన్నమాట. న్యాయంగానూ, ధర్మంగానూ, సత్యంగానూ ప్రవర్తించి ఆ పరమాత్మలో ఐక్యమవటం ఎటువంటిదో అటువంటిదే నిర్మలజీవితం గడపటంకూడాను.

మనో నైర్మల్యంవల్ల మానవుడి మానసికశక్తులు ఎంతవరకూ అభివృద్ధిచెందాలో అంతవరకూ అభివృద్ధిచెందుతాయి. భావములు సరళంగానూ, అనంతంగానూ మనోవీధిలో జనిస్తూ ఉంటాయి. చిత్తైకాగ్రత కుదురుతుంది. జ్ఞాపకశక్తీ, గ్రహణశక్తీ మనం పిలుస్తే పలుకుతూ ఉంటాయి. నిజంగా ఎవరైనా, ఎప్పుడైనా నాగరికతాభివృద్ధికి తోడ్పడేవి ఏవైనా సాధించారంటే అవి మనోనైర్మల్యం కలిగి శాంతంగా ఆలోచించడంచేత సాధించబడ్డవే. ఏ గొప్పవిషయమూ కూడా ఉద్రేకస్థితిలో సాధింపబడలేదు. ఈ విషయం మన నిత్యజీవితంలో మనఅందరి అనుభవంలో ఉన్నదే. ఏదైనా గొప్పపనిచేశామంటే మనస్సులోశాంతి భద్రంగాఉన్నపుడే చేసిఉంటాము. ప్రకృతి హృదయంలో ఏవిధంగా శాంతి నివసించిఉంటుందో అదేవిధంగా మానవహృదయంలో కూడా శాంతిఉంది. బాహ్యప్రపంచంలో అనంతమైన సందడి, కలత, మార్పు, అశాంతి, క్షోభము ఉన్నవి. హృదయంలో మాత్రము అకలంకమైన శాంతి ప్రవహిస్తున్నది. సముద్రపైభాగము పవనతాడితమై అల్లకల్లోలముగా నుండవచ్చును. కాని ఏ తుపానుకూడ సముద్రము యొక్క శాంతహృదయంలో ప్రవేశించి కలతపరుపలేదు. ప్రకృతిమధ్యమున శాంతి నిబిడీకృతమైయుంది. కొండల్లోనూ, కోనల్లోనూ, అడవిమధ్యల్లోనూ, సృష్టి అంతలోనూ ఈ శాంతియే

మానవహృదయంలో కూడా తావు ఏర్పరచుకొనిఉంది. సృష్టియొక్క హృదయమేగా మానవుడు మరి! తుపానులవల్ల ఆతని బాహ్యశరీరం కంపింపబడు గాక! కష్టపరంపరలు అతని మనస్సుని వ్యాకులపరచు గాక! తారుమారు కావింపబడిన ఆశలు, సఫలీకృతముగాని ఆశయాలూ ఇవన్నీ ఆతని హృదయవీణాతంత్రుల్ని అపశ్రుతిగా మోగించుగాక! కాని ఆంతరశాంతి, నిశ్శబ్దతమాత్రము బాహ్యమైన అల్లకల్లోలాలవల్ల చలింపదు. అదిమాత్రము రోగం, దారిద్ర్యం, దురదృష్టమూ - వీటివల్ల ఒక్క వీసంకూడా తారుమారు కావు. ఈ దివ్యమైనశాంతి హృదయ కుహరంలో దాగిఉంటుంది. అది దేవుడు విశ్రాంతిదీసుకొను స్థానము.

పైన వివరించినవి అనుసరించి మనం మనోనైర్మల్యం కాపాడుకోవచ్చు. సాధారణంగా దేహ అస్వాస్థ్యానికి అసంతృప్తి కారణము. వ్యాకులత, కలత, చిరాకూ, భయమూ - ఇవి సాధారణంగా బాహ్యకారణాలవల్ల కలుగుతున్నట్టు కనపడ్డా - వీటికి కారణము దేహంలో ఏదో దాగి ఉంటుంది. ఈదైహికకారణం కనిపెట్టడం చాలా కష్టము. దేహంలో అస్వస్థతగా ఉంటే అట్టి దానికి ఏదన్నా అసంతృప్తే ఉండితీరాలి కారణంగా.

దేహంలో ఆరోగ్యంగా ఉంటే మానసికశక్తులుకూడా ఉద్బుద్ధమవుతాయి. మనోశక్తుల్ని ఉపయోగించి చెయ్యవలసిన పనుల్లో ఏమైనా లోపం కలుగుతే దేహస్వాస్థ్యంలో లోపం ఉన్నదన్నమాట. దేహస్వాస్థ్యం కుదుర్చుకొంటే మానసికశక్తుల్తో చెయ్యవలసినపనులు సులభంగా నెరవేరుతాయి ముఖ్యంగా కళాసామ్రాజ్యంలో ఈ విషయం మరీ మనకి స్పష్టమవుతుంది. మానవుని భావావేశము- ఉత్సాహమూ - వీటిమీద ఆధారపడివుంటుంది కళావస్తునిర్మాణం. ఒక ప్రఖ్యాతి గాంచిన శిల్పకారుడు తన అస్వాస్థ్యంవల్ల పేరు పోగొట్టుకొన్నాడు. మళ్లీ దేహారోగ్యం సంపాదించి బలే అనిపించుకోగల కళావస్తువును సృజించాడు. ఇంతకంటే ఏమి తార్కాణం కావాలి? దేహానికి మనస్సుకీ ఉన్న సంబంధం తెలియబరచడానికి?

మనస్సు నీడనుండి సూర్యకాంతివైపునకు మరలినపుడు దేహంకూడా ఆకాంతిని స్వీకరిస్తుంది. ఎల్లపుడూ ఆహ్లాదంతో ఉండటంవల్ల చాలామట్టుకు బాహ్యపరిస్థితులికి లొంగకుండా ఉండవచ్చు. ఈ మనస్తత్వము కొందరిలో మనం పరికిస్తాము. కాని కొందరు ఎపుడూ వాళ్ళ జన్మలో నవ్విన పాపాన్ని పోరు. వాళ్ళుకూడా కావాలని అలవాటుచేస్తే ఆహ్లాదంగా ఉండేశక్తి వస్తుంది.

అన్నిపరిస్థితుల్లోనూ సమభావంతో ఉండటంయొక్కరహస్యం ఏమిటంటే? కలతా, అశాంతీ, భయమూ వీటిని లెక్కచెయ్యకపోవడమే. మనస్సుని ఇంకోవాటిమీదికి త్రిప్పి అవి అసలుఉన్నాయనే భావమే లేకుండా చేసుకోవాలి. మనస్సులో పెట్టుకొని మనస్సుని భారవంతంగాచేసుకొంటే లాభంలేదు. మరచిపోవాలి వాటిని. మనశ్రద్ధని వశీకరణంలో ఉంచుకోవటంలోనే మనస్సుయొక్క ఆరోగ్యంఅంతా ఇమిడిఉంది. అందుకే మనవాళ్లు మనస్సు కోతివంటిదనీ, చిలిపిచేష్టలు చెయ్యకుండా దాన్ని పగ్గాలుపెట్టి బిగించిఉంచాలనీ చెప్పారు.

సద్గతి సత్రికరణాల కొరకు
సంసార గోష్ఠి

# పెళ్ళాం మాట వినక

[వరదారావు : బి. ఎ. ప్యాసయినాడు - ఉన్నవాడు - కవిత్వం వ్రాస్తాడు. సరస్వతి : భార్య - చదువుకున్నది - భర్తదురభ్యాసాలకు విసిగి చివరకు మందలించాలని ప్రయత్నిస్తోంది. వూళ్ళో తిరిగి పొద్దుతిరిగింతరువాత భోజనానికి వచ్చాడు.]

వరదారావు:— తలుపు...తలుపు.

•సరస్వతి:— తలుపా-ద్వారబంధమా !

వర:— ఏమిటా చదువు. తెలివెక్కువయిపోతోంది. ఇంట్లో కాలుపెట్టటంతోనే ఒకటేగోణగోణ.

సర:— అంటే మీరు వూరికే యిదవుతారు కానియ్యండి యిపుడెంతటయిమయింది చెప్పండి! ఆదివారం పూటకూడా నాడావిడేనా. దానికిఅంతులేదూ ?

వర:— ఏమిటా ఆవేదనా? సరిగ్గా 12 గంటలయిందోలేదో ఒకటే విలవిలా గిలగిలాను.

సర:— సరిగ్గా గడియారంచూచిచెప్పండి యిపుడు పన్నెండేనాఅయింది. యెవరికో మొద్దుకు చెప్పినట్లు చెపుతారేమిటి ఒంటిగంటదాటుతుంటే!

వర:— నువ్వా మొద్దువి ? మొగుడితో పోట్లాడమనేగా మీవాళ్ళు నీకు చదువుచెప్పించింది.

సర:— చాల్లెండి అవిగో వేడినీళ్ళు పంపుదగ్గరపెట్టా - స్నానం చెయ్యండి. పట్టుబట్టయిక్కడపెడుతున్నా, లెండి భోజనానంతరం దండన కానిద్దురుగాని.

... ... ...

సర:— అయితే తమలపాకుకిల్లీ నాకేదండి? నాచిన్ని బొజ్జకే శ్రీరామరక్షని మీకు తెచ్చుకుంటే సరిపోతుందేం ?

వర:— తెచ్చినప్పుడు వేసుకుని ఏడిచావుగనక నా యిపుడు లేదనిదుగ్ధ! కావలిస్తే తెప్పించుకోరాదూ?

సర:— సరే మిమ్మల్ని ఒకటిఅడుగుతున్నా కోప్పడకుండా సమాధానం చెప్పండి.

వర:— ఏమిటారాచకీయం, అతివినయంగా అడుగుతున్నావు.

సర:— మాకేమిరాచకీయా లుంటాయిగానీ యిట్లామీరు అకాలంగా భోజనానికివస్తే యింట్లోవాళ్ళు చావాలా బతకాలా చెప్పండి. యికయింతేనా యేదైనా మార్చుకునేదివుందా ?

వర:— నిన్నింతవరకు ఎవరు కూర్చోమన్నారంట. ముందుగా భోంచెయ్యటానికి యిష్టంలేకపోతే యింత టిఫిన్ తీసుకొని టీగాని కాఫీగాని తాగి వుండకుండా ఎవరొద్దన్నారుచెప్పు.

సర:— ఆవిషయానికే యింతవరకూ తరిచింది. మీరనేది పొద్దున్నే లేస్తూనే పాయిరాజేసుకుని బయటికి వెళ్ళివచ్చిన బట్టతోనే ముఖం కడిగి కడుక్కోకుండా పెసరట్లు కాఫీ చేసుకుని సూర్యోదయం అయీకాకముందే ఉదరపూజ చెయ్యాలంటారు. అంతేనా ? చంటిపిలలకు ఉగు సూర్యోదయం కాకుండా పెట్టినట్లు మనంకూడాయింత కడుపులోకి వేసుకోంది ఇంకోపనికి బయలుదేరకూడ దంటారు కాదూ !

వర:— ఏమిటావ్యాఖ్యానం? అంతపట్టింపయితే స్నానం తులసిపూజా గౌరీపూజా చేసుకునే ఏకాచుకోరాదూ?

సర:— అదేనండీ ఏకంగామానికయితేనేం సూర్యోదయం కాకముందే ఏదోవొకటి ప్రాశన చెయ్యాలి- అంతేగా.

వర :యిష్టమయితేచెయ్యి? లేకపోతే మానెయ్యి. అంత బలవంతం గొంతుమీదికేం రాలా? దీనికింతరాద్ధాంతం చేస్తున్నావు.

సర:— యింట్లో నేను చేసిపెట్టకపోతే మీకాఫీక్లబ్ వుందనేగా మీ దిలాసా. పోనీనన్నుకూడా మీతో తీసుకెళ్ళకూడదు నాకీవంటగొడవలేకుండా.

వర:— అట్లాగయితే యింటికే తెప్పిస్తాను.

సర:— మనపేరిగాడితోనేనా ?

వర:— ఛా! అక్కడనుంచి యెవరితోనైనా పంపేటట్టు మాట్లాడతా. నన్ను తీసుకురమ్మంటావేం టిఫిన్ కారియరు బ్రాహ్మడులాగా పొట్లాలు చంకని పెట్టుకుని.

సర:— అయ్యో మిమ్మల్ని తీసుకురమ్మంటానా? ఛాఅంటారేమిటి. తీసుకురావటానికి కూడా డబ్బెందుకు, మన పేరుతో తెప్పించకూడదూ యిడ్డెన్ పిండి పెసరట్టు మీద పచ్చడి రుబ్బే తూరుపువేనాదివాళ్ళకంటే చెడ్డాడేమిటి పేరుగాడు.

వర:— వాళ్ళు ఎట్లాఏడుస్తారో ఎవరికి కనపడుతుంది ఆపాపంవాళ్ళదే.

# చెడిపోయిన అభాగ్యజీవి

కోట శ్రీరాములు

సర:—ఎవళ్ళు ఏదిఏడిచినా సుబ్రహ్మణ్యయ్యరుగారి చేతితో ఉదయం 6 అయ్యేసరికల్లా యిడ్డెన్ ప్రాశన అయిపోవాలంటారు.

వర:— యివ్వాళ కాఫీహోటల్ మీద పట్టించావేమిటి. యిష్టమయినవాళ్ళు వెళతారు, కష్టమయినవాళ్ళు మానుతారు. అయ్యరుగారు యెవరిని ఆహ్వానించటంలా.

సర:—అయ్యరు పేరెత్తేప్పడికి కళ్ళు రిమారే. యీ కాఫీ హోటల్ అయ్యర్లంతా బుద్ధిమంతులయి కట్టుకట్టి యింకోక సీమదేశంపాలయిపోయినారంటే ఆంధ్ర రాష్ట్రం ఆంధ్రరాష్ట్రంఅంటూ అదిరిపడే మీ ఆంధ్రయువకుల అదిరిపాటు కుదిరిపోతుంది. మీరు అరవవాళ్ళమీద యెగిరిపడుతున్నందుకు వాళ్ళ సాంబారు ఒక గుక్కెడు మీ గొంతుకల్లో దిగనీయకుండావుంటే ప్రాణాలు శోషపోయి ఒక మూల ఒదిగివుంటారు.

వర:—అహా! రాజకీయ సూత్రాలు ముచ్చటిస్తున్నావే. అరవవాళ్ళు అంతపనుచేస్తే తెనుగువాళ్ళు తెల్లమొఖం వేస్తారనుకున్నావేం. ఆంధ్రరాష్ట్రంవచ్చిందంటే అరవహోటళ్ళు బాయికాట్ చేయించి ఆంధ్రాహోటళ్ళు పెట్టిస్తాం.

సర:—యెటుతిరిగీ కాఫీమాట మరవరు. అప్పుడు యిడ్లీమీద గోంగూరపులుసుని ప్రవేశపెడతారు గాబోలేం?

వర:—అంత నవ్వులాటగా మాట్లాడకు, అది సాంబారుకంటె నయమే. అందులో అయిరన్ (Iron) వుంది.

సర:—అయితే మా అన్నయ్యచెప్పాడు. కాఫీహోటల్‌లో మీ ప్రక్కనే జట్కాతోలేవాళ్ళు, కాలువలు బాగుచేసేవాళ్ళు, తట్టకూలీలు వచ్చికూర్చొని కాఫీ యిడ్లీ పుచ్చుకుంటారుటగా. మీ కెట్లా సహిస్తుందండీ?

వర:—సరేలే మీ అన్నగారినే యెత్తావు. పప్పుబెల్లం తింటే పళ్ళకుజబ్బట. కారంఉప్పు కళ్ళకు జబ్బట. పూరగాయలతో మాయరోగాలువస్తాయ్యట. దుంపకూరలతో దుంపతెగిపోతారుట. యింకా యేమిటో తినేది. ఆయన అసికలు నా అసికలు. మధ్యాహ్నంపూట ఆకలేస్తే భగవత్ప్రసాదంలాగా రెండరటిపళ్ళు కళ్ళు మిటకరించుకుంటూ మింగి ఒక నారింజకాయ తినాలట. బాగావుంది రాను రాను. ఆ అన్నకు చెల్లివికాదూ? హోటల్‌లో యెవరిప్రక్క యెవరేడుస్తారో నాకెందుకు. నేను మాత్రం ప్రత్యేకంగా కూర్చుంటా.

సర:—సరే కానియ్యండీ! నేనుకూడా ఒక మానవవ్యక్తినని, మంచి చెడు గ్రహించగల ఒక స్త్రీనని, మీతో సమానప్రతిపత్తిబాధ్యతలుగల గృహిణినని, మీ ప్రాణస్నేహితులవంటి స్నేహితురాలనని మీ మనసులో సంకల్పించుకుని నాకు తగిన మర్యాదలిచ్చి నేనడిగినవాటికి సమాధానమిస్తారూ?

వర:—ఓహో చాలావరకు వెళ్ళావే! అట్లాగయితే సావకాశంగా గదిలో కూర్చుని మాట్లాడుదాం పద. మొఖమాటంలేకుండా నీ యిష్టంవచ్చినవి అడిగెయ్యి. ఒకటిచెయ్యి. క్వశ్చన్ పేపరులాగ వ్రాసియ్యి. ఒక్కొక్కదానికి సమాధానం చెప్తతా?

సర:—మీ బిజినెస్‌కుయుక్తులు చెప్పకండి. ఒకటొకటిగా అడుగుతా. సమాధానం చెప్పండి.

వర: పోనీ అట్లాగే కానియ్యి.

సర: -అయితే మీరు ప్రొద్దున్నే 6 కొట్టీకొట్టకముందే ముఖంకడుక్కొని స్నానసంధ్యా లేకుండా పిలుస్తున్నా వినిపించుకోకుండా కాఫీహోటల్ వేపుకు పరిగెత్తి ఆ గుక్కెడు కాఫీ గొంతులోకి జారితేనేగాని నిలవరే యెందుచేత? అదంతా ఆకలేనా చెప్పండి? యిల్లా అడుగుతున్నానని ఏమనుకోకండి. భార్యనుగాబట్టి నే చేయగలిగిం దేమన్నావుంటే చేద్దామని.

వర: ఆలోచించి ఆలోచించి బలేప్రశ్న వేశావుపో. పిచ్చిదానా! లేవటంతోనే శోషవచ్చా కాఫీహోటల్‌కువెళ్ళేది? అదొక అలవాటు. అది కాకపోయినా ఆవేళయేసరికల్లా కడుపులో మంటపుట్టి ఆ గుక్కెడుకాఫీ కడుపులో పడేవరకు పిచ్చెత్తినట్లుంటుంది.

సర- -అయితే అలవాటుతప్పించకూడదని కాఫీహోటల్‌కు వెళ్ళటమా? మంటచల్లార్చుకుని పిచ్చికుదుర్చుకునేందుకా వెళ్ళటం?

వర:—ఏడిసింది, అలవాటేంచేస్తుందికాని కాఫీతాగక పోతే కడుపులో మంటపుట్టి ప్రాణంసొరపోయి తలకాయినొప్పి వస్తుంది.

సర:—సరిగా సమాధానంరాలా. ఆకలికా అలవాటునా కాఫీహోటల్‌కు వెళ్ళటం?

వర:—ఏమిటానిక్కొచ్చి? అలవాటుగావచ్చే ఆకలి తీర్చుకు నేందుకు. సరేనా జవాబు వచ్చినట్టేనా?

సర:—అట్లాగయితే మంటతీర్చుకునేందుకు ఆదరా బీదరా హోటల్‌కుపోయి ఆరగించకపోతే పొద్దున్నే వంటచేసిపెడుతా, సావకాశంగా భోజనంచేసి ఎందుకు పోగూడదూ?

వర:—లేచీలేవటంతోటే చంటిపిల్లాడికిమల్లే భోంచెయ్య మంటావ్వా. ఆకలయి యేడుస్తుందీ? చెప్పు.

సర:—ఆకలితీర్చుకునేందుకేగా కాఫీహోటల్‌కు వెళతా మన్నారు?

వర:—ఛా! అదా నేనంది నేచెప్పేది? సరీగ్గా అర్థంచేసుకో లేక నన్ను కంగారుచేస్తున్నావు.

:—అర్థంచేసుకోలేక నేను కంగారుపడుతున్నానో నచ్చచెప్పలేక మీరు కంగారుపడుతున్నారో నా కర్థంకావటంలా.

వర:—పోనీ నీవుద్దేశప్రకారమే ఆకలిలేకపోయినా మరి పోయిడబ్బేక్కొవుండి పానకాలరాయుడి బిలంలో పానకంపోసినట్లు యింతకాఫీయిడ్డేన్‌లు పొట్టలో వేస్తున్నాం. సరేనా.

సర:—అయ్యో నేనట్టాఅంటానా. నాకుమాత్రం యింగిత జ్ఞానంలేదూ? బిద్యోప్యాసయారు; ఒకరికి చెప్పవలసినవారు. కాఫీలో కాఫిన్ అనే విషపదార్థముందట. అది నాడులను బలహీనపరచి అనారోగ్యం తెస్తుందట. అటువంటిదెందుకు తాగాలా అనేదుగ్ధచేత అంటున్నానండి. చూడండి, డికాత్షన్ యెంతచేదుగా వుంటుందో? మనవాళ్లీచేదు విషజ్వాలలంటారు కూడాను.

వర:—అదెవరుచెప్పారు?

సర:—పుస్తకంలో చదివా.

వర:—అయితే వోవల్‌టిన్ తాగేది.

సర:—అందులో కోడిగుడ్డురసం వుంటుందిటగా అందు చేత చల్లారింతర్వాత నీచువాసన వేస్తుందిట.

వర:—అని మీఅన్నయ్య చెప్పాడేమిటి?

సర:—అదీపుస్తకాల్లోనే చదివా.

వర:—ఛీ! ఛీ! పూర్వం ముసలాళ్ళకు స్త్రీవిషయంలోఅంత అనుభవం లేనట్టు తోస్తుంది. "భార్యారూపవతీ శత్రుః" అనేకంటే "భార్యావిదుషీశత్రుః" అని చెప్పివుంటే సంతోషించేవాడిని. గొంతుక్కొవురి వచ్చిపడింది

—అదిగో అప్పుడే మూతిబిగుస్తున్నారు. ఏదయినా వస్తే నిమిషంలో బిగించుకుపోతారు. నేనట్లావుండ లేను. బతిమాలయినా మాట్లాడించుకుంటేనేగాని నాకుతోచదు ఎందుకంటే, మీరు కాఫీతాగే విషయంలో నన్ను ఒప్పించలేరు. నాకు నచ్చదు కూడాను. కనుక మనం ఒకరాజీకివద్దాం. ఈకాఫీ తాగేవాళ్ళంతాయింతే. ఇంతలో విసిగిపోతారు.

వర:—ఆ రాజీ యేమిటో!

సర—ఆకలేసినందున కాఫీ తాగుతున్నా నంటున్నారు గాబట్టి పొద్దున్నే ఆహారం పుచ్చుకునేందుకు నే సమ్మతిస్తాను. కాఫీ జబ్బంటున్నానుగాబట్టి అది మీరు మానాలి.

వర:—మానేసి యేం పుచ్చుకోవాలిట?

సర:—నా చేతిమీదుగ ఒక గ్లాసెడు బత్తాయిరసమో నారింజరసమో తాగి పనిమీద వెళ్ళండి.

వర:—జబ్బువాళ్ళకిచ్చినట్లు యిస్తావా ఏదో కొత్తపద్ధతి తోక్కొతలచావు కానీ?

సర:—యేదో తాగాలి తాగాలంటూ పాలనలత పిల్లాడి లాగా అట్లా తెంపరలాడతారేమండీ! పోనీ బోగి లాగా గ్లాసెడుపాలు పుచ్చుకొనిచూడండి. స్నానం చేసుకు పనిచేసుకువచ్చి పదిగంటలకల్లా భోంచే సుకు యేదయినా చదువుకుని కాస్సేపు పడుకోండి యెంత హాయిగా వుంటుందో! మా అన్నయ్య — వదినా — తమ్ముడూ ఏమీ పుచ్చుకోకుండా వుండ టంలా నేనేమయినా పొద్దున్నే తింటున్నానా? చెప్పండి?

వర:—యేమోబాబూ! ఒకసారి నేను మీవూరొచ్చి కాఫీ లేక పడినకర్మం యింతంతకాదు. నాఅవస్థ చూడ లేక మీఅమ్మ కాఫీ కాచేమాదిరి వూళ్ళో దరియాప్తు చేసుకువచ్చి కాఫీ కషాయం పెట్టింది. చేదుగా వుందనేప్పటికి సగానేరు బెల్లపుగడ్డ తరిగి బెల్లపు పాకంపట్టింది.

సర:—దీపావళికి వచ్చినప్పుడుకాదూ! మీకు తెల్లవారు ఝామున తలంటిపోసి 'మీఆయన కాఫీతాగాలట అది కాచాలని మా అమ్మ కంగారు పడుతుంటే నేనుకూడా తెల్లారకట్ట వంట చెయ్యాలిగాబోలని

భయమేసింది. మా అన్నయ్యావాళ్ళు మీ ఆయన పాచినోట కషాయం తాగుతాడని యేడిపించేవాళ్లు.

వర:—ఏడిపిస్తారు - ఏడిపించరూ, పల్లెటూరి బ్రాహ్మణ్యాలు? యేమీ తినకుండా కడుపు మాడ్చుకుని వుండటం, కాకలు కాలేక, బోదివేళ పత్యంపుచ్చుకున్నట్లు యింతబీరకాయో, సొరకాయో, తోటకూరో, బచ్చలిమబ్బులో యిది అది కాకపోతే యింతదొగ్గలిపులుసో వేసుకుని నిశి తిరిగింతరువాత మింగటం అందరకూ సయించవద్దూ.

సర:—అవును మీరు బస్తీ బ్రహ్మణ్యులయే అవి యెట్లా సయిస్తయి పొద్దున్నే మీకు కాఫీ యిడ్డెన్లు? తరువాత భోజనంలోకి వేల్పుళ్ళు పేల్పుళ్లు మధ్యాహ్నం టీలు టాలు రాత్రికి రోస్టులు. మరిచేపోయినా యీ మధ్యకాలంలో టీపార్టీలు బాళ్ళు జరుగుతాయయ్యో అవి వాళ్లకెట్లావస్తాయి? మీకు ప్రతిగొందిలో కాఫీహోటల్ ప్రత్యక్షమవుతుంది అవి వాళ్ళకేవి? అంతవూళ్లో ఒకహోటలయినా లేదయ్యో. కాకపోతే మా కవతగాళ్ళు తాగేందుకు మాలపల్లిదగ్గర ఒకకల్లుకొట్టుమాత్రం వుంది. వాళ్ళయినా పాచిముఖంతో తాగరు. పనులన్నీ పూర్తిచేసుకు పావకాళంగా సాయంత్రం తాగుతారు. అదయినా 4,5 రోజుల కొకసారి. నేనింత అనుభవంతో నున్నాననుకుంటున్నారాయేమయినా మాఅన్నతో ఒక అరగంట నడచిచూస్తారూ?

వర:—సరేగానీ కవతగాళ్లని పిలుచుకురావటానికి వెళ్లి అన్నగారు కొంచెం........ పుచ్చుకుని వాళ్లతో చిత్తులు బోకులు చిత్తగిస్తారేమో.

సర:—అబ్బే వాళ్లకక్కడ క్లబ్‌లున్నాయా లాడ్జిలున్నాయా! డ్రింకులు తాగ ఢంకాలు కొట్టబోయి ఢింకీలు కొట్టటానికి. కల్లుమానెయ్యాలనే కాంగ్రెసువారు ముందు కాఫీమాన్పిస్తేబాగుండు. అబ్బే అదెక్కడిది కల్లుతాగొద్దని చెప్పబోయేముందు రెండు లోటాలు కాఫీతాగితేనేగాని వారికి పీక పెగలదు. వారు యింకెక్కడ చేస్తారూ.

వర:—యిక యేడిచావు నోరుమూయి పాకం పక్వంగా వుండని. యెవడిసొమ్మేం ఖర్చుచేయటల్లా. నాఆర్జితం యిది. కడుపుమాడ్చుకు చావకుండా వున్నన్ని రోజులు సంపాయించుకుతిని హాయిగా కాలం గడపాలి.

సర:—దానికయినా తలాతోకవుంది. క్రిందటి సంవత్సరం వచ్చిన ఖాయిలాకు మొక్కిన మొక్కులింకా చెల్లాలా.

వర:—మొక్కుబడి చెల్లించకుండా చచ్చిపోయి నీమెడకు చుడతానని భయమేమో? డబ్బు కావాలిలాగావుంది.

సర:—యెందుకండీ అట్లా అంటారూ. కానికాలాలుగా వున్నాయి. వెధవడబ్బు నేనడుగుతున్నానా? నా ప్రాణంకంటెకూడా మీరే ననుకుంటూన్నానే! నన్నెందుకండీ యిన్నివిధాల వేధిస్తారూ.

వర:—పైగా నేను వేధిస్తున్నానా, యిదేంచేశారు. అదెందుకు, యిదెందుకు అంటూ మెదిల్తే కదిల్తే రంకులు కడుతూ నే వేధిస్తున్నానంటున్నావా? మొగుణ్ణి కొట్టి మొఱ్ఱెత్తటం యిదే. చాల్లే యిదొకటి నేర్చావు. చక్కిలిగిలి పెట్టడం ఆ పని చెయ్యడం ముడ్డిగిల్లి జోలపాడినట్టు.

సర:—దేనికట్టా వెతుక్కుంటున్నారూ. సరే సరే ధూపానికా యీ గదంతా శిగిరెట్టుపొగతో నిండిపోయింది ప్రతి వస్తువు శిగిరెట్టువాసనే. ఆపొగతో తల తిరిగిపోతోందంటే వినరుగా యెన్నిసార్లు కక్కుకున్నా యింతే యీ మనిషితో. యెంత మొత్తుకుంటేనేం.

వర:—నే వెళ్ళిన తరువాత సాంబ్రాణికడ్డీ వెలిగించుకో.

సర:—బాగానేవుంది మంచి సలహా యిచ్చారు, సరే మళ్ళీ యింకొకటడుగుతున్నా సమాధానం చెప్పండి.

వర:—మళ్ళీ యింకేం వచ్చింది అడిగెయ్యి వెనకాడను.

సర:—ఆకలేస్తోందని కాఫీతాగుతున్నామన్నారు. బాగావుంది. యిప్పుడు ఆకలేస్తోందనా ప్రాణం శోషపోతోందనా తలనొప్పి వస్తోందనా యీ శిగిరెట్టు కాల్చడం? కోపంలేకుండా సమాధాన మిస్తానని మాటిచ్చారు మరిచిపోకండి.

వర:—యేడిచినట్లుంది తలా తోక లేని ప్రశ్న అడుగుతున్నావు నేను నిన్నడిగేవాటికి ముందు సమాధానం చెప్పు. మీ ఆడవాళ్ళు నగలకోసం సోపులు స్నోలు సెంట్లకోసం వెంపరలాడటం యెందుకు? ఒళ్ళు తెలికయా, దురదెక్కా, లేక ఆరోగ్యం చెడా?

సర:—మీ ఆడవాళ్ళని సమిష్టిగా మాట్లాడకండి. ఆడవాళ్ళు చేస్తేనేం మొగవాళ్ళు చేస్తేనేం తప్పు తప్పే. భర్త డబ్బులేక యిబ్బంది పడుతుంటే నగలకోసం ఆరాటపడటం తప్పే. నేనెప్పుడయినా నగలకోసం మిమ్మల్ని నిర్బంధించానా? మీయిష్టమొచ్చి చేయించారుకాని.

# మృత్యుముఖమునుండి

**కొమరగిరి సాంబశివరావు**

12వ యేట శ్రీ పువ్వాడ పేర్రాజుగారి శిష్యత్వమును బొందు భాగ్యము కల్గినది. వారి బోధనలను విన్నప్పటినుండియు దుర్వ్యసనములకు దూరమగుటకు ప్రకృతికి సమీపమగుటకు సాధనము చేయుచుంటిని. పిమ్మట కొంతకాలమునకు శ్రీ కూనెమహర్షి గ్రంథములను చదివి అందలి ముఖ్యసూత్రముల గ్రహించితిని. కాని ప మును మాత్రమవలంబింపలేదు.

ఇంతలో మన్యంలో ఉద్యోగం, దానితో బాటు మలేరియాజ్వరం ప్రాప్తించెను. ఉద్యోగంవదలి స్వగ్రామంచేరాను. తరుచు జ్వరం తీవ్రంగా వచ్చెడిది. దీనితో రెండు సం॥రములు బాధపడితిని. ఈకాలములో పడినపాట్లు క్లుప్తముగా వివరించెదను. జ్వరమువచ్చినపుడు విపరీతపుచలి, ఒడలు నొప్పులు, కడుపులో మంట, దాహం ఉండెడివి. సాయంకాలం చెమటపట్టి, జ్వరంతగ్గి విపరీతపు ఆకలివేయుగా కనబడినదల్లా తినివేయుచుంటిని. ఒడలంతా బగ్గి, కురుపులు బయలుదేరినవి. జీర్ణశక్తి నశించెను. అనుదినము జ్వరమో, మలబద్ధమో, గ్రహణియో, అజీర్తివిరేచనములో విడువకుండా ఉండెడివి. ఒక్కొక్కప్పుడు తిన్న ఆహారం రూపభేదం పొందకుండా విరేచనమయ్యెడిది. నీరసం, ఆకలి అధికం, జీవితంమీద నిరాశ కల్గినది. మొత్తముమీద బైరాగి విభూతి మొదలు ఫష్టుసర్జిను బాటిలువరకు చూచితిని. ఫలితముమాత్రము శూన్యము. అసలే సున్నితతత్వము. దానితో బాటు అసాధ్యవ్యాధి. పిండి బొమ్మవలె తయారైతిని. జీవితం తలచుకుంటే దుఃఖం పొంగివచ్చెడిది.

రాజమండ్రిలో గవర్నమెంటుఆసుపత్రికి చేరితిని. అక్కడ ఒక ఆనరరీ డాక్టరు M. B. B. S. నన్ను పరీక్షించెను. రక్తము Anaemic, మలములో Samlialisis, ప్రేగులు Tubercular, ఊపిరితిత్తులు T. B. అని వారు వ్రాసిరి. "అయ్యా ఇట్టివ్యాధి కలుగుటకు కారణమేమండి"యని నేను ప్రశ్నించితిని. వారు "నీకు వ్యాధి కుదరవలెనా, కారణం కావలెనా" యని గర్జించిరి. నేను మరి మాటాడలేదు. డాక్టరుగారు ఆసుపత్రినుండి బయటికి రమ్మనియు తాను కుదిర్చెద ననియు అనెను. (ఇది ఆనరరీడాక్టరులంతా చేసేపనియే) 15 రూపాయలు పుచ్చుకొని వారంరోజులు మందిచ్చిరి. నాకు మరి డబ్బులేదు. వారు మరి మందివ్వలేదు. కాని మందుకంటె వ్యయకరమగు పథ్యము విధించిరి. కోడిగుడ్లు పుచ్చుకొమనెను. తిరస్కరించితిని. లేనిచో నీ బ్రతుకింతే యనెను. వివేకము నశించుటచేతను, జీవితమందలి యాశచేతను ఆ పాపకార్యమున కొడబడితిని. మొదటి రోజులలో కడుపులోకోడిపిల్లలుకూయుచున్నట్లుండెడిది. క్రమంగాఅలవాటయినది. ఉదయం గుడ్లు, పాలు, 10 గం॥లకు భోజనం, మధ్యాహ్నము ఓవల్టయిను, సాయంకాలం పండ్లు, రాత్రి గోధుమ రొట్టె, పాలు విధించిరి. ఇట్లు రెండునెలలుచేసితిని. ఉన్నడబ్బు, కాలము ఓవల్టయిను, పాలు, మందులు, పథ్యములకు వ్యయమయ్యెడివి. మరి డబ్బు లేకపోవుటచే డాక్టరుగారిని చూడలేదు.

కొన్నినెలల తర్వాత నూడగా వారు విశాఖపట్టణం ఆసుపత్రికి వెళ్లమని అచ్చటి తన మిత్రునికి చీటి వ్రాసియిచ్చిరి. Samlialisis అను పేరు వినగానే ఫష్టుసర్జను సంతోషఆశ్చర్యములను పొందెను. అట్టి అసామాన్యవిషయము విద్యార్థులకు బోధింప నవకాశముకల్గుటచేతను, మిత్రునియొద్దనుండి వచ్చుటచేతను వెంటనే నాకు

ఆసుపత్రిలో చోటులభించెను. లేనిచో నాబోటి నిర్ధనునికి ఆసుపత్రులలో చోటెక్కడిది? అచ్చట వారంరోజులుంచి X - ray ద్వారా పరీక్షించిరి. వారికి పూర్వపుచిహ్నములేవియు గోచరింపలేదు. తుదకు cholic appendicities అని నిర్ణయించిరి. దీనికి ఆపరేషను తక్క వేరే చికిత్సలేదట. బసకు వచ్చి అప్పెండెక్సు అంటే నిఘంటువు చూచితిని. a deadly disease అని వ్రాసియుండెను. చచ్చేవాడికి ఆపరేషను యెందు కనుకున్నాను. తలచుకొన్న సింహాచలయాత్రకూడా మాని యింటికి చేరితిని. పేటెంటు మందులు త్రాగుచు, ఎవరేదిచెప్పిన నదిచేయుచు రోజులు గడపుచుంటిని. ఈరెండుసం॥రములలోను ప్రకృతి విషయమును మరువలేదు. కాని ప్రారబ్ధమునకు వశుడనగుటచే బుద్ధి యటుపోలేదు.

ఇంతలో తీవ్రమయిన గ్రహణి కల్గినది. దినమునకు 30, 40 విరేచనములయ్యేడివి. నాలుగు దినములకు కొంత శాంతించినవి. 5 వ దినమున మంచముపై పడియుండి జీవితమును గూర్చి యాలోచించితిని. ప్రకృతిమాత సందేశము వినబడెను. చచ్చినా సరే, ఇక మందు పుచ్చుకొనరాదని నిర్ణయించుకొంటిని. నాడు పథ్యము ఉప్పులేకుండా పుచ్చుకొంటిని. మిక్కిలి సుఖముగా నుండెను. కొద్దిరోజు లయినతర్వాత సుందరగోపాలరావుగారి అపక్వాహార సిద్ధాంతము కొని చదివి అపక్వాహారము ప్రారంభించి మొదటినుండియు అమితముగా తినేవాడను. అజీర్ణంచేసి జ్వరంవచ్చెను. అప్పుడు కన్నులు తెరచి రసముగల పండ్లుమాత్రము తినెడివాడను. శరీరం శుష్కించి బరువుతగ్గినది. కాని సుఖవిరేచనము నిద్ర కలిగెడివి. బుద్ధి చురుకుగా, ఉత్సాహంగా ఉండడంచేత బాగుగా చదివి, చదివినది మరపునకురాకుండుటచే అప్పుడు నేను చదువుచున్న గవర్నమెంటుపరీక్షలో ద్వితీయునిగా నెగ్గితిని. ఇది ప్రకృతిమాత నా కొసగిన ప్రథమ బహూకృతి.

పరీక్షఅయినపిదప శ్రీ పేరాజుగారి సలహాతో చికిత్స ప్రారంభించితిని. ఆవిరి, ఆతప, కటి, లింగస్నానములు, వ్యాయామము, గోధుమ జావ, కూరలు, పండ్లు మూడునెలలు సేవించితిని, అన్యపదార్థవిమోచనమయినది, బాధలుతగ్గినవి. కాని జీర్ణక్రియ పూర్తిగా క్రమపడలేదు. ఇంతలో ఉద్యోగప్రాప్తి పరగ్రామమున ఏకాంతవాసము ప్రాప్తించెను. మరల 5, 6 నెలలు అపక్వాహారంచేసితిని. ప్రత్యేకబాధలు లేక తేలికగా నుండెను. కాని కొలది మలబద్ధముండెను. ఫలాదులు లభించుట కొంతకష్టముగా నుండెను. దైవవశమున సూర్యనమస్కారములను గూర్చి తెలిసికొనుట సంభవించెను. సూర్యనమస్కారములు, ఏకాదశి ఉపవాసము, సాత్త్విక పక్వాహారము క్రమక్రమముగా ప్రారంభించితిని. 3 సంవత్సరములు గోధుమయన్నము ఉప్పులేనికూరలు, పండ్లు, కొబ్బరితో తింటిని. జీర్ణక్రియ బాగుపడెను. ఆరోగ్యము కల్గెను. తగ్గినబలము ఉత్సాహము కల్గినవి. శరీరమునకు పసిడిఛాయ కల్గినది. జీవితముపై ఆశకలిగి పరాపేక్ష లేకుండా నా పనులను నేను చేసికొన గలుగుచున్నాను.

ఇప్పుడు ఉదయము 3½, 4 గంటలకులేచి, కాలకృత్యము తీర్చుకొని, స్నానసంధ్యాదు లొనర్చి సూర్యనమస్కారములుచేసి 10-30 వరకు బడిపని చూచుకొనుచున్నాను. 10-11 మధ్య ముడిబియ్యము, ఉప్పు కారము లేని కూరలు, పొట్టు తీయని పప్పులు ఆవిరిలో (Cooker) వండి మజ్జిగతో తృప్తిగా తినుచుంటిని. రాత్రి కేవలము ఫలాహారము చేయుచున్నాను. మధ్య నెప్పుడేనా (అనుదినమూ కాదు) ఆకలిగాఉంటే రసము

గల పండ్లు తినెదను. ఉదయము ఆకలిగాఉంటే నిమ్మరసమో, మజ్జిగయో, నారింజపండ్లో తినె దను. సాయంకాలం వీలునుబట్టి నడకగాని హల, శీర్ష, సర్వాంగ, పద్మ మొదలగు ఆసనములను వేయుచున్నాను. ఆసనములు ప్రారంభించినపిదప శేషించిన బాధలుకూడా నశించినవి. ఎప్పుడైనా హెచ్చుతగ్గులువస్తే ఉపవాసము, ఆవిరి, ఆతప ము, మట్టిపట్టీలుతక్క వేరే చికిత్సలేదు. ఎన్ని దినములైనను అపక్వాహారముపై నుండగలను. నా స్నేహితులకు, విద్యార్థులకు ప్రకృతిసూత్ర ములను బోధించుచున్నాను. వ్యాధిని ప్రసా దించి నన్ను సన్మార్గమునకు త్రిప్పిన పరాత్పరు నికి ధన్యవాదము లర్పించుచున్నాను. మానవ శక్తియల్పమగుటచే దుష్టప్రవృత్తులనుండి కాపా డుమని యా జగద్రక్షకుని సదా వేడుచున్నాను.

ఓం శాంతి

ఈ క్రింద నేను గత 6 సంవత్సరములలోను అను భవముపై తెలిసికొన్న విషయముల వ్రాయు చున్నాను.

i రోగికంటె పాపిలేడు

ii రోగమునకు ప్రకృతికంటె మందులేదు

iii నమ్మకం లేనివానిచేత ప్రకృతిచికిత్సచేయిస్తే అపాయం కలుగవచ్చు

iv ప్రకృతి పేదలపాలిటి పెన్నిధి

v నోరు కడిగితేనేకాని రోగం కుదరదు

vi సాత్వికాహారమైనా అమితంగా తినరాదు

vii సంఘ మర్యాద యని విందులకు జొరబడ రాదు

viii మధ్యమధ్య తప్పులుచేస్తే ఆరోగ్యం వెనుక ముఖం పడుతుంది

ix వ్యాయామం చిత్రికవంటిది, హెచ్చుతగ్గులను సరిచేస్తుంది

x ఉపవాసం శరీరానికి మనస్సుకి శెలవుదినం లాటిది. శరీరంలో చేరిన మలములు వెలువ రింపబడును

xi ఆఖరునకంటె మొదటే ప్రకృతిచికిత్స ప్రారం భిస్తే మేలు

xii ప్రకృతి ననుసరించేవాడు సంఘపు వెక్కిరిం పులకు వెరువరాదు

xiii నమ్మకము లేనివారితో మొండివాదనకు దిగరాదు

xiv మనశ్శాంతిలేనిదే దేహశాంతి కుదురదు

xv దైవప్రార్థనలేనిది మనశ్శాంతి దేహశాంతి కుదురవు

## చిన్న గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| పురుటాలు | 0-0-6 | పొగచుట్టవలన ప్రమాదము | 0-0-3 |
| సుఖ ప్రసవము | 0-0-6 | | |
| దీర్ఘాయువు | 0-0-6 | దొరుకుచోటు:— | |
| ఆహార రసాయనశాస్త్రము | 0-1-0 | ప్రకృతి కార్యాలయటౌను, బెజవాడ. | |

# స్వీయ చరిత్ర

## రామరాజ యోగి

[ గతసంచిక తరువాయి ]

అప్పుడు మాగ్రామకరణంగారగు శ్రీ గోటేటి నాగభూషణరావుగారు అచ్చటికి దయచేసి "కృష్ణంరాజూ! నేనొక "తాడిని" నీకొసంగెదను. దానిని రెండుగా చీల్చి, నీవు నిట్రాళ్లుగా పాత దలంచిన రెండుకర్రలకు జతజేసి, నాలుగు దూలములుగా వేసి మెత్తగా గోడలుపెట్టి యిల్లు కట్టుకొమ్ము!" అని సెలవిచ్చి వెంటనే తాటిచెట్టు కొట్టించి పంపించిరి. మేము గోడను మరింత మెత్తగా పెట్టుకొంటిమి. ఇంటి పైకప్పుకు గాను తాటియాకులు గావలయును. అందుకు కృషిఁజేయుచున్న సమయములో పోలవరము నకు సరిహద్దుగ్రామమగు కలగంపూడినుంచి దైవప్రేరితుఁడై తోటకూరి (లంక) సుబ్బరాజు గారు మాయింటికి దయచేసిరి. వారికి మాయం దమితప్రేమ! మేము వారినిఁజూచి "మామ గారూ! మా కిచ్చటనైన నాల్గురూపాయల తాటియాకు కొనిపెట్టవలయు" నని యడిగితిమి. వెంటనే వారు "మీరు తాటియాకులతో తంటాలుపడఁజాలరు. నావద్ద సిద్ధముగా 50 వేల పెంకులున్నవి. అవి మీకు 100 రూపాయల కొసంగెదను. వాని, నితరులు వెయ్యి 1 కి రు 2-4-0 ల చొప్పున అడుగుచున్నారు. మీరు వెయ్యి 1 కి రు 2-0-0 ల చొప్పున యివ్వవలెను. నాలుగుదినములలో నా కీమాటయుఁ జెప్పుడు" అని చెప్పి వెళ్లిపోయిరి.

తోటకూరి సుబ్బరాజుగారు శ్రీ మొగలితుర్రు మహారాజావారితో స్నేహముజేసి వారి స్వంత తాళ్ళలో ప్రశస్తమైనవానిని కొట్టించి, యింటికి సరిపోవు సామానంతయు సిద్ధపరిచి, పెంకు తీయించి, యిటుకలు కాల్పించి, దైవగతి వే రగుటవల్ల వానినెల తుద కమ్మివేసిరి. అందలి యిటుకలు మాత్రము ఆ గ్రామములోని రామ లింగేశ్వరాలయమునకు గోడ కట్టించుటకై ధర్మము జేసిరి. పెంకు మాకు, కలప వేరొక రికి విక్రయించివేసిరి.

తదుపరి మరుదినంబున మా యగ్రజులు కాజ గ్రామంబునకు వెళ్ళి కొప్పిసెట్టి శేషయ్య, వేంకట రత్నం అను శ్రీమంతులను జూచి, "మీరు కలప సప్లయి చేసినచో నేను లంక సుబ్బరాజుగారికి పెంకుకు బజానా యిచ్చెదను." అనిజరిగిన యావ ద్వృత్తాంతము వారితో చెప్పిరి. వా రందుకు సంతోషించి "మీ యింటికి సరిపోవు తాటికలప మే మిచ్చెదము. మీరు పెంకు కొనవలెను" అని చెప్పిరి. వారి పిల్లలకు మా యగ్రజులు విద్యగర పిన విశ్వాసమే వారి నట్లు పలికించినది. వారి సాహాయ్యముపై నాధారపడి కలగంపూడి వెళ్ళి సుబ్బరాజుగారికి నాలుగు రూపాయలు బజానా యిచ్చి యొక నెలదినములు గడువుకోరి తిరిగి వచ్చిరి. ఆ సంవత్సరము వర్షములు విశేషముగా కురియుచుండెను. కాజ కాపులు కలపసప్లయి చేయుటలో సుస్తీచేసిరి. పైగా వారి యింటిలో వెంకటరత్నంకుమారుడు సుబ్బారావుకు జ్వరము రాగా 9 లంకణములు కట్టించి పథ్య మిప్పించు వరకు మా యగ్రజు లచ్చటనే యుండవలసి వచ్చినది. పెంకు తాలూకు వాయిదా సమీ పించుచున్నది. అందుకు చేయునది లేక విచా రించి వెంటనేగ్గి పాలకొల్లుపోయి మద్దికర్రలు దూలములకుగాను కొని తెప్పించితిమి. ఆ సంగతి శేషయ్యకాపు విని "కృష్ణంరాజుగారూ! దూల ములకు పనికివచ్చు చేవతాళ్లు మా పొలములో లేవు. వాసములకు పనికివచ్చునవి గలవు. వానిని కొట్టి పంపించెద" మని చెప్పి తుదకు వానిని

కూడ పంపింపఁజాలరైరి. మాటఁ దప్పఁజాలక స్త్రీల నగలు తాఁకట్టుపెట్టి రు 200 లు తెచ్చి పెంకుకు కొంత; పైకలపకు, వెదురుకు, మేకులకు, కూలీలకు కొంత, ఖర్చుజేసితిమి. ఆ కలపఁ దెప్పించుటఁజూచి శేషయ్య వేంకటరత్నంగార్లు సిగ్గుపడి యూరకొనిరి. ఈ కథవలన మేము గొప్పనీతిని నేర్చుకొంటిమి. ఎంతమంచిస్వభావముఁ గలవారినైనను సరిదే, స్వలాభతత్పరత కొంతవరకు నాటలాడించితీరునని.

మేము తలఁచినకార్యమును మధ్యమార్గములో విడిచిపెట్టుటగాని, చెప్పినవాక్యమును చెల్లింపక పోవుటగాని, యింతవఱకు నెన్నఁడును చేసియెరుగము. అట్టి దుర్లక్షణములుగలవారిమైత్రి మా కమిత మగు నసహ్యము. నెరవేర్పఁజాలనికార్యమున కుపక్రమించుటకంటె నూరకుండు టమిత శుభావహంబని మా సంపూర్ణవిశ్వాసము. నేటికిని ఎవనికైన నివ్వసంకల్పించిన వస్తువున్నచో వెంటనే యిచ్చివేతుముగాని, రేపుమాపురమ్మని త్రిప్పఁజూడము. అందువల్ల మాసంగతి నెరిగిన వారు మావద్ద ఓటిమాటఁ జెప్ప సాహసింపరు.

తుదకు అష్టకష్టములు పడి గృహమును నిలువబెట్టుకొంటిమి. అంతశ్వేదిపాలెములో మాస్వంత పొలమునంగల మామిడిచెట్లు, నేరేడుచెట్లు కొట్టించి యాకలపతో తలుపులు ద్వారబంధములు కిటికీలు చేసికొంటిమి. ఆ యింటికే "హఠయోగాశ్రమం"బని పేరుంచి పాతకొంప పీకివేసి 1917 జూన్ 12 వ తేదీని ఆశ్రమంబున ప్రవేశించితిమి. తదుపరి కొంతకాలమునకు పాలకొల్లులో తాకట్టుంచిన నగలు విడిపించి తెచ్చుకొంటిమి. ఆశ్రమముఁ గట్టినప్పుడు కొందరు గ్రామస్థులు బండ్లమున్నగునవి సప్లయిఁజేసిరి. కొందరు శరీరసహాయ మొనర్చిరి. అంతటితో మా కింటిసంబంధమగునిబ్బందితొలఁగిపోయినది. ఆశ్రమసంబంధమగుపనిఁ జేయునప్పటికి మేము ఉడికించిన కూరలతో చప్పిడి అన్నమును తినుచుంటిమి. గోడలుకూడ స్వయముగా మేమే పెట్టుకొంటిమి. ఎంతయెండలో పనిఁజేసినను మా కేవిధమగు నాయాసమునుగూడ గలుఁగ లేదు. మా యగ్రజులుకూడ మాతోఁబాటు ఎండలో పనిఁజేయుచుండిరేగాని యూరుకొన లేదు. దేహములో మిర్చి, పొగసంబంధమగు నుద్రేకము మిగిలినట్లైన నాయుద్రేకప్రభావము శమించువరకు మనుజుఁడు ఎండలోనికిపోఁజాలఁడు. అప్పటికి మా దేహములలో నాయుద్రేకపదార్థభాగము కొంతవరకు తగ్గిపోయినది. చిన్నతనమునుంచియు కేవలము ఉప్పు, కారము చేరిన వంటవస్తువులతో బ్రదుకుచుండిన వానికి ఎండయైనను, నీడయైనను సరియే, అంతగా నపకారోపకారములు చేయవు. అవి దేహమునందలి సర్వావయవములకును వ్యాపించి ఘనీభవించిపోవును. కాఁబట్టి వానిదోసగును అట్టిమానవులు గుర్తింపఁజాలరు. సాత్వికాహారులకారీతి గాక, స్వల్పదోషమైనను ఘనమైనబాధగల్గించి తీరుచుండును.

హఠయోగాశ్రమముయొక్క శంకుస్థాపనప్రభావమువలన నేటివరకందు మత్స్యమాంసాదులు ప్రవేశింపలేదు. వంటకూడ అందుచేసికొనక, మావదినెగారు, వారికోడలు, మాలక్ష్మీనారాయణరాజు వేరొక చిన్నకుటీరములో చేసికొని, యిందుమసలుచుందురు. అందుకొఱకొక చిన్న కుటీరమును ఆశ్రమమునకు వెనుకభాగమున

నిర్మించితిమి. మానూతినిఁ జూచి గ్రామస్థులు 1,012 నూతులవరకు త్రవ్వించి, వరలు దింపించితుదకు వానినెల్ల పూడ్పించివేసిరి. అన్నిటియందును క్షారోదకమే పడుచు వచ్చినందున అట్టి గతి గలిగినది. ఒక శ్రీమంతుఁడు బోరింగు తీయించి చాలాసొమ్ము ఖర్చుఁ జేసెనుగాని తుదకు 170 అడుగుల లోతులో నుంచి విషమయమైన జలము పైకుబికినది. అది యే చెట్టుకు పోసినను వెంటనే నిప్పుతో కాల్చినట్లు మాడిపోవుటచే దానిని పూడ్పించివేసిరి. అందువల్ల వేసవికాలములో చాలమంది మా యాశ్రమములోని నూతికి నీటికై వచ్చుట పరిపాటియైనది. ఆశ్రమమునఁ జేరియున్న స్థలముచుట్టు గోడఁ బెట్టించి పెంకుటిమదురు పోయించితిమి. ముందుభాగమున మాతమ్ముఁడు చిల్లరకొట్టుఁ బెట్టుటకై యొక చిన్న యింటిని గట్టించి, పెంకు వేయించెను. వానినిర్యాణానంతర మా కొట్టు తీసివేసి అందలి సరుకు అమ్మివేసి ఆ యింటిని ఖాళీచేసి సామాను నున్నగువాని నందు వేయుట కుపయోగించుచున్నాము. భగవత్కటాక్షము బాగున్నచో తలంచిన కార్యము లెల్ల నెరవేరుచుండును గాని మన తెలివివలన నేకార్యమును సాధింపఁజాలము. భగవత్కటాక్షమునకు తెలివి జతపడినచో ప్రతి కార్యమును సుఖతరముగా నెఱవేరవచ్చును.

## ౧౧ యౌవన దశావస్థలు

బాల్యయౌవనకౌమారవృద్ధాప్యము లను దశా చతుష్టయమునందు, యౌవనదశయే మానవుని కత్యంత ప్రమాదకరమైనది. సర్వసాధారణముగా యౌవనదశను శ్రేష్ఠతరముగా ముగించు పురుషు లరుదుగా నుందురు. మే మాదశను బాగుగా పరీక్షించి గమనింపఁ గలిగితిమి. ఆ దశయం దెవ్వఁడు పొరపడఁడో వాఁడు సర్వసౌభాగ్యముల నీ భూలోకముననే పొంది మహోత్కృష్టదశ నంది, నిరోగియై, నిత్యసంతోషియై, చిరంజీవియై జీవింపఁగలుగును. నపుంసకునకు, పశుప్రాయునకు, మూర్ఖునకు, దరిద్రునకు, దుర్మార్గునకు, లోభివానికి, విషయలోలునకు నిం దేదశయైనను నొక్కటియే! గావున వారివిషయమై యోజించ వలసిన పనిలేదు. సర్వలక్షణోపేతుఁడు, సంపన్నుఁడు, చదువరి, విషయగ్రహణ పారీణుఁడు, స్ఫురద్రూపి, సత్కులసంజాతుఁడు అగు పురుషుఁడు, యౌవన మను మహాదవానలమున తగుల్కొనక, తనజన్మను సార్థకపరుచుకొనఁ గలిగినచో నతనిని సామాన్య మానవులలోఁ జేర్పదగదు. అతఁడే మానవోత్తముఁడు.

యౌవనదశలో పోలవరమున మా యగ్రజులు స్కూలుమాష్టరీ చేయుచున్నవిషయము మా పాఠకు లెఱిఁగియే యున్నారు.

క్రమముగా 1908 వ సం॥రం ప్రాంతమున కాయనకు లక్ష్మీకటాక్షము కొంతవఱకు కలిగినందున సంసారపుఖర్చుకు పోను మిగతడబ్బుతో చక్కని చొక్కాలు, మిలమిలలాడు మల్లుపంచెలు, సన్ననూలు ఖండవాలు, కొని ధరించుచుండెడివారు. పైగా పెడపాపిడితీసిన నల్లని గిరజాలజుట్టుగలిగి నుదుటిపై సన్నని గీరునామమునుఁ దీర్చి ప్రశస్తమైన చందినీ బట్టల కంటించుకొని చాల నీటుగా నుండుట ఆయనకు చాల ఇష్టము. గ్రామములోని యువకులు, వృద్ధులు గూడ చాలమంది ఆయనకు స్నేహితులైరి. వారితో తఱచుగా మాట్లాడుటకు స్కూలుపని వలన వీలుకుదరక

సాయంత్రము స్కూలు విడిచిపెట్టి షికారుగా స్నేహితులతో గలిసి తిరుగుచు కాలక్షేపము జేయుచుండెడివారు. ప్రతి దినమును సాయంత్రము ఆరుగంటలకు భోజనమొనర్చి 7 గంటలకు మిత్రసందర్శనమునకేగి, తిరిగి 9 గంటల రాత్రి కిల్లుజేరి శయనించు టాయన కాచారమైనది. అప్పు డాయన విరివిగా పొగచుట్టలు గాల్చుచు, పొడుముపీల్చుచు నుండెడివారు. నర్సాపురములో నొక బ్రాహ్మణి పొడుమును తయారుజేసి విక్రయించెడిది. ఆమెవద్ద పొడుము కొని తెచ్చుకొని మా యగ్రజులు విశేషముగా పీల్చుచుండెడివారు. ఒక మిత్రు డప్పు డప్పుడు నర్సాపురములో పొగాకు, పొడుము మున్నగు వానిని సమృద్ధిగా కొని తెచ్చిపెట్టుటగలదు. వానికిని మా యగ్రజునికిని అపారమగుస్నేహభావము గుదురుటవల్ల ప్రతిదినము విడువక యొకగినొకరు కలిసికొని యాకాశ పంచాంగగాధలు, పుక్కిటిపురాణ వచనములు, శ్రీరంగనీతులు, పిట్టకథలు, లోకాభిరామాయణచరిత్రలు, కుటుంబవిషయములు, హాస్యప్రసంగములు చెప్పుకొని 9 గంటల రాత్రియగువరకు చుట్టలుగాల్చుచు కాలక్షేపముఁ జేసెడివారు.

ఇట్లు నిరంతరమును జరుగుచుండుటవలన "పంతులుగారు కొంచెం రంగేళీపురుషు లైనా" రని గ్రామములో కొందరు స్త్రీపురుషులు వదంతిగా చెప్పుకొనుట కారంభించిరి. ఆవాక్యములు నేనుగూడ కర్ణాకర్ణికగా వినియుంటిని. మా యగ్రజులు వెల్లెడిమిత్రునిగృహసమీపమున సంసార వ్యభిచారులు కొందరున్నమాట సత్యదూరము గాదు. ఆయనకు వ్యభిచారగుణమున్నదనిచూచి కనిపెట్టినవారొక్కరును లేరు. నేనుగూడ ఆ వాక్యములు నమ్మజాలకపోతిని. కొన్నాళ్లకావదంతి ఆయనకుగూడ తెలిసి, రాత్రివేళ నామిత్రునియింటికిఁబోవుట తగ్గించి, అంతటి నుంచి పగటియందెప్పుడో యొకప్పుడు కలిసికొని కబుర్లుచెప్పుకొని సంతసించుట కారంభించిరి. అంతట ఆ వదంతి మాయమైపోయినది. తదుపరి ఆయనకు 1910 లో వివాహము గూడ నైనది. అంతకుముందే ఆయనకు సద్గురుసందర్శనముఁగూడ నైనందున, విరాగముగలిగి వేషము మార్చివేసి, గిరజాలు కత్తిరించి క్రాపింగు చేయించుకొనిరి. పోలవరము నందలి క్షత్రియులలో మొట్టమొదట కేశఖండన తంత్రమును ప్రవేశబెట్టినది మా యగ్రజులే! నక్కలకు తోకలపై నెంత ప్రేమగలదో అంత కంటె మా రాజులకు జుట్టుపై నెక్కువ ప్రేమ యుండునని చెప్పుటతిశయోక్తి గానేరదు. క్రమక్రమముగా నిప్పటికే రాజబృందమెల్ల బోడిబుర్రలవారైరి. మేము ప్రకృతికి జుట్లువదలిపెట్టి చింపిరిజుట్లవారమైతిమి.

ఇఁక నాకథ నేకరువుపెట్టెదను. నేను స్కూలు మాష్టరీవృత్తిపై 1910 లో అంతర్వేదిపాలెము పోతిని. అచ్చటికి పోయినతరువాత కొందరు స్నేహితులతో గలిసి చుట్టలుగాల్చుట కారంభించితిని. తరువాత పొడుము పీల్చి చుట్ట విడిచిపెట్టితిని. ఆపై తాంబూల మభ్యసించి నస్యమును, నస్యమునుమాని బీడీలను, బీడీలుత్యజించి సిగరెట్లు, సిగరెట్లువదలి, పొగాకుపట్టీవేసితిని.

[ సశేషము ]

# ఆరోగ్యతత్త్వము

పువ్వాడ వేర్రాజు

(గతసంచిక తరువాయి)

ఒకవేళ బుద్ధిమంతులగు వైద్యశాస్త్రజ్ఞులకు గ్రహింపు గలిగినను తమ ఖ్యాతికి భంగము గలుగుననియు, టీకాలు వేయు రసముకొఱకు ఉపయోగించిన డబ్బంతయు వృథయగుననియు, ఈ శాఖయందు విశేషవేతనముల బొంది జీవించు పెక్కుమందికి జీవనోపాధి యుండదనియు ఊహించి ఆ సంగతిని వారు దలపెట్టరు. ప్రకృతివైద్యశాస్త్రజ్ఞు లీ మధ్య ఆందోళనమును మొదలుపెట్టిన పరిపాలకులకు వీరిమాటలు వినబడుటలేదు. బ్రతికియున్నవానిని చచ్చినట్టును, చచ్చినవానిని బ్రతికియున్నట్టును సర్టిఫికెట్లు నిచ్చినను వారికళ్లతో జూచుచుండినను ఉద్యోగస్థు లీ సర్టిఫికెట్లును నమ్మవలెనే గాని తమ నేత్రములగూడ నమ్మి పనిజేయుటకు వీలులేని యీకాలమునందు ఆంగ్లవైద్యనిపుణులవద్దనుండి టీకాలవలన నష్టమేగాని లాభము లేదను వార్త వచ్చువరకును దేశమునకీ దుస్థితి తప్పదు. స్వలాభమునే గోరునట్టి యీ ఆంగ్లవైద్యు లెప్పుడును ఇట్టి సంగతిని బయలుపర్చరు. ప్రజలే యిందలి సత్యాసత్యముల గ్రహించి తమకు గలుగుచున్న విపత్తునుండి తప్పించుకొనుటకు గాను పరిపాలకుల దృష్టిని ద్రిప్పి టీకాలవలన గలుగు నష్టమును తెలుసుకొనుటకు దగునేర్పాట్లు జేయువరకును ఆందోళనము చేయవలసియున్నది. అందుకుగాను టీకాలన నేమి? శరీరమందు ప్రవేశపెట్టబడు యీ విషమెట్లు సంపాదింపబడుచున్నది? ఇది చేయు పని యేమి? దీనివలన నష్టమెట్లు గలుగుచున్నది? యను ప్రశ్నలకు జవాబులు ప్రజలకు బోధపడవలెను.

పూర్వకాలమునందు మసూచికము, పొంగు, కలరా మొదలగు వ్యాధులన్నియు అమ్మవారికోపమువలన గలుగుననియు, అందుకొఱకు అమ్మవారికి సేవలు చేయుటవలనను మ్రొక్కుబడులవలనను అవి తగ్గుననియు మూఢనమ్మక మొకటి వ్యాపింపజేసిరి. ఇందొక సత్యము గలదు. మశూచకజ్వరము తగిలిన దాది ఔషధములు వాడకూడదనియు వాడిన అమ్మవారి కాగ్రహము వచ్చుననియు మందులు వాడుటలేదు. కాని బొత్తిగా మూఢులగు జనులు జ్వరము తగిలినదాది అమ్మవారిని శాంతింపజేయుదు మనునూహతో రోగికి బలవంతముగా నాహారమిచ్చుటవలనను, పొక్కులుకనబడి కొంచెము తెలివిగలిగినదాది రోగి కోరిన సర్వపదార్థములు పెట్టుటవలనను రోగము ప్రకోపించి శరీరమునకుగల శక్తియంతయు తినిన పదార్థముల జీర్ణము చేయుటయందు వినియోగపడుటవలన పాటుసరిగా లేక రోగి మృత్యువాత బడుటయో లేక ఏదైనను అంగహీనత గల్గుటయో జరిగెడిది. కొంచెము తెలివితేటలు గలవారు మందులువేయక లంకణములగట్టియు రోగి కోరినపుడు మితమగునాహారమునిచ్చియు శరీరశక్తి వృద్ధియగునట్లు జేయుటవలన సులభముగ రోగవిముక్తుడై జీవించుటయే గాక దేహమందలి రోగపదార్థమంతయు వెలువరింపబడి పూర్వపురోగములన్నియు దీనితో పోయి పరిపూర్ణారోగ్యము గలుగుచుండెడిది. రోగము నెదుర్కొనుటకు దేహబలము గావలెననియు అందుకొఱకు ఆహారమివ్వక తప్పదను సిద్ధాంతము ఆంగ్లవైద్యసాంప్రదాయమే. ఆయుర్వేదమునందు జ్వరములకు లంకణమే విధించబడియున్నది. పాశ్చాత్య సంబంధము మనకు గలిగిన పిమ్మటనే మశూచికమువలనను విషూచివలనను జననష్టము ఎక్కువగుట తటస్థించినది. అందుమీద టీకాలపద్ధతివలన మశూచికము నాపుట మొదలిడిరి. టీకాలు వేయుటకు ఒకవిధమైన చీమును శరీరమందు ప్రవేశపెట్టెదరు. పూర్వకాలమునందీ చీము మశూచికము వచ్చిన రోగియొక్క మశూచికపు పొక్కులనుండి గ్రహించి దానిని ప్రతివానియొక్క దండచేతులయందును ఎక్కించుచుండుటయు ఆచీము పొక్కి పొక్కులు బయలుదేరి చీముపట్టునపుడుతిరిగి ఆ చీమును తీసికొని జాగ్రతపెట్టి మరియొకరికి తిరిగి ఎక్కించుచుండుటయు చేయుచుండెడివారట.

ఇటీవల యీ పద్ధతి మార్చి ఆవుపెయ్యల పొదుగునందు టీకాలు వేయుదురు. ఆ టీకాలవలన శరీరమంతయు పొక్కి సలసలలాడి బాధపడును. పిమ్మట శరీరమంతయు పొక్కులుగలిగి పోటు, దురద పుట్టును. అప్పుడు ఆ పెయ్యదూడను కదలకుండునట్లును మెడ కదల్పకుండ నాకుకొనుటకైన వీలులేకుండ కర్రలమధ్య బెట్టి నిరోధించెదరు. అటుపిమ్మట దాని పొక్కులలోని రసినంతను గొట్టములలోని కెక్కించి దానిని మనుష్యుల శరీరమందు టీకాలవలన యెక్కించెదరు. ఇట్టి ఘోరకృత్యమును వినినంతమాత్రము చేతనే కన్నీరు రాని పాషాణహృదయులుందురా? ఇంత ఘోరముగా సంపాదించిన యీ విషరసమువలన గలుగు ఫలితములును ఇంతకంటె ఘోరములు

గనే పరిణమించుచున్నవి. మన దేశమునందు పూర్వ కాలమునందు టీకాలు వ్యాపింపనపుడును, టీకాలు వేయుట పూర్తిగ వ్యాపించిన యీ కాలమునందును గలుగు కాలికవ్యాధులు- అందు ముఖ్యముగా కుష్ఠు, క్షయ, ఉబ్బసము, బోదకాలు, బుడ్డలు, నేత్రరోగములు మున్నగునవి- గల జనుల సంఖ్యల దెలుసుకొనినయెడల టీకాల వలన దేశమునకు గలిగిన కీడు తెలియగలదు. పూర్వకాలమునందు అక్కడక్కడ కాలికరోగులు కనిపించుచుండెడివారు. ఇప్పు డెక్కడ జూచినను ఇట్టివ్యాధిగలవారే కనిపించుచున్నారు. దాని కారణమును గ్రహించుట మిక్కిలి కష్టముకాదు. మనము సహజాహారమును విడచి రుచి గల్పించుకొని కృత్రిమాహారములను తిన మొదలిడినప్పటినుండియు జీర్ణకోశమునకు వాని నన్నిటిని జీర్ణము చేయగల శక్తి లేక కొంత యాహారమును జీర్ణముకాకుండగనే త్రోసివేయును. ఈ పదార్థము రోగపదార్థమై రక్తమునందు సంచరించి శక్తిలేనిఅవయవములందు చేరి వాటిని స్వస్థానమునుండి గెంటియు నొక్కివేసియు వాటిపని నవి సరిగా చేయలేకుండునట్లు చేయును. వానితో సంబంధించిన కండరములును, నరములును బిగుసుకొనిపోయి తమ పని నవి సరిగా చేయలేకుండును. ఇట్లుండ నీ రోగపదార్థమును నెట్టివేయుటకు శరీర మెల్లపుడును ప్రయత్నించుచుండుటచే నీ రోగపదార్థమందు మండమేర్పడి పొంగుబుట్టి అనేక రసాయనికమార్పులు గలుగును. అందువలన పుట్టువేడిరయే జ్వరమనబడును. ఈ జ్వరమును మాత్రలచే నణచుటవలన రోగపదార్థము గట్టిపడును. ఇట్టి స్థితి చిరకాలముండదు. శరీర మెల్లప్పుడును ఈ పదార్థమును గెంటివేయుటకు జూచుచుండును. గాలి యందలి మార్పుల వలన శరీరము దార్ఢ్యముగలదై యీ పదార్థమునందు మండము కల్పించి త్రోసివేయుటకు గట్టి ప్రయత్నము చేయును. అప్పుడే విశేషమైన జ్వరము గలిగి చర్మము యొక్క అడుగున జేరియున్న రోగపదార్థమంతయు పొక్కులరూపమున చర్మమును బ్రద్దలుచేసుకొని పైకి వచ్చును. ఆ పొక్కులలోనికి దేహమందలి యన్యపదార్థమెల్ల రక్తవాహినులవలన గొనిరాబడి పొక్కులు పెరిగి పక్వమునకువచ్చి చివికి రసిరూపమున అన్యపదార్థ విమోచనము కాగా శరీరము సంపూర్ణమైనశక్తిగలిగి పూర్ణారోగ్యవంతులగుదురు. జీర్ణకోశమునందే విశేషమైన యన్యపదార్థము చేరియున్నచో నది జీర్ణకోశముయొక్క ఊర్ధ్వఅధోముఖములగుండ విడివడి పోజూచును. దానినే విషూచి, గ్రహణి, నీళ్ళవిరేచనములు అందురు. ఈ రోగములవలన అనేకసంవత్సరములనుండి చేరిన రోగపదార్థము కొద్దిరోజులలో నెట్టివేయబడుటచే శరీరదార్ఢ్యము లేనివారు ఆగలేక మరణింతురు. గాని ప్రకృతివైద్య సాహాయ్యమున చన్నీటితోను, మట్టిపట్టీలతోను సూర్యకిరణ శక్తివల్లను నరములకు తగు శక్తిని గలుగజేసిన పక్షమున నిరపాయముగ నీ దుష్టపదార్థమును త్రోసివుచ్చి తిరిగి రోగి పరిపూర్ణ ఆరోగ్యవంతుడు గాగలడు. అంతేగాక కూనే మహాశయుని ముఖవైఖరివిద్యచే నీరోగములు ఇంకను ఒక సంవత్సరమునకు రాగలవని మనము తెలుసుకొనవచ్చును. రాకముందే ప్రకృతిచికిత్స కారంభించిన యెడల నీ రోగము లక్కరలేకనే క్రమక్రమముగ రోగపదార్థమును గెంటివేసి ఆరోగ్యము నిచ్చును. అట్లుగాక టీకాలువేసి యీ యన్యపదార్థము పొంగి పైకిపోకుండ అణచిపెట్టియును, అట్టి యన్యపదార్థమును గెంటివేయుటకు ప్రయత్నించగల శక్తిని అవయవములకు గలుగకుండ చంపుటవల్లను యీ యన్యపదార్థము దేహమందు నిలచి క్రమక్రమముగ అన్నిఅవయవములయొక్కయు నరములయొక్కయు శక్తినిచంపి, చర్మముయొక్క శక్తినికూడ నాశనముజేసి పక్షవాతము, క్షయ, కుష్ఠు మొదలగు పెక్కు రోగములకు మనుష్యులను గురిచేయుచున్నది. టీకాలులేని కాలమునందు ఈ కాలికరోగములకు కారణము లేదుగాన తరుణరోగములు గలిగి ముందు జాగ్రత్తపడని మూర్ఖులను మృత్యుసదనమున కనుపుచుండెడివి. బ్రతికియుండి ప్రజ లందరిచేతను, స్వజనుల చేతను గర్హింపబడుచు తమ జీవితముకొఱకితరులపై ఆధారపడి, కుటుంబమునందలి ద్రవ్యమెల్ల వైద్యులపాలు గావించి తమ కుటుంబమును దరిద్రులుగ చేసి చావునకు మొగము వాచి బ్రతికియుండుటమేలా, లేక అట్టి తరుణవ్యాధులచే చచ్చుటమేలా? ఇట్టి రోగులు బ్రతికియున్నంతకాలమును దమ హీనస్థితినైనను గుర్తింపలేక పిల్లలను గనుచుండుటచే వారి సంతానముకూడ బీజమం దెట్టి రోగాంకురములు గలవో ఆ యా రోగములకెల్ల గురియగుచున్నారు. టీకాల వలన అపబడిన రోగపదార్థము నేత్రములకును, శ్రోత్రములకును వ్యాపించి వానిని పాడుచేయుటచే నేత్రాది రోగము అధికములైనవి. ఇట్లే మరికొంతకాలము టీకాలు వేయబడిన పక్షమునందు క్షయాదిరోగములు ప్రకోపించి హిందూదేశమునెల్ల తన పాట్టను బెట్టుకొనును. శరీరమందు నోటిద్వారా పోయబడిన మందులు జీర్ణకోశమునందలి

శనములచే పటుత్వహీనములుగ జేయబడును. అందుచే వాని విషములు విరిగిపోయి నిర్వీర్యములగును. రక్తములోనికి ఎక్కించబడిన యీ విష మట్లుగాక శరీరమును పూర్తిగ జెరుపుచున్నది. త్రాచుపాము విషము కడుపులోనికి మ్రింగినప్పటికంటె దాని కాటుచే రక్తములోని కెక్కించబడినపుడు ప్రాణహాని యగుచున్నది. అట్లే టీకాలవలన గూడ హాని దటస్థించుచున్నది. బుద్ధిలేని దుష్టజంతువులైన పాము, తేలువంటి విషజంతువులు విష మెక్కించుచున్నందువలనగదా వానికంత భయపడుచున్నాము. జ్ఞానముగలిగి రాబోవు బాధల గూర్చి ఘనవైద్యులు మొఱపెట్టుచున్నను, యితరదేశములు మానుకొనుచున్నను తాము పట్టిన కుందేలుకు మూడే కాళ్ళన్నట్లు తమ పట్టుదలను విడువకుండ టీకాలువేయుపద్ధతిని మానివేయని ఆరోగ్య శాఖవారి నేమనవలయునో గ్రహింపవలెనేగాని చెప్పుటకు చాలదు. ఇంతటినుంచి రాజకీయాందోళనముతో బాటు టీకాలు మానుటకు గూడ ఆందోళనము జరిపి టీకాలు మాన్పించుటకు శాసనసభ్యుల ప్రోత్సహించవలెనని ప్రజల గోరుచున్నాను. ప్రకృతిచికిత్సలచే నిరపాయముగ అన్య పదార్థములను నెట్టివేసి యీరోగములురాకుండ కాపుకొనవచ్చును. దేహమందు అన్యపదార్థమే లేనియెడల యీ అంటు వ్యాధులు వ్యాపింపవు. అంటువ్యాధులయందు వ్యాపించు క్రిమి, రోగపదార్థము మిక్కుటముగగల రోగియందే వృద్ధి పొందునుగాని రోగపదార్థము లేనివారియందు చచ్చిపోవును. కాలుచున్న నిప్పు తుక్కులోపడినపుడే అంటుకొనునుగాని తుక్కులేనిచోట దానంతట అదే నశించిపోవును. అందుచే రోగపదార్థములేకుండ మన శరీరమును స్వచ్ఛముగ నుంచుకొనవలెనేగాని శరీరమును చెరుపుకొని క్రిమిని చంపప్రయత్నించు వైద్యసాధనములు వృధయగుచున్నవి.

అంటువ్యాధులకెల్ల క్రిమియే కారణమని నవీన శాస్త్రజ్ఞులు గనిపెట్టియున్నారు. రోగిశరీర మందే క్రిమిని వారు చూచుచుండుట యథార్థమే! అయినను 'చెట్టుముందా విత్తుముందా' యన్నట్లు రోగమువలన క్రిమియా, క్రిమివలన రోగమా యని విచారింపవలసియున్నది. ప్రపంచమునందు కుళ్ళుపదార్థములయందెల్లను క్రిమిపుట్టి ఆ పదార్థము నశించినతోడనే అదియు నశించుచుండుట జూచుచున్నాము గదా! కుళ్లుపదార్థముల దిని జీవజంతువులకు హానిగల్గు దుష్ట వాయువులు పుట్టకుండజేయుటకుగదా యీ క్రిమిని దయామయుడైన పరమాత్ముడు కల్పించినది. ఇట్లే మన శరీరమందలి రోగపదార్థము నశింపుచేయుటకొఱకే యీ క్రిమి పుట్టుచున్నదనియు, ఆక్రిమిని మందులవలన జంపి రోగ పదార్థమును నిల్పినపుడు తిరిగి క్రిమి పుట్టకమానదనియు, రోగపదార్థమును గెంటివేయగల శక్తి అవయవములకు గలుగజేసి ఆ రోగపదార్థమును నెట్టివేసినయెడల దానితో పాటు క్రిమిగూడ నశించుననియు గ్రహింపతగ్గది. బెల్లమునకు చీమలుపట్టినపుడు ఎన్నిసార్లు చీమలను నలిపి చంపినను లాభముగలదా? చీమలు నశించవలెనన్న బెల్లమునే దీసివేయవలెను. తుక్కుగల గదులయందు క్రిములుండిన గదులను శుభ్రపరచవలెనేగాని క్రిమిని జంపజూచుట పొరబాటుపనికాదా? మనశరీరమును స్వాభావికాహారముచే రోగపదార్థరహితముగ జేసికొనవలెనేగాని టీకాలవలన క్రిమిని జంపుటవలనను, ఈగలను, దోమలను, ఎలుకలను జంపజూచుట వృధాప్రయాసమే యగును. కుళ్ళులేకుండ జేయవలెనేగాని దోమలపై కత్తిగట్టుట ఆలోచనలేని పని. దోమలు పోవలెనన్న కుళ్ళునీళ్ళగుంటలు, బందలు పూడ్చివేయవలెను. అప్పుడే మన ప్రయత్నము సఫలమగును. దోమలను జంపుటకు చేయు వ్యయమంతయు బుగ్గిలోపోసిన పన్నీరగును. రోడ్లవెంబడి ముక్కు బిగపట్టుకొనకుండ పోజాలనంత మురికినీటి కాల్వలుగల పట్టణములం దేప్రయత్నములచే దోమలుపోవునో యూహించుడు. శరీరములు స్వచ్ఛముగానుండినవారిని క్రిమి తాకలేదు; దోమలేమియు చేయజాలవు. గాన ప్రజ లెల్లరు వైద్యులకును, మందులకును భయపడవలసినంత క్రిమికి భయపడనక్కరలేదు. అమ్మవారు మనలను మ్రింగుటకు మశూచికము, విషూచి మొదలగు రోగములు గల్పించుననినమాటయం దెంత జ్ఞానమున్నదో సూక్ష్మజీవులు మనలనుజంపుటకే యేర్పడినవను మాటయందును అంతసత్యమే గలదు. భగవంతుడు కృపామయుడు. మనల నన్నివిధముల గాపాడును. మనతప్పిదములచేగాని, పొరపాట్లచేగాని కినిసి మనల దుర్భరరోగముల పాలుజేయు క్రిమికీటకముల బుట్టించడు. మనబుద్ధిహీనతచే విషయలంపటులమై జిహ్వోపస్థలకు దాసులమై ఆరోగ్యముల జెరుపుకొని మనశరీరములను మురుగుదొడ్లుగా మార్చుకొని కుళ్ళును పెంచుకొన్నపుడు మనయందు దయగలిగి మన బుద్ధిహీనతను గ్రహించి, క్షమించి తిరిగి మనలను ఆరోగ్యవంతులుగజేయుటకే యీ క్రిమిని పుట్టించియున్నాడు. అట్టి తరుణమందు నీటివైద్యమువంటి ప్రకృతివైద్యములచే నాకుళ్ళును తోసివేయగా ఆ క్రిమికూడ ఆ కుళ్ళుతోనే పోయి కుళ్ళు నశించినతోడనే నశించునుగాన క్రిమి మీద దండెత్తనవసరములేదు.

# విదేశాల్లో ప్రకృతివైద్యము

**వాడపల్లి మురహరిరావు**

ఈనాడు ఆంగ్లదేశములో ప్రకృతివైద్యము చాలఆదరణ బడయుచున్నది. ప్రీస్‌నిడ్జి, స్ట్రాత్, నీప్, రిక్లి, లహార్మన్, కూనే, జస్టు, యహాల్ వగైరా సుప్రసిద్ధ ప్రకృతిసిద్ధాంతులచే ఐరోపా దేశములో ఈ ప్రకృతిసిద్ధాంతములు అవలంబింపబడి కుదరని వ్యాధులచేత బాధపడువారలకు కూడా యీ ప్రకృతివైద్యము శరణ్యమైనది. జర్మనీలో ఈ శాస్త్రము మున్ముందు ఆదరణ బడసినది. అమెరికాలో ప్రకృతిసిద్ధాంతాభిమానులు లక్షలకొలది స్త్రీ, పురుషులు కలరు; వారిసంఖ్య పెరుగుచున్నది. డాక్టరు జాక్సన్, ట్రాల్, వి. యర్. హారోలడ్, లిండ్లార్, టిల్డన్, డాక్టరు బి. లస్టు వగైరా సుప్రసిద్ధ వైద్యులచేత ఈ యుద్యమము చాలా ముందుకు నడచినది. వీరికి ఎంత ప్రతిఘటన వచ్చినను వానిని ఎదుర్కొని యీయుద్యమము సాగించుటయందే వీరిగొప్పతనము కలదు. ఆంగ్లదేశములో గత యిరువది సంవత్సరములలో ఈ యుద్యమము ఎక్కువ జనాదరణ బడసినది. మూల సిద్ధాంతములు ప్రజలయందు ప్రచారము చేయబడుచున్నవి. సత్యమనే కొండమీద ఈ యుద్యమము నిలిచియున్నది. జర్మని, అమెరికా, బ్రిటిషు కొలంబియాలలో ఈ వైద్యము కొన్ని ప్రభుత్వములచేత ఒప్పుకొనబడినది. ప్రజల యొక్క ఆదరణచేత ఈ యుద్యమ మింకను ముందంజవేయును. ఇంగ్లండులో ఆరుపత్రికలు నడపబడుచున్నవి. అనేక పుస్తకములు వ్రాయబడినవి. ఒక 'సెల్ఫ్ హెల్ప్' అనే పుస్తకమే 20000 కాపీలు అమ్ముడుబోయినవి. ఆంగ్ల ప్రకృతివైద్యసంఘ మేర్పడినది. అనేక వైద్యశాలలు ఏర్పడినవి. స్కూలు ఏర్పడినది. అనేక సంఘములు ఏర్పడినవి. అనేకసభలు జరుగుచున్నవి. దీనికి సంబంధించిన హోటల్సు గలవు. కొద్దిలోనే బ్రిటనులో గొప్ప ప్రకృతిహాస్పిటలు ఏర్పడును. జర్మనీలో హిట్లరునారవారు, ఇటలీలో మసులోని నియంత యీ యుద్యమమునకు ఎంతయో చేయూతనొసగి ప్రోత్సహించుచున్నారు. ఇదిగాక ఐరోపాఖండములో ఎన్నియో ప్రకృతివైద్య హాస్పిటల్సు కలవు. శాకాహార సంస్థలు గలవు. ఈ మధ్యనే ప్రాపంచిక శాకాహార సభ జరిగినది. ఈ యుద్యమమునకు త్వరితములో ఎక్కువగా ఫలితము చేకూరును. అప్పటికే ప్రపంచశాంతి జరుగును. అప్పటికిగాని యీరాజ్యకాంక్ష, యీ ద్వేషము నశించవు.

# ఆంధ్రదేశ టీకాల వ్యతిరేక మహాసభ

## బెజవాడ: నవంబరు 13 వ తేది

ఈ సభ నవంబరు 13 తేది ఉదయం రామమోహన గ్రంథాలయమందు ప్రారంభమైనది. ఆంధ్ర దేశ మంతటినుండియు అనేకులు వచ్చి సభయందు పాల్గొనిరి.

ఏనుగువానిలంక హఠయోగాశ్రమవాస్తవ్యు లగు శ్రీరామరాజయోగీంద్రులవారు సభను ప్రారంభించిరి.

పిమ్మట నెల్లూరి వాస్తవ్యులును మద్రాసు లెజిస్‌లేటివ్ అసెంబ్లీ మెంబరును అయిన ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు అధ్యక్షత వహించిరి.

సాయంత్రము తీర్మానములు చేయబడినవి.

## స్వాగతోపన్యాసము

డా॥ పుచ్చా వెంకటామయ్యగారు

సోదర సోదరీమణులారా!

ఈ సదవకాశంలో మీకందరికి ఆహ్వానసంఘమువారి తరఫున వారి కోరికపైని హృదయపూర్వకమైన స్వాగతమును సమర్పించుచున్నాను.

బెజవాడపట్టణమును గురించికొని పట్టణముయొక్క ప్రాముఖ్యమును గురించికొని మీకందరకు తెలిసియున్నందున నేను చెప్పదలంచలేదు.

ఎప్పుడో వెలువడుననుకొన్న రాజాజీ మహామంత్రులవారి ప్రజారోగ్యచట్టము నిన్న కొన్ని పత్రికలలోను యీవేళ కొన్నిపత్రికలలోను ప్రచురింపబడినది. అనుకున్నట్లుగానే టీకాలే కాకుండా కలరా మొదలైన అంటువ్యాధులకు గూడ నిర్బంధముగా యినాక్యులేషన్ వేస్తే వేయించుకోక తప్పదని తేలుతోంది. ముంచుకుపోయినట్లు ఆరోగ్యశాఖవారికి సివిలు అధికారములేకాకుండా పోలీసు అధికారములుగూడ అంటకట్టి మనలను బాధించవలసినట్లుగా బిల్లు ముఖతః మనము తెలిసికొంటున్నాము.

ఈ సందర్భములో టీకాలయొక్క పుట్టుపూర్వోత్తరం మీకు కొంచెము చెపుతే మనమంతా కలసి యేమిచెయ్యాలో సంప్రతించుకొనేందుకు వీలవుతుంది గనుక చెప్పుచున్నాను.

1798 సం॥ పూర్వము యీ భూమిపుట్టి యెన్నివేల సంవత్సరాలైందో యే దేశంలోను టీకాలనే మాటేలేదు. భారతీయమైన ఆయుర్వేదవైద్యమునందుగాని యవనదేశమునుండి వచ్చిన యూనానీవైద్యమునగాని సిద్ధాది యితర వైద్యములందుగాని యీ టీకాల ప్రశంసయే లేదు. హోమియోపతివైద్యము ప్రకారము చూచినా టీకాలు వేయుటవలన క్రొత్తరోగాలు పుట్టునని వ్రాసియున్నది గాని టీకాలను గౌరవించలేదు.

1798 సం॥ నకు పూర్వము యింగ్లండు మొదలైన దేశాలలో మసూచికానికి మందువాడి యితరరోగాలవలెనే నయము చేదామని వైద్యులు తీవ్ర తీవ్రతర తీవ్రతమ ఔషధములను వాడుతూ వుండేవాళ్ళు. ఒక్క భారతీయులకు మాత్రము తెలుసు. ఏమని? మందు వాడితే మసూచికమువల్ల చనిపోయేవారి సంఖ్య పెరుగుతుందని, అందువల్ల వాళ్లు మందునిచ్చేవాళ్ళు కారు. రోగులు కూడా చాలా తక్కువగా చనిపోయేవారు. వారిలో కూడా

శుచి, ఆచారము, పాటించేవారిలో మశూచికము చాలా తక్కువగా తగిలేది. తగిలినవారిలో మరణాలు కూడా చాల స్వల్పంగావుంటే వుండేవి. లేకపోతే మానేవి. ఇంగ్లండులో అట్లా కాదుగా. మందులిస్తూయుండేవారు. జనము చస్తూవుండేరు. ఏ దేవదూతన్నా వచ్చి మశూచికము రోగము లేకుండాచేస్తే బ్రతుకుతాంరా అనుకునేవాళ్ళు ఆ దేశములో.

ఏట్లోపడి కొట్టుకుపోయేవానికి ఒక గడ్డిపోచ దొరికినా' దాని శరణుజొచ్చుట స్వాభావికమేగా? టన్నర్ అనే యింగ్లీషుమంగలి మశూచికపు పొక్కులలోనున్న చీము తిని తిరుగుతూ వుండేవాళ్ళకు, చర్మంమీద గంటుపెట్టి దేహంలోకి యెక్కిస్తే బ్రతికివున్నన్నాళ్ళు మశూచికము రాదనీ, వచ్చినవాళ్లదగ్గర పడుకున్నా, సంగమంచేసినా కూడా మశూచికము రాదనీ సర్ జాన్ సైమన్ గారునూ హామీయిచ్చారు. యీ మాటలన్నీ నమ్మినారు యింగ్లీషు వారు. టీకాలు వేసుకోటము మొదలెట్టారు. ఒక యింగ్లీషువారేమిటి? అన్నిదేశాలవారూ నమ్మారు. యీ టీకాలసంగతి కనిపెట్టిన జన్నరుగారికి కనిపెట్టిన 10 యేండ్లయినా గడవకమునుపే 1806 లోనే 30000 పౌన్లు బహుమతి యిచ్చివేశారు. యిది పిచ్చో భ్రాంతో మీరే ఆలోచించుకోవాలి.

1840 సం॥ నుండి ప్రభుత్వమువారు టీకాలు తాముగా వేయనారంభించారు. 1843 సం॥లో టీకాలు నిర్బంధం చేశారు. 1861-1869వ సంవత్సరములమధ్య టీకాలువేయకుండా ఒక్కరిని వదలిపెట్టలేదు. అయినప్పటికి 1871-72 సం॥లో వచ్చిన మశూచికపు యెత్తిపోతవలన 42000 మంది యింగ్లీషువాళ్లు చనిపోయినారు. అదీగాకుండా యింగ్లాండులో మశూచికమువచ్చి ఆసుపత్రిలో చేర్చుకోబడినవారిని లెక్కచూడగా వారిలో నూటికి 90 మంది టీకాలు వేయించుకొన్నవారే, అంటే టీకాలు వేయుట వలన మశూచికము ఆగలేదన్నమాట.

దానిచే ఇంగ్లండులో టీకాలలో నమ్మకంపోయింది. ప్రజ అంతా గోలపెట్టారు. అందువల్ల పార్లమెంటువారు 29-5-1889 తేదీన ఒక రాయల్ కమీషన్ యేర్పాటు చేసి టీకాలయొక్క సత్తాను విచారించమన్నారు. 7సంవత్సరాలువిచారించి వారు ఏమితేల్చారంటే:—టీకాలు మశూచికాన్ని ఆపుతవికొని, ఆ ఆపేశక్తి యావజ్జీవమూ వుండదూ మళ్లీమళ్లీ వేయించుకుంటూవుండాలి అన్నారు. వచ్చినవారిని వేరేవుంచితే రానివారికి రాకుండా వుంటుందని అన్నారు. టీకాలవల్ల అపాయాలు తప్పకుండా వస్తయి అవి కొన్నాకూస్తా గాదు బాగా నేవస్తయి అన్నారు. విసర్పి, రక్తవిషీకరణం, కర్పాణి, మొదలగు చర్మవ్యాధులు కలుగుతవి అని వారు ఒప్పుకున్నారు. టీకాలవల్ల సవాయివ్యాపిస్తుందనికూడా వారేఒప్పుకున్నారు. అంటూ అన్నారుకదా, ఆవుదూడలనుండి టీకాలరసము తయారు చేస్తే యీబాధ తప్పుతుందేమోనన్నారు.

నిర్బంధంగా టీకాలువేయటాన్ని గురించి వారేంచెప్పారంటే పిల్లలకు టీకాలు వేయించనంతమాత్రంచేత వాళ్ళను క్రిమినల్సుగా భావించటానికి వీలులేదు. జైలుఖైదువేయగూడదు. ఒకసారికన్న అపరాధము విధించకూడదు. ఎవ్వరిని నిర్బంధించకుండా టీకాలశాసనంలో మార్పు చేస్తేనే యెక్కువమంది వేయించుకుంటారు. అయితే అజాగ్రతవల్ల అశ్రద్ధవల్ల మూర్ఖతవల్ల టీకాలు వేయించుకోనివారికిమాత్రమే వొత్తిడివుండాలి. న్యాయంగా టీకాలను గురించి విశ్వాసంలేనివారికి విడుదల వుండాలి అని. దాన్నిబట్టే 1898 సం॥లో చేసిన టీకాల శాసనంలోనూ 1907 సం॥లోచేసిన ఎమెండుమెంటులోనున్నూ టీకాలలో విశ్వాసం లేనివారు తమబిడ్డలను టీకాలనుండి రక్షించుకొనుటకు విశ్వాసపు క్లాజువొకటి ప్రవేశపెట్టారు. (Conscience clause) అందువల్ల యింగ్లీషువారి బిడ్డలకు టీకాలు వేయించుకోడం ఐచ్ఛికము అయిపోయింది. 100 కి 62 బిడ్డలకు టీకాలు వేయించుకోనేలేదు. 1900 సం॥లో లండనులో పుట్టిన బిడ్డలలో 100 కి 75 మందికి టీకాలు వేశారు. ఆసం॥లో మశూచికమువలన చనిపోయిన బిడ్డలసంఖ్య 100 కి 16. 1921 సం॥లో 100 కి 38 మందికేవేశారు. ఆ సం॥లో మశూచికమువలన చనిపోయిన బిడ్డల సంఖ్య 100 కి 5 గురే. 1932 సం॥లో మశూచికము వలన చనిపోయినవారు మొత్తము 3 ముగ్గురు. ఈ విధంగా యింగ్లండుదేశంలో టీకాలు తగ్గించినకొద్దీ మసూచికం తగ్గిపోయింది.

కాని టీకాలువేసినవారికి టీకాలువేయుటవలన కొన్ని కొత్తవ్యాధులు పుట్టుచున్నవి. అందులో 'ఎన్‌సిఫెలో మైఎలెటిస్' అనే వ్యాధి కలుగుచున్నదని లండన్ హాస్పిటల్ వైద్యులైన డాక్టరు హ్యూబర్టు యమ్‌టర్న్‌బుల్, యమ్. డి. అనువారు 1912 వ సం॥లో కనిపెట్టిరి. ఈ వ్యాధి ప్రధాననాడులలో కలిగే ఒక తరుణవ్యాధి. ఇదే సంగతి లండను యూనివర్సిటిలో ప్రొఫెసరుగా నున్న జేమ్సు మేకిన్‌టాష్‌గారు 1922 సం॥లో బలపరిచారు.

ప్రభుత్వమువారు యాండ్రూసుకమిటీని, రోలెస్టన్ కమిటీని అప్పాయింటుచేసి యీ సంగతి విచారించమన్నారు. వారు తమరిపోర్టులను రెంటిని 1928వ సం జూలై నెలలో ప్రకటించారు. వారు దేశమంతా తిరిగి 'ఎన్‌సిఫెలో మెలెటిస్' వచ్చిన రోగులవృత్తాంతమును పరిశీలించి టీకాలవలన తప్పకుండా ఎన్‌సిఫెలో మెలెటిస్ వస్తుందని నిర్ధారణచేసారు. ఈ సంగతి యింగ్లీషు జర్నల్ ఆఫ్ ఎక్స్పెరిమెంటల్ పెథాలజీ అనే పత్రికలోనూ లాన్సెట్ అనే పత్రికలోనూ ప్రచురించబడింది. లండన్ హాస్పిటల్ సీనియర్ వైద్యుడగు డా॥ ఎ. యి. రస్సెల్, యమ్. డి. బి. యెస్., యఫ్, ఆర్, సి, పి. గారు సెంటు థామస్ హాస్పిటల్ డాక్టరుగారైన, ఎ. బడ్డి, బి. యమ్, బి.సి. హెచ్(ఆగ్జన్) గారున్నూ టీకాలవలన ఎన్‌సిఫెలో మెలెటిస్ అనే రోగమువస్తుందని గుర్తించి 15-9-23 తేదిగల లాన్సెట్ పత్రికలో వ్రాసియున్నారు. మొత్తం లెక్క వేయగా యింగ్లండువేల్సు దేశాలలోమాత్రము టీకాలవలన ఎన్‌సిఫెలో మెలెటిస్ రోగంవచ్చిందని ప్రభుత్వంవారి ప్రతినిధులైన యింగ్లీషుడాక్టరులే ఒప్పుకున్నవారిసంఖ్య 231. యిందులో 93 మరణించిరి. రోలెస్టన్ కమిటీవారు తమరిపోర్టు 200 పేజీలో ఇలావ్రాశారు. "The occurance of Post Vaccinal nervous decease however seldom it many occur is of serions import and cannot fail to have an effect on vaccination both on its administrative and its purely medical aspect. అనగా టీకాలవలన నాడీవ్యాధి అరుదుగా కలుగుచున్నది. అయినప్పటికీ టీకాలువేయు వైద్యవిధానమందో టీకాలువేయువారియందో లోపమున్నదని యీసంగతినిబట్టి స్పష్టమగుచున్నది.

కనుక యిదివరకువలె గాకుండా యికముందు టీకాలు వేసే బిడ్డలకు నాలుగు గాడెలకు బదులుగా ఒక గాడే చేయాలసింది. అని సలహాయిచ్చారు. కావలిస్తే అయిదారు సం॥లికి ఒకసారిచొప్పున యిట్లాగే ఒక్క గాడే చేసి అందులోవేసే టీకాలరసము చాల పల్చనచేసి చాల స్వల్పంగా వేస్తూ వుండాలిసిందని అన్నారు. జంతువుల మీద గూడా యింకా పరిశోధనలు చేయాలసిందన్నారు. ఎన్ని టీకాపుండ్లు చేయాలో అవి యెంత చిన్నవిగా వుండాలో అందులో వెయ్యాలిసిన టీకాలరసము యెంత పల్చగా వుండాలో 130 సం॥లు పరిశోధనజేసినా తేలనే లేదు. ఇది యింకా పరిశోధనావస్థలోనే వున్నదనేసంగతి స్పష్టమగుచునే యున్నదిగదా. దీనినే ఆరోగ్యశాఖా మంత్రిగారు మన నెత్తిన రుద్దుతానంటున్నారు. అది ఐచ్ఛికమా? కాదే, బలవంతం. ఒకసారికాదే, రెండుసారులు, మూడుసారులు, జరిమానాలువేసి శిక్షలువేసి, కొత్తశాసనంప్రకారం పోలీసుఅధికారము వుపయోగించి కూడాను. పాపము శాంతించునుగాక !

1. అసలు యెవరికన్నా ఒక రోగము వచ్చినపుడు దానికి మందు పుచ్చుకోవటమో మానటమో యెవరికి వారే నిర్ణయించుకుంటారు. తలకాయనొప్పికి మందురాచుకోవాలో అక్కరలేదో ఎవరికి వారే నిర్ణయించుకోవటం ధర్మము.

2. అ రాచుకునే మందుగూడా యెవరికి యిష్టమైంది వారు రాచుకోవడమనేది యింకోధర్మం. అమృతాంజనమో, యూకలిప్టస్ ఆయిలో, కుంకుడిపిప్పో, శొంఠిగంధమో.

3. టీకాలు అనేది ఒక రోగమువచ్చిన రోగికి వేసేదన్నా కాదు. అప్పుడుగూడా వేయించుకొని తీరవలెననటం యే నీతిచేత గూడా ధర్మముకాదు. అట్లాంటప్పుడు.

4. పోనీ ఒక రోగానికి అమందు వేస్తే నయమయ్యేదిగా వుండాలి. అమందునే వేసిన యెడల అపకారము చేయనిదిగా వుండాలి. ఇన్ని పరిస్థితులు యేర్పడితే అమందు మంచిది. దానిని వాడితే యెట్టి అపకారమూ చేయదు. పైగా ఫలాని ఫలాని వారికి వాడితే మేలుచేసిందీ అని తేల్చగలిగినప్పుడు దానిని 'వాడుకోమని' చెప్పేటందుకు ఎవరైనా ధైర్యం అవలంబించవచ్చును. మరీ అప్పుడైతే ప్రోత్సాహంగూడా చేయవచ్చును. మరీమరీ అప్పుడైతే నిర్బంధింపవచ్చునేమోగూడా. తలకాయ నొప్పితో బాధపడేవాడై చాలా చిన్నవాడై, శొంఠిగంధం రాచేవాడు బాగా తెలివిగల గార్డియన్ అయితే.

5. అసలు ఒకమనిషికి, కుర్రవాడికి మశూచికమువస్తుందో లేదో ఎవరికీతెలియదు. సామాన్యంగా రాకనేపోవచ్చు. వచ్చినాగూడా జాగ్రత్తగా ఉపచారంచేస్తే ఎన్నో దేహములో దాగివున్న రోగాలు లేకుండాపోతై. అలాంటిరోగమురాకుండా ఆపేటందుకు వాడే మందు. మందు ఏమిటయ్యా—

1 ఆవుదూడకు బలవంతంగా మశూచికము తెప్పించి, దానిని నానాబాధలుపెట్టి దాని ఒంటిమీది మశూచికపు పొక్కులలోనుంచి తీసిన చీము.

2 అదివేస్తే, పోనీ, మశూచికము రాకుండా, మాననన్నా మానుతుందా అంటే అదీ జరగటంలేదు. అనే సంగతి వెనకవ్రాసిన గ్రంథమంతా చదివినవారికి బోధపడుతునేవుంది.

3 టీకాలు వేసినందువల్ల అపకారమన్నా జరగకుండా వుంటుందా అంటే అదీ లేదు. ప్రభుత్వమువారు అపా యింటు చేసిన రాయల్ కమీషన్ వారు టీకాలవలన సవాయి, కుష్టు, క్షయ, రాచపుండు, వాక్సీనియా, ఎన్‌సి ఫెలోమై ఎలిటిస్ అనే దుర్భరవ్యాధులు వస్తవని నిర్ధారణ చేశారు. ఆ రాయల్ కమీషన్ లోనూ, అండూస్, రోలెస్టన్ కమిటీలలోనూ పనిచేసిన కమీషనరులు ఎటు వంటివాళ్ళో తెలుసా?

పెద్దడాక్టరులు.

టీకాలవల్లనే మశూచికము పోతుందని తాము చదివే చదువు వల్లా నమ్మేనమ్మకాలవల్లా రూఢిఅయిన చిత్తసం స్కారము గలవారు. అట్టివారే టీకాలవల్ల రోగాలు— అవీ సామాన్యమైనవా? క్షయాది దుర్భరవ్యాధులు—వస్త వని చెప్పుతుంటే—

అమందు పుచ్చుకోమని బాధ్యతగలవారు ఎవరూ చెప్ప గూడదు.

ప్రోత్సహించటం పనికేరాదు.

నిర్బంధించటం అసలు ద్రోహము.

ఊరికే నిర్బంధించటమూ, జరిమానాలు శిక్షలు

ఈనిర్బంధము ఒకతూరా, కాదు రెండుతూరులు.

పోనీ వారిశాస్త్రముప్రకారమే ఒకగొట్టములోని టీకా రసము మంచిదని యెవరైనా గారంటీ (అభయహస్తము) యిస్తారా అంటే! రాజన్ మంత్రివద్దనుండి టీకాలువేసే యినస్పెక్టరువరకూ యెవరూ బాధ్యత వహింపరు.

టీకాలు వేయటంలో వస్తవి చాలా అపదలంటారుగదా? ఎలావేస్తే అపదలురావో అలాగే వేస్తారు, ఫలాని వాక్సి నేటరు అని యెవరన్నా బాధ్యతవహిస్తారా? అదీలేదు.

మహా మహా మొనగాడైన హెల్తుఆఫీసరు వేసినా ఆ యాప దలు రావని అభయహస్తమిచ్చివేస్తాడా? వాడికి ధైర్యమూ లేదు. అవసరమూ లేదు. ఇలాంటి పరిస్థితులలో-

రాజన్ మంత్రి అంటాడుగదా:—

“నాకు టీకాలువేయటం చాలా అవసరమని తెలుసు. నా కావిషయంలో గట్టినమ్మకముంది. దానిని మరల్చుటకు యింగ్లాండులో టీకాలనిషేధసంఘాధిపతులైన హాడ్ వెన్ గారికే సాధ్యముకాలేదు. మీరు నన్ను తిప్పటానికి ప్రయత్నం చేయటం రాతిగోడను తలతో కొట్టి మెత్తపర చటానికి చేసే ప్రయత్నంవంటిది; వ్యర్థము. నామాట సాగితే - (సాగకేమి చేస్తుంది) ప్రతిబిడ్డకు పుట్టిన పదవ రోజులోపలనే టీకాలు వేయించి మశూచికమురాకుండా కాపాడతాము. మళ్లీ 7, 8 సంవత్సరాల కల్లా రెండవ తూరి టీకాలు వేయిస్తాను నిర్బంధము సాగించవలసివస్తే సాగించేతీరుతాను. ఎంత ఆరోగ్యవంతులైనా, ఎన్నినిద ర్శనాలు చూపించినా ఏయొక్కరినీ వదలిపెట్టము”అని. పెగా రాయబారానికి వెళినవారిని గురించి చెప్పుతూ ‘వారు మూఢనమ్మకము (Fanatics) గల వా’రన్నాడు. పై గ్రంథమంతా చదివినవారికి యెవరికైనా రాజన్ మంత్రి యెట్టిఫానెటిక్కో బాగానే తెలుస్తుంది. ఆ వివర ములు 1938 జనవరి ప్రకృతిపత్రికలో చూడవచ్చును. ప్రజలు ఆరోగ్యవిధులను నేర్చుకోవాలి. పరిశుద్ధత అవ లంబించాలి. ఇతర దేశాలలో అలాచేయటం వల్ల మశూ కం ఆగింది. ప్రతిమనిషీ తను తినదగినంత యుక్తమయిన ఆహారమునే తినవలెను. తడిగల కూరగాయలను గూడా అన్నముతో తినవలెను. శక్తిగలవారు పాలను, పండ్లను తినవచ్చును. ప్రతిదినమూ స్నానము చేయవలెను. పరిశుభ్ర మైన వస్త్రములను, దుస్తులను, పక్కగుడ్డలనే వాడ వలెను. ఆకలి కానిదే వేనినీ తినరాదు. ఆకలి అయిన వానికి తినుటకు ఆహారము లభింపవలెను. కట్టుకొనుటకు, అవసరమైనన్ని దుస్తులు లభింపవలెను. గాలీ వెలుతురు తగులుచోట ప్రతివారూ తగినంత పనిపాటలు చేసుకొను చుండవలెను. పట్టణముల పెంపు ఆగిపోయి పల్లెలు సర్వ సమృద్ధిగలవిగా తయారుగావలెను. అచట శాంతి, పుష్క లత, సౌఖ్యము నెలకొనవలెను. పట్టణములుగూడా యిప్పటివలె నరకకూపములుగా నుండరాదు. ఒక ఇంటి లోనే 50, 60 మంది నివసింపవలసిన అగత్యము తగ్గ వలెను. డ్రెయినేజీ ఎలక్ట్రిసిటీకంటె ముందు రావలెననే సంగతి ప్రతికౌన్సిలరూ తెలుసుకోవలెను. ప్రతి పట్టణ ములోనూ స్నాన పానాలకు కావలసిననీరు వెల పెట్ట కుండా ధారాళముగా లభింపవలెను. ఆహారపదార్థములు కలితీచేసినవెంటనే శిక్షిస్తూవుండాలి. దేశములో ఉండే కల్లు, సారాయి అంగళ్ళమీద నిర్వహించటానికి వీలు లేనంత అమితపన్నులన్నా వేయాలి; తీసిఅయినా వేయిం చాలి. కాఫీ, టీ, పొగాకూ, నల్లమందు ప్రజలు వాడుటకు అసాధ్యమయేటంత పన్నులన్నా వేయాలి; దేశములో ధనము పుష్కలముగా ఉండి పన్నులు అగత్యము లేకపోతే మానిపించన్నా మానిపించాలి. దేశములో వాడుకకు మరబియ్యము అసాధ్యమన్నా కావాలి. నిషేధించన్నా నిషేధించాలి. ఎన్నో చేయాలి.

ప్రజల ఆరోగ్యము వృద్ధికావాలి. అప్పుడు ఏ రోగమూ ప్రజలను పీడించదు.

మదరాసు రాజధానికి సంబంధించిన ఆరోగ్యశాఖవారి రిపోర్టులప్రకారం తయారుచేసిన కొన్ని అంకెలను మీ యెదుట నుంచుచున్నాను.

| | టీకాలువేసిన వారిసంఖ్య | మశూచికమువలన మరణించినవారిసంఖ్య |
|---|---|---|
| 1934 సం॥ | 52,23,920 | 18088 |
| 1935 సం॥ | 42,75,890 | 12330 |
| 1936 సం॥ | 34,88,976 | 4581 |

1935—'36 లో కంటె '36—'37 లో టీకాలు వేయబడినవారి సంఖ్య యింతతగ్గినది—786914.

మశూచికమువలన చనిపోయినవారి సంఖ్య యింతతగ్గినది- 7749

Para 33 and 101 of D. P. H. Reports'36 , '37.

టీకాలు 1932 సం॥లో రివాక్సినేషన్ నిర్బంధపరచినారు.

మశూచికమువలన మరణములు కూడా ఆ సంవత్సరమునకు ఆ సంవత్సరము పెరిగినవి.

| | | |
|---|---|---|
| 1932 లో | చనిపోయినవారి సంఖ్య— | 5363 |
| '33 లో | ,, | 10745 |
| '34 | ,, | 18088 |
| '35 లో | ,, | 12330 |
| '36 లో | టీకాలు తగ్గినవిగనుక చావులు తగ్గినవి | 4581 |

టీకాలువేసినా, చచ్చేవాళ్ళు చావకుండా మానలేదు.

| '36 సం॥లో | | మశూచికము తగిలినవారు | చచ్చినవారు |
|---|---|---|---|
| 1 టీకా వేసినవారు | | 457 | 39 |
| 2 టీకాలు | ,, | 750 | 35 |
| 3 టీకాలు | ,, | 360 | 25 |
| 4 టీకాలు | ,, | 720 | 13 |
| | | 2287 | 112 |

## ప్రారంభోపన్యాసము

రామరాజ యోగీంద్రులు.

టీకాలు వేయటమనేది మశూచికొన్ని అపలేకపోయినదని వేరే చెప్పనక్కరలేదు. మశూచికము రాకుండా వుండాలి అంటే ప్రజల ఆరోగ్యము బాగుపడవలెను. అందుకు ఆరోగ్యనియమాలు ప్రజలంతా తెలుసుకొని ఉండవలెను. అనారోగ్యకరములైన పనులను మానివేయవలెను.

అన్నింటిలోకి ఉప్పు యెక్కువ అపకారము చేస్తోంది. ఉప్పునీటిని లోహాలమీద వరుసగా చల్లండి. రాతిమీద చల్లండి. కొయ్యమీద చల్లండి. మట్టిగోడలమీద చల్లండి. అవి చెడిపోతవి. తోలుగూడా యిలాగే చెడిపోతుంది. అలాగే మన దేహముగూడా ఉప్పువల్ల యెంత చెడిపోతూ ఉందో అనేకులకు తెలియదు

ఉప్పుయొక్క వాడుకను బాగా తగ్గించాలి. అప్పుడు ప్రజల ఆరోగ్యము బాగుపడుతుంది. టీకాలలో ఉండేది కుళ్ళినచీము. దానివలన యేరోగమన్నా రాకుండా ఆపవచ్చునంటే యెంతటి బుద్ధిహీనుడుగూడా నమ్మజాలడు. దానిని మనము వేయించుకోకపోవటమే ప్రభుత్వమునకు సరియైన జవాబు. అప్పుడు వారే దానిని రద్దుపరుస్తారు.

# అధ్యక్షోపన్యాసము

ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు మద్రాసు లెజిస్లెటివు అసెంబ్లీ సభ్యులు

టీకాలను గురించి వాటివల్ల గలిగే ఆపదలను గురించీ సభాముఖమున ఉపన్యసింపవలసివచ్చుట నా కాశ్చర్యము గలిగించుచున్నది. ఏమాత్రము మురికన్నా ఒంటికి తగిలితే అసహ్యించుకొని కడుక్కుంటామే, ఒక ఆవు దూడకు బలవంతాన మశూకము తెప్పించి, ఆమశూచికము పొక్కులలోని చీము మన దేహములోనికి యెక్కించితే అది తప్పకుండా అపకారము చేస్తుందనీ—ఉపకారము యేమీ చేయదనీ యెవరో డాక్టర్లువచ్చి చెప్పాలా? మనకు స్పష్టముగా తెలుస్తూ ఉండలేదా?

మురికివల్ల మురికే కలుగుతుంది. విషమువల్ల యేమి ఆపదలు రావాలో అవి వచ్చే తీరుతై. ఆ విషఫలితమును యెవరూ తప్పించుకోజాలరు.

అందువల్లనే గొప్ప డాక్టరులంతా, అమెరికాలోనూ, ఇంగ్లాండులోనూ, గూడా టకాలవలన అసంఖ్యాకము

లైన దుర్భరవ్యాధులు గలుగుతవని చెప్పినారు. అందుకు యెవరూ ఆశ్చర్యపడ నక్కరలేదు. టీకాలు నిరుపయోగ మయినవని గూడా డాక్టరులు యింకా బాగా స్పష్టము గానే చెప్పియున్నారు. ఇంతేగాదు. టీకాలు యెంత తీవ్రముగా వేస్తే మశూచికము గూడా అంత తీవ్రముగా వృద్ధి బొందుచున్నది. ఈ క్రింది అంకెలుగూడ ఆ విషయాన్నే నిర్ధారణ చేయుచున్నవి. మన దేశమున చెన్నపురిలో 1880 నుండి 1897 వరకు లక్షకు 10 మంది మాత్రమే మశూచికమువలన మరణించుచుండేవారు. అప్పుడు టీకాలు నిర్బంధముగా లేవు. 1918-22 సంవత్సరాలమధ్య టీకాలు బాగా నిర్బంధముగా వేయనారంభించినారు. అప్పుడు యేటేటా మశూచికమువలన లక్షకు 80మంది మరణించిరి. అనగా టీకాలు నిర్బంధించని కాలమునందుకన్న, నిర్బంధించిన తరువాత 8 రెట్లు పెరిగినది. లండన్‌లోనూ యిలాగా జరిగినది. అక్కడగూడా అంకెలిట్లేయున్నవి. టీకాలు నిర్బంధముగా వేసిన 1888-97 సంవత్సరాలలో మశూచికమువలన లక్షకు 1 రు మరణించిరి. 1918-22 సంవత్సరములలో ఐచ్ఛికము చేసి తరువాత 10 లక్షలకు 1—5 మరణించిరి. మదరాసు ప్రభుత్వమువారు 1938 మార్చిలో వెలువరించిన ప్రకటనగూడా యీసంగతినే స్థిరపరచినది.

టీకాలు వేయాలనేవారుగూడా ఒకస్థిరమైన అభిప్రాయములేకుండా అప్పటప్పటికి అనేకమైన మార్పులు చేస్తున్నారంటే అర్థమేమిటి? టీకాలు నిరుపయోగమైనవనే దీనినుండిగూడా తేలుతుంది. మొదటయేమన్నారు? ఒకసారి టీకాలువేస్తే జన్మకు మశూచికము రాదన్నారు. రాయల్‌కమిషన్‌వారు తమరిపోర్టులో టీకాలు మళ్ళీ మళ్ళీవేయాలన్నారు. ఇప్పుడేమంటున్నారు? దేహమంతా టీకాలచీముతో నింపివేయాలెనట. అప్పుడుగాని మశూచికము సాంతముగా రానిస్థితి యేర్పడదట.

వాదానికి టీకాలువేస్తే మశూచికమురాదనే అనుకొందాము. మనము ఆట్లాచేయవలసిందేనా? అది క్షేమమైనదేనా? టీకాలువేస్తే మశూచికము రాకుండా పోతుందిగాని ఇంకా యింతకన్న దుర్భరమైన క్షయ, కుష్ఠు మొదలయిన వ్యాధులమాట యేమిటి? ఆవ్యాధులన్నీ టీకాలవల్ల వస్తవని రాయల్ కమిషన్‌వారున్నూ, అంద్రూసు, రాలెస్టర్ కమిటీ రిపోర్టులున్నూ, చెప్పుచున్నవి. మద్రాసురాజధాని ఆరోగ్యశాఖవారి రిపోర్టులుచూడండి. 1932, 33, 34 సంవత్సరాలలో మశూచికమువలన యెంతమంది చనిపోయిరో కలరావలగూడా అంతేమంది చనిపోయినారు. 1935 సంవత్సరములో కలరావల్ల మూడు రెట్లు మరణించిరి. గ్రహణి అతిసారములవలన 1932 సంవత్సరములో మశూచికమువలనకన్న 16 రెట్లు 1933 లో 5 రెట్లున్నూ, 1934 లో 8 రెట్లున్నూ మరణించిరి. సంగతు లిట్లుండగా గ్రహణిఅన్నా అతిసారమన్నా భయపడరేమి? మశూచికము అంటేనే యింతభయ మెందుకు? కలరాకూ, అతిసారము, గ్రహణి మొదలగు రోగములకు గూడా నిర్బంధముగా టీకాలువేయ పనిలేదా?

టీకాలవలన యెట్టి అపదలు కలుగునో నేను వ్రాసియుంచినాను. 1917 లో తంబుచెట్టివీధిలో ఒక యువకుడు టీకాలువేసిన మరు గంటలోనే మరణించినాడు. చిత్తూరులో 1925 సంవత్సరములో డిప్యూటీ మేజస్ట్రేటుగారి బిడ్డ టీకాలువేసినతరువాత 2,3 నెలలలో మరణించినాడు నెల్లూరులో ఒక బిడ్డకు టీకాలువేసినారు. జబ్బుచేసింది. మిషన్ ఆసుపత్రిలో మందిచ్చినాగూడా ఆబిడ్డ చనిపోయింది. కలెక్టరు ఆఫీసుగుమాస్తాగారి మనుమరాలు యీ బిడ్డ. నా తోడబుట్టినవాని కుమారైకు టీకాలు వేశినారు. నెలరోజులలోనే ఆబిడ్డ మరణించినది. 1937 లో సాలీల బిడ్డకు టీకాలువేసినారు. 10 వ నాడే ఆబిడ్డ మరణించెను. నేనింతకన్న యెక్కువగా వివరింపను. ఘోరమైన లైసెన్సు పొందిన హత్యాచరిత్ర యిదంతా గూడ. టీకాలవలన మరణించినవారే అదృష్టవంతులు. అందులో రోగము వచ్చినవారు బ్రదికినను వారు జీవించినంతకాలము రోగిష్ఠులుగాను, దీనులుగాను ఉంటున్నారు.

ఇంతా అయితే మనము ప్రభుత్వమువారిని యేమి అసాధ్యమైన కోరిక కోరుచున్నాము? టీకాలవలన మేలు కలుగుతుందనే నమ్మకము లేక దానివలన అపదలు వస్తవని నమ్మేవారి బిడ్డలకు టీకాలు వేయకుండ విడుదల యిప్పించుడని.

ఇంగ్లండులోనూయిలాగే జరిగింది. 1853లో టీకాల శాసనము నిర్బంధము చేసిరి; రాయల్ కమిషన్ వారి నివేదిక వెలువడిన తరువాత టీకాలు ఐచ్ఛికము చేసినారు. తమకు టీకాలలో నమ్మకము లేదని మేజస్ట్రేటుగారివద్ద స్టేటుమెంటు దాఖలుచేసినవారి బిడ్డలకు టీకాలు వేయకుండా వదలివేస్తారు, ఆవిధంగా 1888 సంవత్సరమునుండి టీకాల శాసనములో మార్పుచేశారు, ఇండియాలో గూడా అట్లాగే చేయుమని మన మంటున్నాము. టీకాలయందు విశ్వాసమున్నవారి దేహములు టీకాల రసముతో నింపుకొన్న మన అభ్యంతరమేమీలేదు. అంతేగాని బుద్ధి

పూర్వకముగా వద్దనే వారి బిడ్డలకు టీకాలు వేసే తీర వలెననే నిర్బంధ ముండగూడదు, టీకాల శాసనములో.

మహాత్ముడు మనపట్టున్నాడు. కాంగ్రెసుప్రభుత్వము అధికారములోనున్నది. మనకోరికెలు యీడేరకమానవు. సాత్వికనిరోధాన్ని గురించి మనము యిప్పుడు మాట్లాడ వద్దు. ప్రభుత్వము మనన్యాయమైన కోర్కెలు చెల్లింపక పోయినయెడల అది సాత్వికనిరోధాన్నిగురించి ఆలోచించుకొనుటకు తగినకాలము. ఈలోపుగా మనము ఆందో ళనచేదాము. ఈలోపుగా ప్రజలలోను, ప్రభుత్వములో గూడా ప్రబోధము కలిగించాము. ఇదివరకే అనేకజిల్లాల నుండి అనేకమందివ్యక్తులూ, సంఘాలూ ప్రభుత్వమునకు యీవిషయమై విన్నపములు పంపియున్నారు. బహిరంగ సభలలో జేసిన తీర్మానములున్నూ ప్రభుత్వమునకు పంపియున్నారు. ఇంకా కొంతమందినిగూడా పంపుదాము. వానితో ప్రభుత్వమునకు మనకోర్కెలు తీర్పక తప్పని సందర్భ మేర్పడుతుంది.

# రానములు

I. 1. అహింసాజీవనులైన భారతీయులకు హింసా లబ్ధమైన టీకారసము మానసిక క్లేశ కారణమైయున్నది గనుకను,

2. టీకాలు వేసినా మసూచికము రానే వచ్చుచున్నట్లు ప్రభుత్వము వారి లెక్కలవలననే తేలుచున్నందునను,

3. టీకాలు వేయించుకున్నవారికి టీకాలు వేసిన తరువాత. క్షయ, రాచపుండు, కుష్టు, సవాయి, మొదలగు వ్యాధులు కలుగుచున్నవని రాయల్ కమీషన్ వారును ఎన్. సి. షెలో మైలిటిస్ అనేవ్యాధికలుగుచున్నదని రోలెస్టన్ కమిటీవారునూ నిర్ధేశించి యున్నందునను.

4. మన చుట్టుప్రక్కల అనేక మందిబిడ్డలు టీకాలు వేసిన తరువాత సిఫ, కరపాణి మొదలగు చర్మవ్యాధులను జీర్ణవ్యాధులను కలిగి అందు కొందరు రోగిష్టులును మృతులును అగుచుండుటవలనను,

5. టీకాలు నిర్బంధము గాకుండా ఐచ్ఛికము చేయవలసినదనియు, టీకాలు తమ బిడ్డలకు అపకారము చేస్తవని నమ్మే వారిబిడ్డలను టీకాలు బాధింపకుండునట్లు టీకాలశాసనములోనూ ప్రజారోగ్యచట్టములోనూ మార్పులు గావింపవలసినదనియు యీ సభవారు మద్రాసు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

ప్ర॥ డా॥ వాడపల్లి మురహరిరావుగారు.

అ॥ రామరాజ యోగీంద్రులవారు.

II. క్రొత్తగా ప్రవేశపెట్టబోవుచున్న ప్రజారోగ్యచట్టములో 72 క్లాజులో ఆరోగ్యశాఖవారికి, వాక్సినేషన్ ఇనాక్యులేషన్ నిర్బంధముగా వేయుటకు అదనపు అధికారములు యిచ్చే ఏర్పాటువున్నది. దానినిచూచి యీసభవారు భయభ్రాంతు లగుచున్నారు. కనుక పైబిల్లులో నుండి ఆభాగమును తీసివేయవలెనని యీ సభవారు ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

ప్ర॥ అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు.

అ॥ కొలిపాక ఆదినారాయణశర్మగారు.

III. మహాత్మగాంధిగారు యిదివరకే టీకాలనుగురించి తీవ్రముగా ఖండించియున్నారు. వారు తమ పలుకుబడిని వినియోగించి ప్రజారోగ్యచట్టములో టీకాలు ఐచ్ఛికము అయ్యేలాగా ప్రయత్నింప వలయునని యీ సభవారు గాంధి మహాత్ములవారిని ప్రార్థించుచున్నారు.

IV. అఖిలభారతకాంగ్రెస్ కమిటీవారిని ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెస్ కమిటివారిని ప్రజారోగ్యచట్టములో ఐచ్ఛికము అయ్యేలాగా ప్రయత్నింప వలయుననియీ సభవారు పై వారిని కోరుచున్నారు.

V. టీకాలు ఐచ్ఛికము అయ్యేలాగా ప్రభుత్వము వారిని ఒప్పించుటకు, అవుసరమైన, శాస్త్రీయమైన బలమైన ప్రచారము సాగించుటకు ప్రతిజిల్లాలోనూ ప్రచారకులను చేర్చవలయునని యీసభవారు కోరుచున్నారు.

1. కెప్టెన్॥ డా. వాడపల్లి మురహరిరావుగారు,
ప్రకృతి ఆఫీసు, బెజవాడ.

2. డా. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు.
ఆంధ్రదేశానికి అసిస్టెంటు కెప్టెన్.

VI. యీసభాకార్యములను నిర్వర్తించుటకు ఆంధ్రదేశానికంతకు ఒక టీకాల వ్యతిరేకసంఘమును స్థాపింపవలయునని యీసభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు : శ్రీ వోరుగంటి వెంకటసుబ్బయ్యాగారు.
ఉపాధ్యక్షులు : డా॥ ఆచంట లక్ష్మీపతిగారు.
బి. ఎ. ఎం. బి. సి. యమ్.,
సి. ఆర్. పార్థసారథి అయ్యంగారు
బి. ఏ. బి. ఏల్. ఎం. ఎల్. ఎ.,
రామరాజయోగీంద్రులు, పశ్చిమకృష్ణా.
నడింపల్లి సుబ్బరాజుగారు, యం.ఎల్.ఎ.,
కార్యదర్శి : డా॥ పుచ్చా వెంకటామయ్యాగారు
ప్రకృతిసంపాదకులు.
సహాయ కార్యదర్శులు :
1. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు.
2. తూములూరు పద్మనాభయ్యాగారు,
నెల్లూరు.
ఉపపాదకులు : అయ్యంకి వెంకటరమణయ్యగారు
అమోదకులు : జె. యల్. నరసింహమూర్తిగారు.

VII. ఏ మశూచిక నివారణకొరకు టీకాల విధానము నిర్మించినారో, అట్టి మశూచివ్యాధులను నివారించుటకు టీకాలు నిరుపయోగము, ఉపద్రవకరమనియు మశూచి వ్యాధిని నివారించుటకు పురపారిశుద్ధ్యము, యుక్తాహార ప్రచారమే తగిన సాధనములయి యున్నవి, గనుక యీ పనులకొరకే ప్రస్తుతము, ప్రభుత్వమువారు టీకాలశాఖకు ఉపయోగించు ద్రవ్యము వినియోగించ వలయుననియు యీ సభవారు అభిప్రాయ పడుచున్నారు.

డా॥ వాడపల్లి మురహరిరావుగారు,
డా॥ పుచ్చా వెంకటామయ్యగారు,

సభాధ్యక్షులు వారి యంత్యోపన్యాసము అయిన తరువాత అధ్యక్షులవారికి వందనములతో సభ ముగింపు చేయ బడినది,

## ప్రకృతి కార్యాలయట్రస్టు — బెజవాడ.

### 1938 సంవత్సరం సెప్టెంబరు నెల లెక్కలు.

| జమలు | | రు. అ. పై | ఖర్చులు | రు. అ. పై |
|---|---|---|---|---|
| వెనుకటినెల నిల్వ | | 211-10-10 | భరణములు | 33- 5-4 |
| ప్రకృతిపత్రిక | | 27- 0- 0 | అచ్చుపని | 140- 0-0 |
| పుస్తకముల అమ్మకం | 23-14-6 | 26- 9- 0 | ఇండియన్ నాచురోపతిక్ అసోసియేషన్ | 0- 3-0 |
| పుస్తకముల పోస్టేజీలు | 2-10-6 | | గాంధికో-ఆపరేటివు బ్యాంకులో వేసినది | 90- 0-0 |
| ప్రకృతిస్టోర్సు అమ్మకం | | 11-10- 0 | వ్యాజ్యంతాలూకు ప్లీడరుఫీజు | 5- 0-0 |
| అప్పులవసూళ్లు | | 15- 6- 0 | స్టేషనరీ | 7-14-0 |
| గాంధికో-ఆపరేటివుబ్యాంకునుండి తీసినరొక్కం | | 30- 0- 0 | మిసలేనియస్ | 1- 0-3 |
| ఇండియన్ నాచురోపతిక్ అసోసియేషన్ నుండి | | 24-12- 0 | నౌకర్లు | 18- 4-0 |
| ఇండ్ల అద్దెలు | | 10- 0- 0 | జనరల్ పోస్టేజీలు | 1-14-9 |
| | | | పుస్తకములపోస్టేజీలు | 2- 3-0 |
| | | | పత్రికపోస్టేజీలు | 7- 5-6 |
| | | | స్టోర్సు | 2- 7-0 |
| | | | ఇండ్లమరమ్మతులు | 3- 1-6 |
| | | | ఇంటిపన్నులు | 6- 9-3 |
| | | | ఫర్నిచర్ | 16-15-3 |
| | | | నిల్వరొక్కము | 20-13-0 |
| | | 356-15-10 | | 356-15-10 |

వేమూరి మల్లికార్జునరావు,
మేనేజరు.

అయ్యంకి వేంకటరమణయ్య,
కార్యదర్శి.

# ప్రకృతి చికిత్సాగ్రంథములు

## వివిధవ్యాధులకు చికిత్సాగ్రంథములు

| | వెల ఇతరులకు | వెల చందాదార్లకు |
|---|---|---|
| క్షయ | 0 12 0 | 0 8 0 |
| శుక్లనష్టము | 0 12 0 | 0 8 0 |
| మలబద్ధకము | 0 12 0 | 0 8 0 |

## వేదాంతము, ఇతరములు

| | | |
|---|---|---|
| ఋషిజీవనప్రకాశము | 0 4 0 | 0 3 0 |
| స్త్రీలపవిత్రము | 0 2 0 | 0 1 0 |
| ఆదర్శసుఖజీవనము | 1 0 0 | 1 0 0 |
| మహాయోగము | 0 12 0 | 0 8 0 |
| నిర్వ్యాచారజీవనము | 0 12 0 | 0 8 0 |
| యుక్తిప్రకాశము | 0 8 0 | 0 5 0 |
| రామతీర్థస్వామివేదాంతోపన్యాసములు | | |
| 1 భాగము | 8 0 | 0 5 0 |
| 2 భాగము | 8 0 | 0 5 0 |

## వ్యాయామము

| | ఇతరులకు | చందాదార్లకు |
|---|---|---|
| అనుభవయోగాభ్యాసము | 1 4 0 | 1 4 0 |
| సూర్యనమస్కారములు | 0 4 0 | 0 4 0 |
| డిటో పటములు | 0 2 0 | 0 2 0 |

## ప్రకృతి వెనుకటి సంపుటములు

| | | |
|---|---|---|
| ప్రకృతి 4,5,6,7,11 సంపుటములు | | |
| ఒక్కొక్కటి | ఇతరులకు | 1 8 0 |
| | చందాదారులకు | 1 2 0 |
| ప్రకృతి 12,13,14,15 సంపుటములు | | |
| ఒక్కొక్కటి | ఇతరులకు | 3 0 0 |
| | చందాదారులకు | 2 8 0 |
| 16వ సంపుటము | ఇతరులకు | 1 4 0 |
| | చందాదారులకు | 1 0 0 |
| 17వ సంపుటము | ఇతరులకు | 3 4 0 |
| | చందాదారులకు | 3 0 0 |

Dr. BABBITT'S

# HUMAN CULTURE AND CURE

IN 5 PARTS — IN 1 VOLUME

The Standard work on Chromopathy, which is not available to the public for a long time.

| | |
|---|---|
| Part I | Philosophy of Chromopathy and apparatus. |
| Part II | Sexualogy and Sociology. |
| Part III | Psychology and Mental Healing. |
| Part IV | Nervous system and Insanity |
| Part V | Diseases of organs and Cure. |

576 Pages — 150 Illustrations

Will be printed on heavy antique paper and bound in cloth.

Pre-publication price (To be paid in advance) .... .... Rs. 10

Post-publication price .... .... .... ... .... Rs. 20

*For detailed prospectus apply to:—* **The Chromopathic Institute,**

**Andhra Grandhalaya Press Buildings,** BEZWADA



# లుగు కాగడా!

తెలుగు వీరుడా
తెలుగు ధీరుడా
తెలుగు కాగడా



తోడ

తెలుగు వెలుగును
తెలుగు వెలుతురును
క్రొత్త తేజస్సుతో
క్రొంగ్రొత్త రుచులతో
వెలయింపవోయి
వేగపడవోయి
తెలుగు వీరుడా
తెలుగు ధీరుడా





Edited, Printed & Published at the Andhra Grandhalaya Press, By Dr. P. VENKATRAMAYYA,
PRAKRITI OFFICE, BEZWADA.

# టీకాలు

## వేయరాదు ఎందుకు...

డాక్టరు పుచ్చా వెంకట్రామయ్యా గారిచే

సంపాదింపబడినది

పబ్లిషర్సు

ప్రకృతి కార్యాలయ ట్రస్టు - బెజవాడ

# ప్రకృతి చికిత్సాగ్రంథములు

## సూర్యకిరణచికిత్సాగ్రంథములు

| | వెల ఇతరులకు | వెల చందాదార్లకు |
|---|---|---|
| ఘనిశీత వైద్యం | 4 8 0 | 3 8 0 |
| ప్రౌఢప్రభాకరం | 2 0 0 | 1 8 0 |
| సూర్యకిరణచికిత్స | 0 12 0 | 0 8 0 |
| ఆరోగ్యప్రభాకరం | 0 4 0 | 0 3 0 |
| వర్ణచికిత్స | 0 6 0 | 0 4 0 |
| వర్ణవైద్యమంజరి | 0 6 0 | 0 4 0 |
| వర్ణవైద్యము | 0 5 0 | 0 4 0 |

## జలచికిత్సాగ్రంథములు

| | | |
|---|---|---|
| తొట్టివైద్యము | 3 0 0 | 2 8 0 |
| లక్ష్మణజలచికిత్స | 0 12 0 | 0 8 0 |
| నైపీయ జలచికిత్స | 0 12 0 | 0 8 0 |
| తొట్టిస్నాననియమములు | 0 6 0 | 0 4 0 |
| ధారాచికిత్స | 0 4 0 | 0 3 0 |
| వేడినీటికాపు ఉబ్బసపుచికిత్స | 0 6 0 | 0 4 0 |
| ఉషఃపానము | 0 6 0 | 0 4 0 |
| కూనేమహర్షిబోధ | 0 2 0 | 0 1 0 |
| జస్టుచికిత్స | 0 10 0 | 0 8 0 |

## ఆహారశాస్త్రగ్రంథములు

| | | |
|---|---|---|
| నిర్విచారభావిజీవనము (కొబ్బరినిగూర్చి) | 1 8 0 | 1 0 0 |
| ఆహారము 1 భాగము | 0 12 0 | 0 8 0 |
| డిటో 2 భాగము | 0 4 0 | 0 3 0 |
| పచ్చితిండివలనిప్రయోజనములు | 0 12 0 | 0 8 0 |
| తెల్లచక్కెరవలని విపత్తు | 0 6 0 | 0 4 0 |
| తేనీరు విషతుల్యము | 0 6 0 | 0 4 0 |
| జంబీర చికిత్స | 0 3 0 | 0 2 0 |
| సమరసాహారము విరుద్ధాహారమిశ్రమం | 0 2 0 | 0 1 0 |
| ఆహారసమ్మేళనపు గోల | 0 2 0 | 0 1 0 |
| అల్యూమినియంపాత్రలు | 0 2 0 | 0 1 0 |
| క్షీరచికిత్స | 0 4 0 | 0 3 0 |
| అపక్వశాకాహారఅద్వైతసిద్ధాంతం | 2 0 0 | 2 0 0 |

## దురభ్యాసఖండనములు

| | | |
|---|---|---|
| జీవహింస | 0 4 0 | 0 3 0 |
| అనుభవానందము | 0 12 0 | 0 8 0 |

| | వెల ఇతరులకు | చం |
|---|---|---|
| మహారోగము | 0 8 0 | |
| పొగచుట్ట — ముక్కుపొడుం | 0 4 0 | |
| కల్లుముంత - సారాపీపా | 0 4 0 | |
| ఔషధవైద్య మొకయూహాశాస్త్రము | 0 4 0 | |
| టీకాలననేమి? డాక్టర్లఅభిప్రాయము | 0 4 0 | |
| అల్యూమినియంపాత్రలు | 0 2 0 | |
| తేనీరు విషతుల్యము | 0 6 0 | |
| తెల్లచక్కెరవలనివిపత్తు | 0 6 0 | |

## ఆరోగ్యవిషయకగ్రంథములు

| | |
|---|---|
| స్వాభావికచికిత్సానియమములు | 0 5 0 |
| ఆరోగ్యాదర్శము | 0 8 0 |
| ప్రకృతిచికిత్సాఉపన్యాసములు 3 భాగములు, ఒక్కొక్కటి | 0 5 0 |
| శిశుమాతల శోక సందేశము | 0 4 0 |
| ఆరోగ్యము - కామేచ్ఛ | 0 3 0 |

## వివిధచికిత్సాగ్రంథములు

| | |
|---|---|
| ప్రకృతి గృహవైద్యం | 2 8 0 |
| దీర్ఘరోగచికిత్సాసారము | 1 8 0 |
| ప్రాకృత చికిత్సార్ణవములు | |
| 1 భాగము | 1 8 0 |
| 2 భాగము | 1 4 0 |
| 3 భాగము | 1 8 0 |
| 4 భాగము | 0 6 0 |
| 5 భాగము | 0 6 0 |
| 6 భాగము | 0 6 0 |
| 7 భాగము | 0 6 0 |
| ఉపవాసచికిత్స | 1 0 0 |
| జస్టుచికిత్స | 0 10 0 |
| ధ్యానచికిత్స | 0 8 0 |
| జంబీరచికిత్స | 0 3 0 |
| యోగచికిత్స | 0 6 0 |
| సంవాహనచికిత్స | 0 6 0 |
| రక్తపరిక్షాళనచికిత్స | 0 5 0 |
| స్వాభావికచికిత్సా నియమములు | 0 5 0 |
| వైదికచికిత్సాపద్ధతి | 0 5 |

అడ్రసు—మేనేజరు ప్రకృతి, బెజవాడ.

# టీకాలు వేయరాదు

## ఎందుకా...



డాక్టరు
పుచ్చా వెంకట్రామయ్యగారిచే
సంపాదింపబడినది



పబ్లిషర్సు
ప్రకృతి ర్యాలయము ట్రస్టు - బెజవాడ
వెల 0-2-0

# అంకితము

బాలబాలికలగన్న తల్లిదండ్రులకు
దేశాభ్యుదయముగోరు దేశనాయకులకు
శాసనదాతలగు శాసనసభ్యులకు
దేశారోగ్యముకొరకు తపించే వైద్యవరులకు
ప్రజారోగ్యమునకు బాధ్యులైన ఆరోగ్యశాఖవారికి
విజ్ఞానధనులగు పండితులకు

యీ గ్రంథము అంకితము చేస్తున్నాం.

ఎందుకా

మీరందరూ చదివి, తెలుసుకొని దేశాన్ని బాగుచేయుగోరితేతప్ప యీ టీకాల పీడ వదిలేటటు లేదు.

సంపాదకుడు.

# టీకాలు వేయరాదు

## ఎందుకా...

డాక్టరు పుచ్చా

'టీకాలు వేయరాదు' అనటంతోనే వెంటనే వచ్చే ప్రశ్న యేమిటంటే 'జనులు మశూచికముతో చచ్చిపోరా' అని. ఇలాంటివే ఒక ప్రశ్న తరువాత ఒకప్రశ్న చొప్పున అడుగుతూఉంటారు. వారందరి తృప్తికొరకు ఒక ప్రశ్నోత్తర మాలికగా యీ వ్యాసాన్ని తయారుచేశాను. చదువరులు శ్రద్ధగా చదివి సత్య మరయగోరుచున్నాను.

**౧ టీకాలు వేయకపోతే మశూచికము పెరిగిపోదా ?**

టీకాలువేయటంఅంటే యేమిటో యెరుగని రోజుల్లో మన చెన్నరాజధానిలో 10,000 జనములో సం॥రము మొత్తముమీద ఒక్కమనిషిమాత్రమే మశూచికమువలన చనిపోయే వాడు. టీకాలువేయటం ప్రారంభించిన తరువాత 1930 సం॥రములో 10,000 మందిలోను 8 మంది మశూచికమువలన చనిపోయినారు. తరువాత టీకాలు రెండవసారిగూడా వేస్తే మసూచికం ఆగిపోతుందనుకొని రెండవసారికూడా టీకాలునిర్బంధముగ వేయనారంభించారు. 1935వ సం॥లో మశూచికమువలన చనిపోయినవారిసంఖ్య 10,000 కి 32 అయింది. ఇక టీకాలువేయుట ఐచ్ఛికముచేసిన ఇంగ్లాండు వేల్సు దేశములలో నూటికి 66 మందికి టీకాలు వేయనేవేయరు. ఐనను ఆ దేశాలలో 1935 సం॥రములో ఒక్కరికి గూడా మశూచికము రానేలేదు. ఆ దేశములలో అదే సం॥రములో టీకాలు వేయుటవలన గలిగిన జబ్బులవలనను 8 మంది మరణించిరి. అదే దేశములో 1935 సం॥రములో నూటికి 36 మంది బిడ్డలకు మాత్రమే టీకాలువేశారు. ఆ సం॥రములో ఒక్కరుగూడా మశూచికము వలన మరణింపలేదు. దీనికేమంటారు ?

అందువలన టీకాలువేయుటవలన మశూచికము ఆగదనియు ఎప్పటికైనా టీకాలు మానివేస్తేనే మశూచికము అంతరిస్తుందనియు లెక్కలవలన తెలియుచున్నది.

ఇంగ్లాండు, వేల్సు దేశములలో 1872,1881 సంరముల మధ్య పుట్టిన బిడ్డలలో నూటికి 85½ మందికి టీకాలు వేసేవారు. ఆకాలములో సగటున సం॥రానికి మశూచికమువలన చనిపోయిన వారి సంఖ్య 3708.

అదే దేశములో 1912—1921 సం॥రముల మధ్య పుట్టిన బిడ్డలలో నూటికి 43½ మందికి మాత్రమే టీకాలువేసేవారు. ఆకాలములో సగటున సం॥రానికి మశూచికమువలన చనిపోయిన వారిసంఖ్య 12. దీని కే మంటారు ?

ఇక ఆస్ట్రేలియా చరిత్రవినండి.

అక్కడ టీకాలు 140 సం॥రాలనుండి అములులోఉన్నవి. ఆ దేశములో పుట్టిన బిడ్డలలో నూటికి 20 మందికంటె యెప్పుడూ యెక్కువ మందికి టీకాలువేయలేదు. 1851—1910 సం॥రములమధ్యనే అదే దేశములో యెక్కువగా టీకాలువేశారు. అప్పుడుగూడా నూటికి 25 మందికన్న యెక్కువమందికి వేయలేదు

నూటికి 75 మందికి టీకాలు వేయకుండా చూచిన దేశము అదొక్కటేను. అయితే యేమిజరిగింది? ప్రపంచములో యే దేశములోను మశూచికము యీ దేశములో అంతగా అంతరించలేదు. గతించిన 50 సం॥రములలోనూ ఒక్క ఆస్ట్రేలియా దేశపు పిల్ల గూడా మశూచికము వలన చనిపోలేదు. దీని కేమంటారు?

**2 మశూచికమువలన జనులు మరణింపరా?**

మశూచికముగూడా ఒకవ్యాధియేను. దానికి గూడా సరియైన విధముగా చికిత్సచేసిన యెడల మశూచికమువలన ఒక్కడుగూడ మరణింపడు. భారత దేశమున యీ వ్యాధికి మందు వాడరు. అది 'అమ్మతల్లి' వలన వస్తుందనీ, ప్రార్థనవల్ల పోతుందనీ భారతీయుల నమ్మకము. దీనికి వాడిన మందులవలనను, చేసిన అపభ్రంశపు చికిత్సల వలనను, భయమువలనను, ఆరోగులకు క్రమమైన ఉపచారము చేయకపోవుటవలనను మరణించెదరు. సరియైన ఉపచారములు చేసినయెడల మశూచికమువలన ప్రాణాపాయము రాక మానును. పైగా "అన్నిరోగాలు మశూచికముతో పోతవి."

1904 సం॥రం మొదలు 1936 సం॥రము వరకు ఇంగ్లాండు వేల్సు దేశములలో మశూచికమువలన చనిపోయినవారి సంఖ్య 107.

అదే మశూచికము రాకుండా చేయాలని వేసిన టీకాలవలన 279 మంది మరణించిరి. టీకాలు వేసినవారికి, అసలుటీకాలు వేయకపోయినా గూడా మశూచికము వచ్చేదో రాదో యెవరికీ తెలియదు.

**3 మశూచికమువలన దేహముమీద మచ్చలు పడవా?**

మలమూత్రము జారీయై చెమటపోసిన యెడల అన్ని రోగములయందువలెనే సుఖముగలుగును. రోగమునకు కారణమగు మాలిన్యములు వెడలిపోవును. మశూచికమును నయమగును. రోగిని గాలితగులని మూలగదిలో పరుండబెట్టి రోగియొక్క ఆలనపాలన చేయనియెడల దేహము మురికి బాడలుపడుటకలదు. రోగిని గాలీ వెలుతురూ తగులుచోట పరుండబెట్టి, మలమూత్ర స్వేదములు జారీయగుటకు శ్రద్ధతీసుకొనినయెడల మశూచికమువలన కలిగినపుండ్లు, వెంటనే మానిపోవును. మచ్చలుగూడ ఒక సం॥రములోనే మాసిపోవును.

**4 మశూచికమువలన కన్నులుపోవా?**

మశూచికము వచ్చుటవలన కన్నులుపోవలసిన అగత్యములేదు. మశూచికమును గురించిచేసిన అభూతకల్పనలతోగూడిన ప్రచారము వలన మశూచికము అంటువ్యాధిఅనీ, రోగులదగ్గరకు పోయినవారందరికి మశూచికము తగులుతుందనీ, ఒళ్లంతా లొట్టలు పడుతుందనీ, కన్నులు పోతవనీ నమ్మిన అమాయకపుప్రజ మశూచికము అంటే తల్లడిల్లిపోతారు. నిజమునకు పిల్లలకు పుట్టే గజ్జీ చిడుమూ యెలాగంటిదో మశూచికముగూడా అంతే నిరపాయకరమైనది. మశూచికపురోగులకు సరియైన ఉపచారము చేయక ఉదాసీనభావము వహించిన సందర్భములలోను అజ్ఞానవశమున చేసిన అపభ్రంశపు చికిత్సలవలనను, జ్వరము తొక్కిపెట్టబడి, మలమూత్రస్వేదములు దేహములోనుండి వెలువడిపోక నిలచిపోయిన సందర్భములలో మాత్రమే యెక్కడో ఒకానొకరోగికి కన్నులుపోవచ్చును. అంతమాత్రముచేత మశూచికమువచ్చినంతనే కన్నులుపోతవనేమాట నమ్మదగినదిగాదు. ఆరోగ్యశాఖవారు యేమిచేయాలంటే వారికి ఇపుడున్న మూఢనమ్మికచే వారిప్రచారము చేస్తారని మా కేమీ

నమ్మకములేదు. మశూచికరోగముయొక్క నిజ ఆరోగ్యవర్ధక స్వభావమును, అది వచ్చినపుడు అవలంబింపవలసిన విధులను బాగుగా ప్రచారము చేయవలెను. అప్పుడు రోగులకు న్యాయమగు ఉపచారము జరుగును. అప్పుడు ఒక్క మశూచికరోగికిగూడా కన్నులు పోవనే సంగతి రుజువవుతుంది.

## ౫ టీకాలు అసలు యెందుకు పుట్టినవి

ఇంగ్లాండు దేశములోని చికిత్సా శాస్త్రము తప్పుదోవన పడియున్నది. ఇప్పటికిగూడా ఆతప్పు దిద్దుబాటు కానేలేదు. మశూచికమువలన అనేక వేలమందికి వచ్చే మశూచిక జ్వరాన్నిగూడా యితర జ్వరాలవలెనే అణిచి వేయాలని మందులు వాడేవాళ్ళు. ఆ జ్వరాన్ని అణచటానికి ప్రయత్నము చేయగూడదు. ఏమంటే దేహప్రకృతి అంత చురుకుగావుండి అణిచే ప్రయత్నాన్ని సహింపదు. అందువలన తప్పకుండా అనేకమంది మరణించేవారు. వైద్యులకు యేమిచేయాలో తోచేదికాదు.

## ౬ టీకాలను యెవరు కనిపెట్టిరి.

జెన్నరుఅనే టక్కరిమంగలి ఒక డుండేవాడు. అతడు అనేకవైద్య సంస్థల దగ్గరకిపోయి వైద్యబిరుద మివ్వవలసిందని ఆశ్రయించాడు. ఎవరూ వాని కాబిరుదము యివ్వలేదు.

కుడిచి కూర్చుని టీకాలరసమువేస్తే మశూచికము ఆగిపోతుందని ప్రచారముచేశాడు. టీకాలు వేయటం అనే ఆచారము శాస్త్రీయమైన పరిశోధనలవలన తేలిన శాస్త్రీయవిధానముగాదు. మూఢుల బుర్రలోపుట్టి మూఢవిశ్వాసమువలన వ్యాప్తిగాంచిన మూఢవిధానము. ఆ సంగతి యీ క్రింది విషయములవలన రుజువవుతుంది.

జెన్నర్ 1798 సం॥రములో టీకాలు వేసిన వారికి జీవితాంతమువరకు మశూచికము రాదన్నాడు. ఆ సంగతి రుజువు కావలెనంటే 50, 60 సం॥రాలన్నా చూడనిదే తేలదుగదా! అయినను బ్రిటిషు పార్లమెంటు ఈ అద్భుతవిధానము కనిపెట్టినందున కతనికి 1806 సం॥రములోనే 30,000 వేల పౌనులు బహుమతి యిచ్చారు. ఏమివిధానమో, దాని ఫలితము వారికి యెంత తెలిసిందో, అప్పుడే బహుమతి యేమిటో ఆలోచించండి!

## ౭ టీకాలు యెలా పని చేసినవి?

1840 సం॥రమునుండి ప్రభుత్వము వారు తాముగా టీకాలు వేయటం ఆరంభించారు. 1853లో టీకాలు నిర్బంధముచేశారు. 1861-69 సం॥రాలమధ్య టీకాలు వేయకుండా ఒక్కరిని గూడా వదలిపెట్టలేదు. అయినప్పటికి 1871-1872 సంవత్సరాలలో గలిగిన మశూచికపు యెత్తిపోతలవలన 42000 మంది మరణించినారు. ఇంగ్లాండు దేశమున జరిగిన యీచరిత్రచదివిన వారికి టీకాలు యెందుకు పుట్టినవి అనేవిషయానికి జవాబువచ్చినది. టీకాలు యెక్కువగా వేసిన రోజులలో మశూచికముగూడా యెక్కువ అయినది. టీకాలు తగ్గించినకొద్దీ మశూచికము కూడా తగ్గింది.

## ౮ టీకాలవలన మశూచికము ఆగలేదా?

ఇంగ్లాండు దేశపు ప్రభుత్వమువారి లెక్కలప్రకారము మశూచికపు ఆసుపత్రులలో చేర్చుకొనబడిన మశూచికపురోగులలో నూటికి 90 మొదలు 100 వరకూ ఒకసారి టీకాలు వేయించుకున్నవారేను. టీకాలవలన మశూచికము రాకుండా మానదని తేలినది. టీకాలువేస్తే చచ్చేదాక మశూచికము రాదన్నాడు జెన్నరు

దొర. ఇప్పుడు యేమంటున్నారో తెలుసునా? టీకాలువేసినవారికి మశూచికము చాలా తేలికగాపోసి పోతుందట! జెన్నరు స్వంతచేతులతో టీకాలువేసినవారికిగూడా మశూచికము రాక మానలేదు. అప్పటినుంచే యీ 'తేలికగావస్తుం' దనేమాట పుట్టింది.

**౯ టీకాలులేని వారికి మశూచికము తీవ్రంగా వస్తుంది?**

అసలు నిర్బంధముగా టీకాలు వేసే దేశములో టీకాలు కొంతమందికి యెందుకువేయటంలేదూ? పిల్లలు పాలనలతపడి రోగగ్రస్తులై, భావసిద్ధముగా ఉంటే, వాళ్లకు టీకాలు వేయటంలేను. అంత రోగగ్రస్తులైనవారికి మశూచికమే యేమిటి? ఏ రోగమువచ్చినా తీవ్రంగానే వస్తుంది. టీకాలువేస్తేమాత్రం వాళ్లు బ్రదుకక పోయినారా?

ఆరోగ్యవంతులుగా ఉన్నబిడ్డలకు టీకాలువేయకుండాఉంచి, మశూచికపు రోగులవద్దకు ఆబిడ్డలనుపంపినా మశూచికమురాలేదు. కావలసినవారికి అట్టి బిడ్డలను కొందరిని చూపిస్తాను మన తెలుగు దేశములోనే. ఇంగ్లాండులో యిట్టి బిడ్డలను కొన్నివేలమందిని చూడవచ్చును.

**౧౦ టీకాలు రాకపూర్వము మశూచికమువల్ల యెక్కువ చనిపోయేవారా?**

ఈ సంగతి భారతదేశములోమాత్రము అబద్ధము. ఇంగ్లాండు మొదలైన దేశాలలో మశూచికము 1800లో చాలా యెక్కువగానే ఉండేది. ఇప్పుడు సంవత్సరానికి 10,00,000 లలో ఒక్కరికిగూడా మశూచికము రావటములేదు. దీనికి టీకాలు కారణమంటామా? టీకాలు 1870 లో నూటికి నూరుగురికి ఉన్నవి. అప్పుడు సంవత్సరానికి సగటున దాదాపు 4000మంది మరణించేవారు. 1934 సంవత్సరములో నూటికి 36 బిడ్డలకు మాత్రమే టీకాలువేసినా మశూచికము ఒక్కరికీకూడా తగులలేదు. మశూచికము తగులనివారిలో నూటికి 64 మందిఉన్నారు తెలుసా? అయితే మశూచికము యెందుకు తగ్గింది? అక్కడ పారిశుద్ధ్యము, ఆరోగ్యమువృద్ధిగాంచినవి. ప్రజలకు అన్నానికి గుడ్డకీ కరువులేదు. భారతదేశములోగూడ మశూచికము యెవరిని యెక్కువగాచంపుకునిపోతుంది? అన్నానికీ, గుడ్డకూ లేక, ఆరోగ్యమంటే యేమిటో తెలియక, పారిశుద్ధ్యము యొక్క పేరైనా ఉచ్చరించటానికి వీలుగాని, అవకాశముగాని లేని యిరుకుకొంపలలో, నల్లులవలె, పేలవలె జీవించే అభాగ్యులనే మశూచికము తనపొట్టపెట్టుకుంటున్నది. ఈ సంగతి తెలిసినవారు యెవరూగూడ టీకాలవల్ల మశూచికమును హతమార్చుద్దామని అనుకోరు. దారిద్ర్యము పోవాలి. ప్రజలకు ఆరోగ్యనియమాలు అవలంబించటానికి తగిన విజ్ఞానమూ, వసతీకలగాలి. పారిశుద్ధ్యము యేర్పడాలి. అంతవరకూ మశూచికము ఆగదు. నిప్పుకోడివలె కళ్లుమూసుకుంటే లాభములేదు. టీకాలు మశూచికాన్ని ఆపలేకపోయినై. చరిత్రఅనుభవమూగూడాదీన్నేరుజువుపరిచినై. ప్రతిష్టకొరకై పాకులాడితేలాభంలేదు. దేశం సుభిక్షంకావలె; ప్రజలకు ఆరోగ్యమునకు సంబంధించిన విషయాలు బాగా తెలియాలి; అవి అవలంబించటానికి తగినవసతీ, శక్తీ యేర్పడాలి. అప్పుడు పోతుంది మశూచికం; ఇతరదేశాలల్లో అలాపోయింది. మన దేశములోగూడా పోతుంది; టీకాలవల్ల మశూచికం పూర్వం పోలేదు; ముందుపోదు.

## ౧౧ టీకాలు అపకారము చేస్తవని యెవరు గుర్తించారు!

1853 సంవత్సరములో ఇంగ్లాండులో నిర్బంధ టీకాలశాసనము చేసినారు. అప్పుడు పార్లమెంటులో యేమిచెప్పారంటే:—* చిన్నతనములో ఒకతూరిటీకాలువేస్తే జన్మకు మశూచికము రాదు' అని.

1857 సంllరములో సర్ జాన్ సైమన్, యం. డి., యఫ్. ఆర్. యస్. హెల్త్‌బోర్డు మెడికల్ ఆఫీసరుగా నుండెను. ఆయన చెప్పిన దేమంటే §'ఒక్కసారిగనుక టీకాలువేసుకొన్నారా, మశూచికపు రోగులదగ్గిరకు పోయినాసరే, వారితో సంగమము చేసినాసరే, యేమీ మశూచికము అంటుకోదు. అట్టివారికి మశూచికపుచీము అంటుకొన్నాసరే వారి దేహములోకి మశూచికపుచీము సూదితో యెక్కించినాసరే వారికి మశూచికము రాదు' అని.

ఈసంగతి యిప్పుడు మాబోంట్లు మాత్రమే గాక వైద్యులలోగూడా యెవరూనమ్మరు.

ఇలాచెప్పి టీకాల రసాన్ని నిర్బంధముగా ఇంగ్లీషువారి దేహాల్లోకి యెక్కించారు. 1871-72 సంllరములో వచ్చిన మశూచికపు యెత్తిపోతలవలన 3708 మంది ఇంగ్లీషువారు చనిపోయినారు.

## ౧౨ రాయలు కమీషన్ అంటే యేమిటి?

అందువలన టీకాలశక్తియందు వారి కపనమ్మకము కలుగుటచే ఆదేశములో గోల బైలుదేరినది. దానివలన పార్లమెంటువారు 29-5-1889 తారీఖున ఒక రాయల్ కమీషనును నియమించిరి. అప్పుడు రాణీగారు రాజ్యమేలుతున్నారు. ఆరాయల్ కమీషన్‌లో కమీషనరులు 15 మంది. 1 హార్శ్చల్ ప్రభువు, 2 సర్ జేమ్సుపెజెట్, 3 సర్ చార్లెస్ డాల్‌రింపెల్, 4 సర్ ఎడ్విన్ గాల్స్వర్త్రీ, 5 దగ్‌డేర్‌దొర, 6 ప్రొఫెసర్ యం. ఫోస్టర్, 7 మెడోస్‌వైట్, 8 సర్ గోయర్ హంటర్, 9 సర్ జోనాథన్ హట్చిన్సన్, 10 శామ్యూల్ వైట్‌బ్రెడ్‌దొర, 11 డాక్టరు కాలిన్స్, 12 ఆకిన్సన్ పిక్టన్‌దొర, 13 సర్ విలియం శావోరీ, 14 డాక్టరు బ్రిస్టో, 15 బ్రాడ్లా దొర.

ఇందులో 13, 14, 15 సంఖ్యలవారు రిపోర్టు తయారుకాకమునుపే మరణించిరి. అందువలన తూకంఫోరకు జె. యే. బ్రైటుదొరను వారికి బదులుగా 1891 యేప్రిల్ నెలలో నియమించిరి. వారు దేశములో తిరిగి విచారించి యీ క్రింది విషయములు తేల్చుటకు ఆజ్ఞాపింపబడిరి.

1. మశూచికమును టీకాలు తగ్గిస్తవా? మశూచికమువలన కలిగే మరణసంఖ్యను టీకాలుతగ్గించునా?

* No one can read Lord Lyttleton's speech in introducing the act of 1853, without being convinced that he had been instructed that it was a point on which the whole Medical profession had arrived at complete unanimity that 'Vaccination in infancy, was a protection against smallpox for life.'

(Hansbard's Parliamentary Debates 4-12-1853).

§ "Neither renewed vaccination, nor inoculation with smallpox, nor the closest contact and cohabitation with smallpox patients will occasion the vaccinated person to betray any remnant or susceptibility to infection." Papers relating to the History and Practice of vaccination published by Sir John Simon M. D. F. R. S. in 1857.

2. టీకాలువేయకుండానే మశూచికముయొక్క ప్రాబల్యమును తగ్గింపగల యితరవిధానములేవి? టీకాలకు బదులుగా అవలంబించుటకు ఆవిధానములను ఎంతవరకు నమ్మదగియున్నవి.

3 టీకాలవలన ఆపద లున్నవనే ప్రవాదము యెంతవరకునిజము? అట్లు కలిగేనష్టముయొక్క పరిమితి యెంత?

4. టీకాలవలన కలుగుతవనే ఆపదలను యెంత వరకు తగ్గింపవచ్చును, లేక ఆపివేయవచ్చును? అందుకు అవలంబింపవలసిన విధానములేమి? జంతువులనుండి టీకాలరసమును ప్రజలకు ఉపయోగించుటకుగాను తీసికొనవలసిన ప్రత్యేక జాగ్రత లేవి?

5. టీకాలువేయుటలో అవలంబింపవలసినకార్య విధానమునం దేమైన ఆమార్పులు అవసరమా? అవియేవి? టీకాలు వేయించుకోక అభ్యంతర పెట్టేవారిని ప్రాసిక్యూషన్ చేసి టీకాలువేయించుకునేటట్లుగా చేయటానికి టీకాలశాసనములో చేయవలసినమార్పులేవి?

**౧౩ రాయలు కమీషన్ చేసినపని యేమి?**

రాయల్ కమీషన్ 1896 సం॥ ఆగష్టునెలలో తమరిపోర్టును ప్రచురించిరి. అప్పటికి 13 గురు కమీషనర్లున్నారు. వారిలో మొదటి 7 గురు ఒకరిపోర్టును తయారుచేసిరి.

వారు యేమన్నారంటే:—

టీకాలు అందరూ వేయించుకోవలసిందేను. అయితే టీకాలవల్ల అపకారం జరుగుతుందని ఎవరికన్నా నమ్మకముఉంటే వారు మేజస్ట్రీటు దగ్గర అర్జీపెట్టుకొని టీకాలనుండి విడుదలపొందవచ్చు. అయితే "12 వ యేట నన్నా టీకాలు వేయించుకునే తీరాలి" అని.

8 సర్ గోయర్ హంటర్, 9 జోనాథన్ హట్చిన్సన్ అన్నారుగదా! "12 యేట టీకాలు వేయించుకునేతీరాలి అనేభాగం తప్ప మిగతా భాగానికి వప్పుకున్నాము" అని.

డాక్టరుకాలిన్సు, పిక్టన్ దొరా యిద్దరూ "టీకాలు యేవిధానఉండటానికీ వల్లకాదు. నిర్బంధించి టీకాలువేయటం అసలేకూడ" దని ఒకమైనారిటీ రిపోర్టును తయారుచేశారు. (అది డిమ్మిక్రౌను సైజు 106 పేజీలగ్రంథము. ఒక షిల్లింగుఖరీదు. కావలెనన్న వారికి తెప్పించియిస్తాము).

శామ్యూల్ వైట్ బ్రెడ్, జె. ఏ. బ్రైట్ దొర లిద్దరూ నిర్బంధము విషయమున మైనారిటి రిపోర్టువారితోను, మిగతావిషయాలలో మెజారిటీ రిపోర్టుతోనూ కలిశారు.

మెజారిటీ రిపోర్టువారు తయారుచేసిన రిపోర్టులో 141 పేజీలున్నవి. 537 పారగ్రాఫులున్నవి. వారేమన్నారంటే:—

1. మశూచికము రాదగిన స్వభావాన్ని టీకాలు తగ్గిస్తవి. 2. మశూచికమువలన కలిగే మరణ సంఖ్యను టీకాలు తగ్గిస్తవి. 3. మశూచికము యొక్క తీవ్రతను తగ్గిస్తవి. టీకాలలోవుండే మశూచికరోగాన్ని రాకుండాచేసేసత్తా తొందరలోనేపోతుంది, కాని యితరసత్తాలు చాలాకాలం నిలచివుంటవి. అయినా అప్పుడప్పుడు టీకాలు తిరిగితిరిగి వేయాలి. వేసేటప్పుడు ½చదరపుఅంగుళముగల 4 బొడిలుచేసి వాటిలో టీకాలరసం వేయాలి అని.

☛ చూచారా 1853 సం॥రంలో టీకాలు ఒకసారి వేస్తేనే చాలు ననుకున్నారు. 1896సం॥రమునాటికే ఆసేటుమెంటు రద్దయిపోయింది!

ఇక రెండో ప్రశ్న:—

టీకాలకు బదులుగా మశూచికాన్ని హత మార్చేవిధానము యేదన్నా ఉంటే చెప్పవలెనని. దానికి వారు యేమి వ్రాశారంటే:—
మశూచికము వచ్చినవారిని మశూచికము రాని వారినుండి 'వేరుపరుచుట' ద్వారా మశూచికాన్ని ఆపవచ్చును. అయితే టీకాలు సాంతం గామానివేసి వేరుపరుచుట మాత్రమే మశూచికాన్ని ఆపవచ్చునని మేమునమ్మజాలకున్నాము. టీకాలువేస్తూ 'వేరుపరచుట' గూడా అవలంబిస్తే మశూచికము అంతరించితీరుతుందని దీనిని గురించి 451 మొదలు 508 వ పారగ్రాఫువరకు వ్రాశారు. అసలు యీ'వేరుపరచుట' అనేవిధానాన్ని మైనారిటీ రిపోర్టు తయారు చేసినవారే గుర్తించి చెప్పిరి.

టీకాలవల్ల యేమన్నా అపకారము జరుగుతుందా? అనే మూడవప్రశ్నకు వారువ్రాశిం దిది:—

"Although some of the dangers said to attend vaccination are undoubtedly real and not inconsiderable in gross amount yet when considered in relation to the extent of vaccination work done, they are insignificant." దానికి అర్థము ఇది:—
టీకాలవల్ల వస్తవనే అపాయములు తప్పకుండా వస్తవి. అవికాస్తాకూస్తాకాదు, బాగానే వస్తవి. ఐనప్పటికి టీకాలవల్ల జరిగేమేలు చూచినప్పుడు మాత్రం యీ ఆపదలు చాలాస్వల్పము. విసర్పి, రక్తవిషీకరణము, కర్ప్రాణిమొదలగు చర్మవ్యాధులూకలుగుతవని వారువప్పుకొన్నారు. టీకాలవలన నవాయివస్తుందనే సంగతిగూడా వారు నమ్మినారు. కాని ఆవుదూడలనుంచి టీకాలరసము తయారుచేస్తే అదిపోతుందన్నారు. అట్టి టీకాలరసము లభింపనప్పుడు పిల్లలనుటీకాలు వేయటానికి హాజరుపెట్టటానికి నిర్బంధింపగూడదన్నారు.



అయిదవవిషయం

టీకాల శాసనములో యేమి మార్పులు చేస్తే టీకాలువద్దనే వారిని బాగా నిర్బంధించి టీకాలు వేయటానికి వీలవుతుం దనేది.

దానినిగురించి యిలా వ్రాశారు:—

'టీకాలు వేయించనంత మాత్రముచేత వారిని క్రిమినల్సు (అనగా దొంగతనము హత్య మొదలైన నేరాలు చేసినవారు)గా భావించటానికి వీలులేదు. జెయిలుశిక్షయిదు వేయగూడదు. ఒకసారికన్న అపరాధము విధింపగూడదు. ఎవరినీ నిర్బంధించకుండా టీకాల శాసనములో మార్పు చేస్తేనే యెక్కువమంది టీకాలు వేయించుకుంటారు. అయితే అజాగ్రతవల్లా, అశ్రద్ధవల్లా, మూర్ఖతవల్లా టీకాలు వేయించుకోని వారికిమాత్రమే వత్తిడి ఉండాలి. న్యాయముగా టీకాలనుగురించి విశ్వాసములేనివారికి విడుదల ఉండాలి'అని.

1898 సం॥రములో మార్చిన టీకాల శాసనములో యీ క్రిందిమార్పులు చేశారు.

(1) ఒకపిల్లను టీకాలువేయించుటకు హాజరుపెట్టవలసిందని కోరినప్పుడు, హాజరుపెట్టలేదు. ఆబిడ్డను గురించి ఒక్కసారియే అపరాధము విధించాలి; మిగిలిన సారులు అపరాధము విధించటానికి వీలులేదు.

(2) ఒకబిడ్డపుట్టిన నాలుగవమాసములోపల ఆ బిడ్డ తల్లిదండ్రులుగాని, గార్డియనుగాని టీకాలు వేయుటవలన తనబిడ్డ ఆరోగ్యము చెడిపోతుందని మేజస్ట్రేటు హోదాకు సరియైన ఉద్యోగస్తులయెదుట తెలియబరచి ఒక సర్టిఫికెట్టు పొందినయెడల, ఆబిడ్డను టీకాలువేయుటకొరకు హాజరుపెట్టకపోతే అది నేరముకాదు.

### ౧౪ విశ్వాసపు క్లాజు

శాసనము అయితే చేశారుగాని టీకాల నిర్బంధము సాగుతూనే వచ్చింది. మేజస్ట్రీటు దగ్గిరకి పోతే వాళ్లు కొట్టి సాగనంపేవాళ్లు. సర్టిఫికెట్టు నిరాకరించేవాళ్లు.

అందువల్ల 15-2-1907 తేదీన యీ సంగతిని గురించి పార్లమెంటులో చర్చజరిగింది. చాలా తర్జనభర్జన జరిగింది. చివరకు మేజస్ట్రీటువద్దకు వచ్చి స్టేటుమెంటు యిచ్చినవారికల్లా సర్టిఫికెట్టు యిచ్చేటట్టున్నూ, వారిబిడ్డలకు టీకాలనిర్బంధము లేకుండావుండేటట్టున్నూ తీర్మానము జరిగింది. దీనికే 'విశ్వాసపుక్లాజు' (Conscience clause) అని పేరు.

### ౧౫ విశ్వాసపుక్లాజువల్ల యేమి జరిగిందీ?

1853 సంవత్సరపు నిర్బంధశాసనపు బాధవల్ల 1877 సం॥రం నాటికి ఇంగ్లాండులో 766,824 మంది టీకాలు వేయించుకున్నారు. 1907 సం॥రము టీకాల శాసనములో చొప్పించిన 'విశ్వాసపుక్లాజు'వల్ల టీకాలు వేయించుకోకుండా మానుకొనుటకు హక్కు యేర్పడింది. అందువల్ల క్రమంగా టీకాలు వేయించుకోవటంతగ్గించారు. 1925 సం॥రములో 314,325 మందికి మాత్రమే టీకాలు వేశారు. అంటే ఇంగ్లాండులో పుట్టిన పిల్లలలో సగం మందిగూడా వేయించుకోలేదు.

### ౧౬ టీకాలు తగ్గితే మశూచికం పెరిగిందా?

టీకాలు తగ్గినకొద్దీ మశూచికము పెరిగిపోవలసిందేనా? అట్లా పెరుగలేదు. మశూచికము తగిలే రోగుల సంఖ్యా తగ్గింది. మశూచికపు మరణాల సంఖ్యా తగ్గింది. మశూచికం రావటములో ఉండే తీవ్రతా తగ్గే వచ్చింది.

1926 సంవత్సరములో ఇంగ్లాండులో ఆరోగ్య శాఖవారు ఒక డిపార్టుమెంటల్ కమిటీని *(C. M. D. 3148) ఆపాయంటుచేశారు. వారు తెలియజేసిం దేమంటే:—

1900-4 సం॥రాల లండనులో పుట్టిన బిడ్డలలో నూటికి 75 మందికి టీకాలువేసేవారు. ఆ 4 సం॥రాలలో ఒక్క లండను ఆసుపత్రిలలోకి చేర్చుకున్న మశూచికపు రోగులసంఖ్య 10,463. అందులో 1668 మరణించిరి. అనగా నూటికి 16 మంది. 1921 సం॥రములో దేశములో పుట్టినబిడ్డలలో నూటికి 38.3 మందికి మాత్రమే టీకాలువేశారు. ఆ సం॥రములో యింగ్లాండు దేశమంతటిలోను మశూచికము వచ్చినవారు 336. చనిపోయినవారు 5 గురు అనగా రోగము వచ్చినవారిలో నూటికి 1½ మంది.

ఇంగ్లాండు, వేల్సుదేశాలలో 1923-26 సం॥త్సరాలలో 21796 మందికి మశూచికము తగిలింది. అందులో మరణించినవారు 47 మంది. అయితే 1922 సం॥రం నవంబరూ 1927 సం॥రం సెప్టెంబరూ మధ్య టీకాలు వేయుటవలన కలిగే నాడీవ్యాధులున్నూ, వాక్సీనియా అనేరోగమున్నూ కలసి 51 మంది మరణించిరి.

1935 సం॥రములో టీకాలువేయని బిడ్డలు నూటికి 66 మంది ఆ సం॥రములో ఒక్కరికి మశూచికము రాలేదు.

### ౧౭ టీకాలువేసే దేశాలు, వేయనిదేశాలు

ఆస్ట్రేలియా, ఇంగ్లాండు దేశాలలో టీకాలు వేయుటంతక్కువ. ఈసంగతియిదివరకే వ్రాశాను. జపానులోను, ఇటలీలోను టీకాలు నిర్బంధ

* (Report C. M. D. 3148, page 39)

ముగా వేయుటమే కాకుండా, రెండోసారి గూడా టీకాలునిర్బంధముగానే వేస్తారు.

1900-1928 సంవత్సరాలమధ్య సంవత్సరానికి మశూచికమువలన సగటున చనిపోయిన వారి సంఖ్య యిట్లున్నది. ఇంగ్లాండు జనసంఖ్య 36, 000, 000 చనిపోయినవారు 161. ఇటలీ 35, 000, 000 ,, 2015. ఇటలీలో 1919-20 సంవత్సరాలలో 27,417 మంది మరణించిరి. పోర్చుగల్ దేశములో 1477 మంది మరణించిరి. ఆదేశములోగూడ ఒకటికి రెండు సార్లు నిర్బంధించి టీకాలువేస్తారు.

జపాను దేశములో గూడా యిదే ఆచారము. ఆదేశములో మశూచికము వస్తూనేఉంది. జనులు దానివలన మరణిస్తూనేఉన్నారు. 1917-24 సంవత్సరాలలో 19006 మందికి మశూచికమువచ్చి అందులో 4380 మంది మరణించారు. అదేకాలములో యింగ్లాండులో 110 మంది మాత్రమే మరణించారు. టీకాలు బాగావేసే జర్మనీలో 1691 మరణించారు. ఆస్ట్రేలియాలో నూటికి ఒక్కడికిమాత్రమే టీకాలు వేస్తారు. అక్కడ ఒక్కడికిగూడా మశూచికము రావటంలేదు.

**౧౮ టీకాలవల్ల యేమినష్టముంది?**

టీకాలు వేయటంవల్ల వాక్సినియా అనేరోగము వచ్చి మనుష్యులు చనిపోవుచున్నట్లు పార్లమెంటులో గూ్రివ్సుదొరప్రశ్నకు జవాబుగా చేంబర్లేన్‌దొర 11-12-25 తేదీన వప్పుకొన్నాడు. 1924 సంవత్సరములో 4 గురు టీకాలవలన మరణించిరి.

1925 సంవత్సరములో 9 మంది టీకాలవలన మరణించినట్లును, 1926 లో ఒకరు టీకాలవలన మరణించినట్లును చేంబర్లేన్‌గారే గూ్రివ్సుదొరకు పార్లమెంటులో 24-2-1927 తేదీన తెలియపరచెను.

1896 సంవత్సరములో వెలువడిన రాయల్‌కమీషన్‌వారి రిపోర్టునుబట్టి చూచినా, క్షయ, కుష్టు, రాచపుండు, సవాయి మొదలగు వ్యాధులు టీకాలవలన కలుగుచున్నట్లు తెలియుచున్నది. మనదేశంలో యెవరు యేరోగముచేత చనిపోయినా, ఖాయిలా, జ్వరము, ఆత్మరోగమూ అనే మాటలే కనబడతాయిగాని యెవరు నిజంగా యేరోగంచేత చనిపోయినారో సరియైన లెక్కలు వ్రాయగలవారూలేరు. వ్రాయించటానికి ప్రయత్నించేవారూలేరు. గనుక, యెంతమంది టీకాలు వేయటంచేత వచ్చేరోగాలచేత చనిపోతున్నారో లెక్కలవల్ల యేమీ తేలదు. అదీగాక యెంతలావు విద్యావంతుడైనా యెంతనాగరికతగలవాడైనా మగవాండ్లు పిల్లల చావుబ్రతుకులనుగురించి కనుక్కోరీపాడు దేశములో. అందువల్ల కాకపోతే టీకాలువేసిన 1, 2 నెలలలోనే కర్పాణి, చీడ, జ్వరమూ, అజీర్ణము, పాండువ్వూ, లివరూ అయి యెంతోమంది పిల్లలు సంవత్సరం సంవత్సరమూ చనిపోతూఉంటే అది తమకర్మ అనుకొని తృప్తిపడి గుడ్లనీరు గుడ్లకుక్కుకునే మాతా, పితలీదేశములో యెందుకుంటారూ?

లండన్ హాస్పిటలు వైద్యులైన డాక్టరు హ్యూబర్టుయం.టర్న్‌బుల్ యం.డి. గారుతామున్వాయముగా ఇంగ్లీషు వైద్యులైనను, టీకాలవలన మశూచికము ఆగదనియు టీకాలవలన నెట్టి ప్రమాదములును జరుగవని నమ్మవలసిన వారయ్యును టీకాలువేయుటవలన ఎన్‌సిఫెలో మైఎలిటిస్ (Encephalo myeletis) అనేరోగము కలుగుచున్నదనియు 1912 సంవత్సరములో నేకనిపెట్టిరి. ఎన్‌సిఫెలోమై ఎలిటిస్ అనగా ప్రధాన నాడులకు సంబంధించిన తరుణవ్యాధి.

లండన్ విశ్వకళాపరిషత్తులో ప్రొఫెసరుగానున్న ప్రొఫెసరు జేమ్సు మెకిన్‌టోష్‌గారు 1922 సంవత్సరములో టీకాలవలన యీ ఎన్‌సిఫెలోమైఎలిటిస్ అనేరోగము గలిగినవారిని నలుగురిని గుర్తించిరి.

టీకాలు వేసినతోడనే యీ వ్యాధి కలిగినవారి శవములయొక్క మెదడునుకోసి పరీక్షించి వారికీవ్యాధి టీకాలవలననే కలిగినదనియు, వారి మృతికి టీకాలే కారణమనియు నిర్ణయించిరి.

అందువలన వారీసంగతిని ఇంగ్లాండులోని ఆరోగ్యశాఖమంత్రి కెరుకపరిచిరి.

పార్లమెంటువారు 1923 సంవత్సరము నవంబరు నెలలో ఆండ్ర్యూసుకమిటీని నియమించి విచారింపవలసినదని చెప్పిరి. వారు విచారించి తేల్చిన రిపోర్టు 1925 సంవత్సరము మే నెలలో వెలువడినది. తరువాత పార్లమెంటువారు 1926 సంవత్సరము ఫిబ్రివరి నెలలో రోలెస్టన్ కమిటీని నియమించి విచారింపవలసినదని ఆజ్ఞాపించిరి. వారు విచారించి 1928 సంవత్సరము ఫిబ్రివరి నెలలో తమ రిపోర్టును వెలువరించిరి. రెండు రిపోర్టులును 1928 సం॥ జులై నెలలో ప్రకటింపబడినవి.

1926 సం॥ ఆగష్టు నెలలో మెకిన్‌టోష్‌గారును, టర్న్‌బుల్‌గారును కలిసి ఎన్‌సిఫెలోమైఎలిటిస్ అనే రోగముకలగి మరణించినవారి వృత్తాంతములనే ఏడింటిని విపులముగా వర్ణించిరి. టీకాలవలన కలిగినవేనని వారు నిర్దేశించిరి. ఆ విషయము 4-9-26 తేదీగల లాన్‌సెట్‌పత్రికలో ప్రచురింపబడినది. ఇదేవిషయము బ్రిటిష్ జర్నల్ ఆఫ్ ఎక్స్‌పెరిమెంటల్ పేథాలజి అనే పత్రికలో ప్రచురింపబడినది.

ఆండ్ర్యూసు కమిటీవారు దేశములోతిరిగి టీకాలవలన ఎన్‌సిఫెలిటిస్ రోగముగలిగినవారిని 62రిని గురించి బాగా విచారించిరి. అందులో 36 గురు మరణించిరి. 62 లోను 40 స్త్రీలు, 22 రు పురుషులు. వారివయస్సు. 4 గురు సంవత్సరములోపు వయస్సువారు. ఒకరికి 50 సంవత్సరములు. 40 మంది 4 మొదలు 16 సంవత్సరములమధ్య వయస్సుకలవారు. ఇందులో 53 రకు గవర్నమెంటువారిచే తయారుచేయింపబడిన టీకాలరసమును వాడిరి. అందులో మరణించినవారి సంఖ్య 30. రోలెస్టన్ కమిటీవారుగూడ విచారించి టీకాలు వేయుటవలన ఎన్‌సిఫెలోమైఎలిటిస్ కలిగి: వారిని 30 మందిని గుర్తించిరి. అందులో 16 మంది మరణించిరి. ఇందులో ప్రభుత్వమువారి టీకాలరసము వాడినవారు 18 మంది. అందులోనూ 8 మంది మరణించిరి. ఇతరవిధముల టీకాలరసము వాడినవారిలో ఏడుగురికి ఈవ్యాధి కలిగినది. అందులో 4 గురు మరణించిరి. టీకాలరసము ఎక్కడినుంచి వచ్చినదో తెలియని కేసులు 5. అందులో 4 గురు మరణించిరి.

27-8-28 తేదీగల నానాజాతిసమితి వారి రిపోర్టు ప్రకారము హాలెండు దేశములో టీకాలు వేయుట వలన ఎన్‌సిఫెలోమైఎలిటిస్ వ్యాధివచ్చినవారు 139 మంది. అందులో 41 మంది మరణించిరి. ఈ సంగతి తెలిసిన తరువాత డచ్చిప్రభుత్వము వారు 1928 సంవత్సరముయొక్క చివరభాగములో టీకాలయొక్క నిర్బంధమును తీసివేసిరి. అందువలన టీకాలు వేయించుకొను వారిసంఖ్య సగానికి సగము తగ్గినది, ఎన్‌సిఫెలోమైఎలిటిస్ వలన మరణించువారి సంఖ్యయును అంతకు పూర్వపు సంఖ్యలో 1/3అయినది. మొత్తము మూడుకమిటీలవారును రిపోర్టుచేసిన ఎన్‌సిఫెలోమై ఎలిటిస్ కేసులు 231. అందులో 93 గురు దానివలననే మరణించిరి. రోలెస్టన్ కమిటీవారి రిపోర్టు ప్రకారము బ్రతికియున్న

వారుగూడ సరియైన స్థితిలో లేరనియు అందులో నూటికి 40 మంది మానసికముగా చాల నీచ దశలో నున్నారనియు వారు జీవించియుండుట కన్న మరణించుటయే మేలుగా నుండెడిదనియు పేర్కొనియున్నారు.

లండన్ హాస్పిటల్‌లో వైద్యులగు ప్రొఫెసర్ హ్యూబర్టు యం. టర్నుబుల్ అను వారును, లండన్ విశ్వవిద్యాలయమున పండితులునుమిడిల్ సెక్సు హాస్పిటలులో వైద్యులును అగు ప్రొఫెసర్ జేమ్సు మెక్ ఇన్ టోష్‌గారును, టీకాలు వేసినంతనే కొందరు (Encephalo Myeletis) అను మెదడుసంబంధమగు దుర్భరవ్యాధిచే మరణించినట్లు గుర్తించిరి. తరువాత శవపరీక్షచేసియు ఇతర విధముల పరిశోధించియు టీకాలే ఆదుర్భర వ్యాధి గలుగుటకు కారణమని నిరూపించిరి. అట్లు మరణించినవారి మెదడునందు టీకా రసము శవపరీక్షయందు వారు గుర్తించిరి. 1912 సం॥ మున ప్రొఫెసరు టర్నుబుల్ యిట్టి కేసు నొక దానిని గుర్తుపట్టెను. 1922 సంవత్సరములో యిట్టివి యింకను నాలుగు కేసులు కనిపెట్టబడెను. 1922 సంవత్సరమున వారీ సంగతులను బ్రిటీషు పార్లమెంటులోని ఆరోగ్య శాఖామంత్రి కెరుకపరచిరి.

బ్రిటిష్ పార్లమెంటు యీ సంగతులను సంపూర్ణముగా విచారించి ఒక నివేదికను తయారు చేయవలసినదని 1923 సం॥ నవంబరునెలలో ఆండ్రూసుకమిటీని యేర్పాటుచేసిరి. 1925 సం॥ మేనెలలో వారి నివేదిక పూర్తియైనది. దాని మీద పార్లమెంటువారు 1926 సం॥ 4వ ఫిబ్రవరి తారీఖున రోలెస్టన్ కమిటీని యేర్పాటుచేసి పై సంగతులనే తిరిగి విచారించవలసినదిగా ఆజ్ఞాపించిరి. వారిద్దరి రిపోర్టులు 1928 సంవత్సరము జులై నెలలో బహిరంగపరచబడినవి. ఈ కమిటీల లోనిసభ్యులందరును ఆల్లోపతి(ఇంగ్లీషు) వైద్యమునందు పరిపూర్ణమైన పాండిత్యము కలవారే; వారందరును టీకాలవలన మశూచికముజయింపబడుననే విద్యనే అభ్యసించి అదే నమ్మకముగల వారు, టీకాలవలన యెట్టి అపకారమును గలుగదనే నమ్మికయు గలవారేను; ఏమాత్రము సావకాశమున్నను టీకాల నిందించుటకు యిష్టపడనివారే; అయినప్పటికిని వారి పరిశోధనా ఫలితము అన్యథా తేలినది.

ప్రొఫెసర్ మెక్ ఇన్ టోష్ ఆండ్రూసు కమిటీలో సభ్యుడు, 1926 సంవత్సరములో మెక్ ఇన్ టోష్ గారును టర్నుబుల్‌గారును కలసి టీకాలు వేసిన తరువాత ఎన్‌సిఫెలో మైలెటిస్ (Ehcephalo Myeletis) అను వ్యాధి గలిగి మరణించినవారి వృత్తాంతములు యేడింటిని సంపూర్ణ వివరములతో ప్రచురించిరి.

ఆ వృత్తాంతములు British Journal of Experimental Pathologyఅనుఇంగ్లీషువైద్య పత్రికలో నివేదింపబడినవి. అవే వృత్తాంతములు Lancet అను పేరుగల వైద్యపత్రికలో 1926 సంవత్సరము 4 సెప్టెంబరు సంచికలో యెత్తి వ్రాయబడినవి. 1928 సంవత్సరం 15 సెప్టెంబరు తారీఖున వెలువడిన Lancet పత్రికయందు డాక్టరు ఎ.ఇ.రస్సెల్ యం. డి.బి. యస్., ఎఫ్. ఆర్. సి. పి (లండన్) సీనియర్ వైద్యుడు సెంటుథామ్ హాస్పిటల్ గారును ఆ. ఒడ్డీ. బి. ఎం., బి., సి. ఎచ్ (అక్షన్) గారును టీకాలు వేసినతరువాత ఒకరికి ఎన్‌సిఫెలో మైలెటిస్ అను వ్యాధి కలిగి మరణించినట్లు వ్రాసియున్నారు. ఇంకను కొన్ని కేసులు గుర్తించినట్లును వారు వ్రాసియున్నారు.

తాము టీకాలు మంచి వని చెప్పవలసినవారయ్యును టీకాలవలన అపకారము కలుగుచున్న

దని గుర్తించి వెల్లడించిన పీరిద్దైర్యమునకు ఔదార్యమునకును మనము వారి నభినందింప వలసి యున్నది.

ఆండూౄస్ కమిటీవారు దాదాపు 10,11 యేండ్ల వయస్సుగలిగిన 40 మంది ఆడువాండ్రను, 22 మంది మగవాండ్రను యీ వ్యాధికలిగినవారిని గుర్తించిరి. వారి కందరికి టీకాలు వేయుటవలన టీకాలు వేసినంతనే యీ వ్యాధిగలిగినది. అందు 36 గురు మరణించిరి. ఇందులో 53 గురకు గవర్నమెంటువారు సప్లయిచేసిన టీకారసమును వాడిరి. అందువలనమరణించినవారు 30 మంది. రోలెస్టన్ కమిటీ ఇట్టి కేసులను 30 టిని నివేదించిరి. అందు ప్రభుత్వమువారి టీకాలరసము 18 మందికివాడిరి. అందు 8 మంది మరణించిరి. ఇతరరకపు రసము 7 గురికి వాడిరి. అందు 4 గురు మరణించిరి. 5 గురికి వాడిన టీకాలరసము యెక్కడిదో యెవరికీ తెలియదు. అందువలన మరణించినవారు 4 గురు.

1928 సంవత్సరములో ఆగష్టు 27 తేదీన నానా జాతి సమితి (League of Nations) నకు డచ్చి ప్రభుత్వమువారు హాలెండులో 139యిట్టి కేసులను రిపోర్టుచేసిరి. అందువలన 41 మంది మరణించినట్లు నివేదించిరి. అందువలన డచ్చి ప్రభుత్వమువారు 1928 సంవత్సరమునకు టీకాల నిర్బంధమును తొలగించిరి. 1927 కన్న 1928 సంవత్సరములో టీకాలు వేయించుకొన్న వారి సంఖ్యయు మూడింట ఒక్కపాలు ఎన్సిఫెలిటిస్ వలన గలిగిన మరణముల సంఖ్యయును మూడింట ఒక్కపాలుగానే యుండెను.

మొత్తము లెక్కవేయగా ఇంగ్లాండు హాలెండు దేశములలో ప్రభుత్వమువారి వైద్యుల ప్రతినిధులచే టీకాలవలన ఎన్సిఫెలిటిస్ అను వ్యాధి గలిగినట్లు ఒప్పుకొనబడిన సంఖ్య 231. ఇందు 93 గురు మరణించిరి. ఇది చాల పెద్దసంఖ్య. దీనితరువాత రోలెస్టన్ కమిటీవారు యిట్టి కేసులను 10 ని రిపోర్టుచేసిరి. అట్టివారివయస్సు 15 సంవత్సరములకు లోపుగా నుండెను. అందు నలుగురికి బుద్ధి, జ్ఞాపకశక్తి, బలము మొదలగువాని యందు శాశ్వతమగు దౌర్బల్య మేర్పడినది. కనుక మరణింపక మిగిలినవారైనను చాల పనికిమాలినవారగుదురు. అందు నూటికి నలుబది మంది జీవించుటకన్నను మరణమే కోరదగినంతగా అశక్తులైయున్నారు.

ఇప్పటికిని ఎన్సిఫెలిటిస్, సవాయి, కంఠమాల, ఏనుగగజ్జి మొదలగువానిలో యెంతమందికి టీకాలుకారణమో ప్రభుత్వమువారు తమవైద్యులను గుర్తింపవలయునని ఆజ్ఞాపింపలేదు.

## ఇంగ్లాండులో 10 లక్షల శిశువులు యిట్టివ్యాధిచే మరణించిరి.

ఇంగ్లండులో టీకాలునిర్బంధము చేసిననాటినుండి 1,000,000 బిడ్డలు ఎన్సిఫెలిటిస్, చిన్నబిడ్డ గుణము, వెన్నుపాముజ్వరము, అంకిలికలసికొని పోవుట మొదలగు వ్యాధులచే మరణించిరి. ఇందులో యెంతమంది చావునకు టీకాలు కారణమో యెవరు చెప్పగలరు! ఇప్పుడుగదా టీకాలవలన యిట్టివ్యాధులు రావచ్చునని వారు ఒప్పుకొన్నది!!

టీకాలవలన ఇట్లుమరణించినవారిసంఖ్యకు రెట్టింపు సంఖ్య వికలేంద్రియులు, అశక్తులునుందురు. 1924సంవత్సరమునఇంగ్లాండు, వేల్సు దేశములలో

5039 మంది ఎన్సిఫెలిటిస్ లెతార్జికా వలనను
397 మందిమెదడు వెన్నుపాము జ్వరమువలనను
777 తరుణమగు పోలియో మైలెటిస్ వలనను
83 మంది పోలియో ఎన్సిఫెలిటిస్ వలనను
6296 మొత్తంమందికిఇట్టిమెదడునాడీమండలము

లకు సంబంధించిన వ్యాధులు గలిగినట్లు ప్రభుత్వమువారి ఆరోగ్యశాఖాధికారుల ప్రచురణము లందు గలదు. అందు 2200 మంది మరణించిరి. పూర్తిగా రోగనివారణమైనవారు 1575 మంది. ఉన్మాదము మొదలగువ్యాధులచే బొత్తిగా చెడిపోయినవారు 2520.

తొమ్మిది సంవత్సరముల దామాయిషాకు యీ సంఖ్య మూడురెట్లుగా నున్నది. 1922-23 సంవత్సరములలో 2,88,000 మందికి రీవాక్సినేషన్ అనగా రెండవతూరి టీకాలు వేసిరి. పై అంకెలకు యీ రీవాక్సినేషన్ కారణమేమో యెవరికి తెలియును ? ఎట్లైనను టీకాలువేయుట యెక్కువైన కొలదిని మతిమాలినవారిసంఖ్య పెరుగుచున్నది. అందూరిను కమిటీవారు తమవిచారణకు వచ్చిన సాక్ష్యము దోషరహితముగా లేదనియు యింకను జాగ్రత్తగా విచారింపవలయుననియు, జంతువులమీద యింకను పరిశోధనలు చేయవలయుననియు అభిప్రాయ మిచ్చిరి.

పరిశోధనావస్థయందున్న దీనినే ప్రభుత్వము మననెత్తిని రుద్దుచున్నది. ఒకతూరిగాదు; రెండు తూరులు!! ఐచ్ఛికముగాగాదు; బలవంతముగా!!! రోలెస్టన్ కమిటీరిపోర్టు 200 పేజీలో

"The occurance of Post - Vaccinal Nervous disease, however seldom it may occur, is of serious import and cannot fail to have an effect on vaccination both on its administrative and its purely medical aspect."

అనగా టీకాలవలన నాడీవ్యాధి అరుదుగాగలుగుచున్నది. ఇది యెంత అరుదుగ గలుగుచుండినను టీకాలు వేయు వైద్యవిధానమునందో టీకాలు వేయువారియందో, లోపములుగలవని తెలుపుచున్నది. ఇది చాల ప్రమాదకరమైన విషయము అని వ్రాసియున్నది.

### కమిటీవారి సలహా

ఇదివరకు 4 పెద్ద పుండ్లుచేసి అందులో టీకారసము వేయుచుండిరి. ఇప్పుడు 1 పుండే చేయవలసినది. అదియును చాల చిన్నదిగా నుండవలయును. అందులో వేయు టీకారసము యిప్పటికన్న చాలపలుచనిదిగా నుండవలెను.

ఇదియును పరిశోధనకొరకే. ఇంకను జంతువుల మీదగూడ యిట్టి పరిశోధనలే చేయవలసినది. బిడ్డపుట్టిన సంవత్సరములో వేసినటీకాలకు తరువాత, 5, 6 సంవత్సరములప్పుడు ఒకతూరియు 14, 16 సంవత్సరములమధ్య ఒకతూరియు టీకాలు వేయించుకొనవలెను.

### అనగా వారి టీకారసముమీద వారికే నమ్మకము లేదు.

ఇదిగాక ఆరోగ్యశాఖా మంత్రికి అవసరమని తోచినచో ఒక పట్టణములోగాని తాలూకాలో గాని జిల్లాలోగాని, యెప్పుడుపడితే అప్పుడు అందరికి టీకాలువేయవలెను.

### నిర్బంధమునకు అర్థము లేదు.

ఎన్నిటీకాపుండ్లు చేయవలెనో, అవి యెంత చిన్నవిగా నుండవలెనో; అందులో వేయవలసిన టీకారసము యెంతచిక్కగా నుండవలెనో, అవి యెంతపరిమితి గలవి వేయవలెనో యీ 130 సంవత్సరములలోను తేలలేదు ఇప్పటికింకాజంతువులమీదను,బిడ్డలమీదనుపరిశోధనలుచేయుటకే కమిటీ సలహాయిచ్చుచున్నది. దీనివలన గలుగుచున్నవని తేలిన వ్యాధులసంఖ్యయు రోగుల సంఖ్యయు, నష్టేంద్రియులయొక్క సంఖ్యయు, మృతులయొక్కసంఖ్యయు దుర్భరముగానున్నది. ఇంత అజ్ఞానదశలో నున్న శాస్త్రముయొక్క ప్రయోగము ఐచ్ఛికమా? కాదే! బలవంతము

మీద! జరిమానాలువేసి! శిక్షలువేసి! పాపము శాంతించుగాక!!

**౩౦ టీకాలువేయుటం న్యాయముకాదా?**

1. అసలు యెవరికన్నా ఒక రోగము వచ్చినపుడు దానికిమందు పుచ్చుకోవటమో మానటమో యెవరికి వారే నిర్ణయించుకుంటారు. తలకాయ నొప్పికి మందురాచుకోవాలో అక్కరలేదో ఎవరికి వారే నిర్ణయించుకోవటము ధర్మము.

2. ఆ రాచుకునేమందుగూడా యెవరికి యిష్టమైంది వారు రాచుకోవడమనేది యింకోధర్మం. అమృతాంజనమో, యూకలిప్టస్ ఆయిలో, కుంకుడిపిప్పో, శాంతిగంధమో.

3. టీకాలు అనేది ఒకరోగమువచ్చినరోగికి వేసేదన్నా కాదు. అప్పుడుగూడా వేయించుకొని తీరవలెననటం ఏనీతి చేతాగూడా ధర్మముకాదు. అట్లాంటప్పుడు

4. పోనీ ఒకరోగానికి ఆమందు వేస్తే నయమయ్యేదిగా వుండాలి. ఆమందునేవేసిన యెడల అపకారము చేయనిదిగావుండాలి. యిన్ని పరిస్థితులు యేర్పడితే ఆ మందు మంచిది. దానిని వాడితే యెట్టి అపకారమూ చేయదు. పైగాఫలాని ఫలాని వారికి వాడితే మేలుచేసింది అని తేల్చ గలిగినప్పుడు దానిని 'వాడుకోమని' చెప్పేటందుకు ఎవరైనా ధైర్యం అవలంబింపవచ్చును. మరీఆప్తులైతే ప్రోత్సాహంగూడా చేయవచ్చును. మరీమరి ఆప్తులైతే నిర్బంధింప వచ్చునేమో గూడా, తలకాయ నొప్పితో బాధపడేవాడై చాలాచిన్నవాడై, శాంతి గంధం రాచేవాడు బాగా తెలివిగల గార్డియన్ అయితే.

5. అసలు ఒకమనిషికి, కుర్రవాడికి మశూచికము వస్తుందోలేదో ఎవరికీ తెలియదు. సామాన్యంగా రాకనే పోవచ్చు. వచ్చినాగూడా జాగ్రత్తగా ఉపచారంచేస్తే ఎన్నో దేహములో దాగివున్న రోగాలు లేకుండాపోతై.

అలాంటి రోగమురాకుండా ఆపేటందుకు వాడే మందు ఏమిటయ్యా—

1 ఆవుదూడకు బలవంతంగా మశూచికము తెప్పించి, దానిని నానాబాధలుపెట్టి దాని ఒంటిమీది మశూచికపు పొక్కులలోనుంచి తీసిన చీము.

2 అదివేస్తే, పోనీ, మశూచికము రాకుండా, మానకన్నా మానుతుందా అంటే అదీజరగటం లేదు. అనే సంగతి వెనకవ్రాసిన గ్రంథమంతా చదివినవారికి బోధపడుతునేఉంది.

3. టీకాలు వేసినందువల్ల అపకారమన్నా జరగకుండా వుంటుందా అంటే అదీలేదు. ప్రభుత్వము వారు అపాయింటుచేసిన రాయల్ కమీషన్ వారు టీకాలవలన సవాయి, కుష్టు, క్షయ, రాచపుండు, వాక్సీనియా, ఎన్‌సిఫెలోమైఎలిటిస్ అనే దుర్భరవ్యాధులు వస్తవని నిర్ధారణచేశారు. ఆ రాయల్‌కమిషన్‌లోనూ, ఆండూస్, రోలెస్టన్ కమిటీలలోనూ పనిచేసిన కమీషనరులు ఎటువంటివాళ్లో తెలుసా?

1. పెద్దడాక్టరులు.

2. టీకాలవల్లనే మశూచికముపోతుందని తాము చదివేచదువు వల్లా నమ్మేనమ్మకాలవల్లా రూఢి అయిన చిత్తసంస్కారము గలవారు.

అట్టివారే టీకాలవల్ల రోగాలు—అవీ సామాన్యమైనవా: క్షయాది దుర్భరవ్యాధులు—వస్తవని చెప్పుతుంటే—

ఆమందు పుచ్చుకోమనిబాధ్యతగలవారుయెవరూ చెప్పగూడదు.

ప్రోత్సాహించటం పనికేరాదు.

నిర్బంధించటం అసలు ద్రోహము.

ఊరికే నిర్బంధించటమూ, జరిమానాలు శిక్షలు వేసి. ఈ నిర్బంధము ఒకతూరా, కాదు రెండు తూరులు.

పోనీ వారిశాస్త్రముప్రకారమే ఒకగొట్టములోని టీకారసము మంచిదని యెవరైనా గారంటీ (అభయహస్తము) యిస్తారా అంటే ? రాజన్ మంత్రివద్దనుండి టీకాలు వేసే యినస్పెక్టరువరకూ యెవరూ బాధ్యత వహింపరు.

టీకాలు వేయటంలో వస్తవి చాలా ఆపదలంటారుగదా? ఎలావేస్తే ఆపదలురావో ఆలాగే వేస్తారు, ఫలాని వాక్సినేటరుఅని యెవరన్నా బాధ్యతవహిస్తారా ? అదీలేదు.

మహా మహా మొనగాడైన, హెల్తుఆఫీసరు వేసినా ఆ యాపదలురావని అభయహస్తమిచ్చివేస్తాడా? వాడికి ధైర్యమూ లేదు, అవసరమూ లేదు. ఇలాంటి పరిస్థితులలో-

రాజన్ మంత్రి అంటాడుగదా:—

**౨౨ రాజన్ మంత్రి పిడివాదము.**

"నాకు టీకాలువేయటం చాలా అవసరమని తెలుసు. నాకావిషయంలో గట్టినమ్మకముంది. దానిని మరల్చుటకు యింగ్లాండులో టీకాల నిషేధసంఘాధిపతులైన హాడ్వెన్ గారికే సాధ్యముకాలేదు. మీరు నన్ను త్రిప్పటానికి ప్రయత్నం చేయటం రాతిగోడను తలతోకొట్టి మెత్తపరచటానికి చేసే ప్రయత్నంవంటిది. వ్యర్థము. నామాట సాగితే-(సాగకేమి చేస్తుంది) ప్రతిబిడ్డకు పుట్టిన పదవరోజు లోపలనే టీకాలు వేయించి మశూచికము రాకుండా కాపాడతాము. మళ్లీ 7,8 సంవత్సరాల కల్లా రెండవ తూరి టీకాలు వేయిస్తాను. నిర్బంధము సాగించవలసివస్తే సాగించేతీరుతాను. ఎంత ఆరోగ్యవంతులైనా, ఎన్నినిదర్శనాలు చూపించినా ఏ వక్కరినీ వదలిపెట్టమూ" అని.

పైగా రాయబారానికి వెళ్లినవారిని గురించి చెప్తూతూ వారు మూఢనమ్మకము (Fanatics) గల వారన్నాడు. పై గ్రంథమంతా చదివిన వారికి యెవరికైనా రాజన్ మంత్రి యెట్టిఫానెటిక్లో బాగానే తెలుస్తుంది. ఆవివరములు 1938 జనవరి ప్రకృతి పత్రికలో చూడవచ్చును.

**౨౩ అయితే మశూచికము ఏమి చేసి ఆప వచ్చును**

ప్రజలు ఆరోగ్యవిధులను నేర్చుకోవాలి. పరిశుద్ధత అవలంబించాలి. ఇతర దేశాలలో అలాచేయటం వల్ల మశూచికం ఆగింది. ప్రతిమనిషీ తను తినదగినంత యుక్తమయిన ఆహారమునే తినవలెను. తడిగల కూరగాయలను గూడా అన్నముతో తినవలెను. శక్తిగలవారు పాలను, పండ్లను తినవచ్చును. ప్రతిదినమూ స్నానము చేయవలెను. పరిశుభ్రమైన వస్త్రములను, దుస్తులను ప్రక్కగుడ్డలనే వాడవలెను. ఆకలి కానిదే దేనినీ తినరాదు. ఆకలి అయినవానికి తినుటకు ఆహారము లభింపవలెను. కట్టుకొనుటకు అవసరమైనన్ని దుస్తులు లభింపవలెను. గాలీ వెలుతురు తగులుచోట ప్రతివారూ తగినంత పనిపాటలు చేసుకొనుచుండవలెను. పట్టణముల పెంపు ఆగిపోయి పల్లెలు సర్వ సమృద్ధి గలవిగా తయారుగావలెను. అచట శాంతి పుష్కలత సౌఖ్యము నెలకొనవలెను. పట్టణములుగూడా యిప్పటివలె నరకకూపములుగా నుండరాదు. ఒక ఇంటిలోనే 50, 60 మంది నివసింపవలసిన అగత్యము తగ్గవలెను. డ్రయినేజీ ఎలక్ట్రిసిటీకంటే ముందు రావలెననేసంగతి ప్రతి కౌన్సిలరూ తెలుసుకోవలెను. ప్రతి పట్టణములోనూ స్నాన, పానాలకు

కావలసిననీరు వెల పెట్టకుండా ధారాళముగా లభింపవలెను. ఆహారపదార్థములు కలితీచేసిన వెంటనే శిక్షిస్తూవుండాలి. దేశములోఉండే కల్లు, సారాయి అంగళ్ళమీద నిర్వహించటానికి వీలు లేనంత అమితపన్నులన్నా వేయాలి; తీసిలయినా వేయించాలి. కాఫీ, టీ, పొగాకూ, నల్లమందు ప్రజలువాడుటకు అసాధ్యమయేటంత పన్నులన్నా వేయాలి; దేశములో ధనము పుష్కలముగాఉండి పన్నులు అగత్యము లేకపోతే మానిపించనా మానిపించాలి. దేశములో వాడుకకు మరబియ్యము అసాధ్యమన్నా కావాలి. నిషేధించన్నా నిషేధించాలి. ఏన్నో చేయాలి.

ప్రజల ఆరోగ్యము వృద్ధికావాలి. అప్పుడు ఏ రోగమూ ప్రజలను పీడించదు.

# టీకాల వ్యాసములు

కోట శ్రీరాములుగారు

[1 టీకాలు. 2 అసభ్యమైన ఒకదుష్టశాసనము. 3 మశూచికముఅంటువ్యాధికాదు. 4 బొంబాయి గవర్నరుగారికి లేఖ. 5 వాక్సినేటరు ఉద్యోగం—అనే యీ 5 వ్యాసాలు మాకొరకు కోట శ్రీరాములుగారు వ్రాసియిచ్చి నారు. వారికి పిల్లలంటే చాలా ప్రాణం. టీకాల ఉద్యోగములో అయనపొందినవేదనే యీవ్యాసాలను ఆయన చేతవ్రాయించింది. —సంపాదకుడు.]

## ౧ టీకాలు

1. టీకాలు ఆరోగ్యవంతుల ఆరోగ్యమును పాడుచేయు ఒకవ్యూహము.
2. టీకాలు ఒకభయంకరమైన వ్యాధికి మూలమైయున్నవి.
3. టీకాలు మేహసంబంధమైన వ్యాధులను వృద్ధిచేయును.
4. టీకాలు మానవజాతికి హానికరమైన నిర్బంధశాసనము.
5. టీకాలు వైద్యసంబంధమును ఆరోగ్యసంబంధమును గాని ఒకమూఢఆచారము.
6. టీకాలు క్రూరమైనదై మానవులయొక్క అమాయకత్వముచేత వృద్ధిగావింపబడుచట్టము.
7. టీకాలు మానవజాతియొక్క బ్రతుకు తెరువును స్వతంత్రతను గృహపారిశుద్ధ్యమును పాడుచేయునదై యున్నది.
8. టీకాలు వలన అన్యపదార్థం దేహంలోని కెక్కించుట నవీనశస్త్ర శాస్త్ర బాహ్యము.
9. టీకాలు శుద్ధరక్తమును విషతుల్యముచేసి మానవ ఆరోగ్యమును జీవితమును, నశింపచేయు దుష్కృత్యము.
10. నిర్బంధ టీకాల విధానము దుష్టశాసనము.

# ౨ అసభ్యమైన ఒక దుష్టశాసనము

**టీకాలమందు ఒక ఆవుదూడనుండి తీయబడిన చీము.**



దేహములో యేభాగములోనైనా రక్తము చెడినచో, ఆరక్తము ఒకచోటనిలచి ఒకకురుపుగా బయలుదేరి తుదకుచితికి చీముగా బయటపడును. యీ టీకాల "శీరం" (మందు - చీము) యేవిధముగా తయారు చేయబడునది వినుటకు అసహ్యము గలిగించును. 5-6 నెలల వయసుగల ఒక ఆవుదూడను బల్లమీద వెల్లకింతలగా పరుండబెట్టి పొత్తికడుపుమీద రోమములు గొరిగి ఒక అంగుళముపొడవు చొప్పున 120 పైగా తేలికగా అడ్డకోతలు యిత్తురు. తరువాత వానిమీద మసూచికముతోవున్న మానవుని పుండ్లలోని చీమును (పానకమును) తెచ్చి పట్టింతురు. కొంతకాలమునకు ఆ దూడ పొట్టకోతలు 2 అంగుళముల వెడల్పున యుబ్బి చీముతో నిండియుండును. ఆ చీమేమనఆరోగ్యశాఖవారిచే గొప్పఔషధముగా ప్రశంసింపబడు వాక్సీన్ (Vaccine) లేక టీకాలపానకం. అట్లు నోరెరుగని లేగదూడను ఆవిధముగా హింసింప పాల్పడిన యీ ఆరోగ్యశాఖవారు ఆ చీమునకు పానకం, పాలు అను నామాంతరములిచ్చి అమాయకపు మానవులను మాత్రం నమ్మించి తప్పుడు త్రోవల నడపింప సాహసించుచున్నారు.

**అట్టి అనారోగ్యమైన చీమును శుద్ధమయిన పిల్లవాని రక్తములో కలుపుటఅతిదారుణమును మూర్ఖమును పశుత్వమును.**

అట్లు తయారుచేయబడిన విషతుల్యమైనచీమును బాగుగాకాచి చల్లార్చిన కత్తిమీద కొలదిగా వేసి పిల్లలయొక్క యేభాగముమీద టీకాలు వేయ నిచ్చగింతురో అచట వేడినీటితోను సబ్బుతోను కడగి తుడిచి ఆచీమును ఆప్రదేశమున వుంచి కత్తి Lancet ప్రయోగముతో చర్మమునుచీల్చి ఆచీమును ఆచీలికలద్వారా రక్తములో కలుపుదురు.

ఎట్టి అనాగరక యడవిజాతివాడయినను తాను కక్కినకూడును మరల తిననిచ్చగించడే! అట్టి స్థితిలో చూడుడు! నాగరికులయిన మనపాలకులు బలవంతముగా ఒకపశువునుండి తీయబడిన చీమును ఆరోగ్యవంతుని నిష్కల్మషమైన రక్తములో కలుపుటకు శాసించుచున్నారో విచారింపుడు! ఆరోగ్యవంతుడే! రోగిగాడు!! తెలుసునా!!

**బాలునియొక్క శుద్ధ రక్తములో మశూచికపు చీమును గలిపి మశూచికజాడ్యము వృద్ధిగాకుండ చూతుమనుట బుద్ధిలేనితనము.**

ఆరోగ్యముగాయున్న బాలునిరక్తములో మశూకపు చీమును గలిపినచోఅనగా టీకాలు వేసినచో తేలికగామశూచికపు జ్వరమువచ్చి ఆబిడ్డడు మశూచి వ్యాధినుండి తప్పింపబడుచున్నాడని చెప్పుచున్నారు. విచారించండి! ఒకమంచిగుణము గలవాడు చెడువానితోస్నేహముచేసిన యెన్నటి కయినా ఆమంచిగుణములు అతనియందు పెరుగుటగాని నిలచియుండుటగాని తటస్తించునా? తటస్తించవు. అట్లే టీకాలద్వారా ప్రవేశపెట్టబడిన అసహజమైన మశూచికి సహజమైన మశూచి యెందుకు సహాయపడగూడదు ?

జన్మయెత్తిన ప్రతిమానవుడు మశూచికముచే బాధపడుచుండెనా? లేదు. కనుక జీవితములో వచ్చునో రాదో తెలిసికొనజాలని యీమశూచికమును పసితనములోయున్న పిల్లలకు యీజాడ్యమును అసహజమైన విధులతో తెచ్చిపెట్టుట బుద్ధిలేనితనమని యెవరనరు? అటు లయినచో పెద్దవారయినతరువాత కలరా - క్షయ - ప్లేగు రాకుండగా యిట్టి అసహజమయిన విధులతో బాల్యమునందే యీ జాడ్యములను దేహములో చేర్చుకొన వలసినదేనా ? పై హాంశమునుబట్టి చూడగా యెవరయితే బాల్యమునందు అజ్ఞాన్నగా ఏకొలది పరిమాణములోనో వ్యాధుల నన్నిటిని శరీరములోను రక్తములోను చేర్చుకొనునో అతడే ఆరోగ్యవంతుడని ఆరోగ్యశాఖ వారు శ్లాఘించునట్లు తోచుచున్నది. వ్యాధిగ్రస్తుడుగా యున్నపుడే వైద్యుని సహాయముగోరుట ఉచితము గాని, యెపుడో ముందు జబ్బులువస్తవని యూహించి యిపుడే ఆజబ్బులనుపొందదలచుట న్యాయమా?

అసహజముగా తెచ్చిపెట్టు మశూచికము అంటు జాడ్యము కాదనిచెప్పుటవింతవిషయము కాదా? మశూచికము అంటు జాడ్యమని యింత గందరగోళము చేయుచున్నారుగదా ? వారిచే టీకాల ద్వారా తెచ్చిపెట్టు యీమశూచికముమాత్రము యేల అంటువ్యాధిగాదో ఆధారములు చూపగలరా ?

ఈటీకాల నిర్బంధవిధానము రాకపూర్వము 5,6 సంవత్సరముల కొకపర్యాయము యే వేసవిలోనో యేకొలదిప్రదేశములలోనో మశూచికము సంచారము చేయుచుండెడిది. ఇపుడో ఆరోగ్యశాఖవారికి రాత్రింబవలు చేతినిండ పనియుండునట్లు యేటికేడాది స్వేచ్ఛగా విహారముచేయుచున్నది. యెన్ని ఆరోగ్యవిధులనను సరించుచున్నను యీమశూచీదేవి యింత స్వేచ్ఛావిహారము చేయుటకు యీటీకాల ప్రచారముగాక వేరుకారణము చూపగలరా?సహజమైనమశూచి నూటికి ఏపదిమందినో బాధించుచున్నదిగాని యీదుష్టటీకాల పద్ధతి నూటికి తొంబదిమంది పసికూనలను హింసించుచున్నది.

## టీకాలవలన మంచిగలుగుచున్నదని చేయు ప్రచారము దుష్ప్రబోధము.

టీకాలవలన గలుగు హానిని అనేకవిధములుగా మభ్యపెట్టి టీకాలు వేయుచున్నారు. నోరెరుగని పసిబాలురు వేలకొలది మందిపాఠశాలలో తల్లిదండ్రుల యెరుకలేకయే యీ టీకాల పిశాచమునకు గురియగుచున్నారు. ఇట్టి దుండగమును మాన్పుటకై బాధ్యతగల తలిదండ్రులు గార్డియనులు విద్యాశాఖాధి కారులకు తమయనుమతి లేనిదే తమపిల్లలకు పాఠశాలలో పోడిపిల్లు వేయ వీలులేదని ఏకగ్రీవముగా విజ్ఞాప్తులుపంపుకొనవలయును. టీకాలు వేయించుకొననిదే పరీక్షకు కూర్చొనకూడదట. టీకాలకు పరీక్షలకు ఏమి సంబంధము? ఇతర దేశములకు బోవు నపుడు టీకాలు వేయించుకొననిదే ప్రయాణముసాగించ

గూడదట. ఉద్యోగము ఖాయము చేయబోవునపుడు టీకాలు వేయించుకొనవలయునట. పైగా ఉద్యోగము కొరకు ప్రయత్నించు ప్రతివ్యక్తి టీకాలు వేయించుకొని యుండవలయునట. ఏమి చిత్రము! ఇట్లనేక విధముల టీకాల సంకటమును వ్యాప్తిచేయుచున్నారు. ఇంకాపైగా ప్రజలయొక్క ఆరోగ్యమునకు యిట్టి ఆరోగ్య శాఖవారు కాపుదారుల మనుచున్నారు. ప్రజల నుండి అదనముగా సొమ్ము పోగుచేసి ఆరోగ్య వారములంటూ ప్రతిచోట చేయించుచున్నారు.

**టీకాలు నిర్దాక్షిణ్యముగ ఆరోగ్యమును గోరు వారినికూడ హింశించుచున్నవి.**

ఈ టీకాలవలన గలుగు విపత్తును కప్పిబుచ్చి మశూచికమునుండి రక్షించువానినిగా ప్రబోధము చేయుటయేగాక వాటివలన గలుగు విపత్తును యెరిగిన ప్రజలుగూడ త్రోసిబుచ్చరాని ఒక దుష్టశాసనముగాకూడ చేయ సాహసించియున్నారు. ఆ టీకాలచీమును శుద్ధమయి నిష్కల్మషమయిన పసిబిడ్డల రక్తములో కలిపినందుకుగాను వారి తలిదండ్రులు ఆ శాఖవారికి కానుకలు పినుతులు అర్పింపవలయునట! ఆ టీకాలవలన పసికూనల కెట్టిదుస్థితి సంభవించినను వారు జవాబుదారికిగాని శిక్షకుగాని పాత్రులుగారట. మంచిది. ప్రజలను మశూచి వ్యాధినుండియే రక్షింపబూనుకొనుటయేమిటి? ఇట్టి వ్యాధులు యెన్ని వ్యాప్తములో లేవు? వాటికన్నిటికి యిట్టి రక్షణయున్నదా? యింత ప్రాణోపద్రవములు గావా? వాని కన్నింటికి ఈ విధముగానే వేరు వేరు వైద్యులకు ట్రయినింగు యిప్పించి ఏల నియమింపగూడదు?

టీకాలవలన మంచిగలుగుచున్నదని సూచించు తప్పులెక్కలు తయారుచేయుట పిరికితనము, అసమర్థత. మదరాసు పట్టణములో 1888 సంవత్సరమునుండి 1897 స॥వరకు సంవత్సరమునకు ప్రతి 10,00,000 లకు 100 మంది వంతున మరణించినటుల నమోదుకాబడియున్నది. కాని టీకాల నిర్బంధము అమలులోపెట్టి సాగించిన తదుపరి ఆ పట్టణములోనే, ఆ పట్టణవాసులలోనే, 1918 సంవత్సరమునుండి 1922 సం॥ వరకు ప్రతి 10,00,000 లలోను మశూచీ మహామారివలన 800 మరణములు 4 సం॥ రములలో గలిగినవట. ఈ ఘోరమునకు ఏమిసమాధానం? రీవాక్సినేషన్ నిర్బంధము చేసినతరువాత యిట్టి మరణములు 1934 సంవత్సరములో 3200 అయినవి.

చూచితిరా! వీరి సాహసం యీ టీకాల దుస్థితి వలన మరణించినవారి సంఖ్యను యే యితర వ్యాధివలన మరణించినవారి సంఖ్యలో చేర్పించి వ్రాయించిరి. యీ టీకాల విపత్తువలన మరణించుటకు ఆరోగ్యశాఖవారు బాధ్యులై యుండగా యెదురు తల్లితండ్రులకు శిశుపోషణయందు నేర్పరత్వము లేనందున అపాయములు గలుగుచున్న వనుచున్నారు.

పైగా రేటుపేయర్లు (పన్నులు యిచ్చువారు) వద్దనుండి యేవిధముగానో డబ్బుగణించి ఆరోగ్య వారములని - శిశుపోషణాలయములని యేర్పరుచుచు విదేశసామగ్రులగు "హార్లిక్సుమిల్కు-మిలిన్సుఫుడ్ - నెసెల్సుమిల్కు" అమ్మచూచు మార్కెట్లుగా వానిని మార్చివేయుచు ఆవ్యాపారమునందు వీరు బ్రోకరులుగా యేరుడుచు విదేశవ్యాపారమును పెంపొందింపచేయుట విజ్ఞులు యెరుగకుందురా?

టీకాలపద్ధతి చట్టరూపముగా పెట్టుట ద్రోహకరము. గవర్నమెంటువారిని యీ టీకాల నిర్బం

ధము తొలగింపకుండుటకుగల కారణములడుగ వచ్చును. దానివలన చాల ద్రవ్యము ఖర్చు తగ్గును. ఆ ద్రవ్యము ప్రజల ఆరోగ్యముకొరకు వినియోగింపవచ్చును. టీకాలనిర్బంధము పెట్టుటచే యింగ్లాండులో స్పర్థలుగలిగి యీచట్టము అతిక్రమింపబడుచున్నది. అందువలన ఆరోగ్య శాఖవారు యింజక్షన్‌రూపముగా దీనిని ప్రవేశ పెట్టుటకు ఏపదార్థమును యింజక్షన్‌గా దేహము లోపలికి పంపితే బాగుంటుందో కని పెట్టుచున్నారు. (యింజక్షన్లు అన్నిరోగములలోను బాగుగా పనిచేయునని ప్రజలు ఆపోహాలో యున్నారుగాబట్టి) ఆ పరిశోధనకొరకు ఒక మనుష్యుడవసరముగాన నోరెరుగని అమాయకు లగు మన దేశీయులపైబడి వారి ప్రాణములు తృణప్రాయముగాచూచి డాక్టర్లు పరిశోధనలు సల్ప తయారగుచున్నారు. ఆడాక్టర్లంతా దయామయులై మానవ కల్యాణము సేవకొరకే బయలుదేరినచో ముందుగా తాము యీ చీమును, విషపదార్థములను తాము యింజక్షన్ చేసికొని వాని యుపయోగానుపయోగములను మంచి చెడుగులను చూచుకొని తదుపరి ప్రజలపై బడుట ధర్మమని నామనవి.

కాకపోయిన యింకొకమాదిరి చేయవచ్చును. చైనాలో కొంతమంది ప్రత్యేకముగా తమయింటికి స్వంతజీతభత్యములిచ్చి వైద్యులను నియమించుకొందురట. ఆయిండ్లలో యెవరు జబ్బుపడకుండ చూచుకొను బాధ్యత ఆవైద్యునిదట, ఆడాక్టరు జబ్బువచ్చినతరువాత మందులనంచి విప్పి సావకాశంగా వైద్యం చేయుటకుగాదు; ఆయింటివారు రోగగ్రస్తులుగాకుండ సలహాలుయిచ్చుచు, వారి ఆరోగ్యమును తనిఖీచేయుచు వారిని కాపాడుట మాత్రమే. అట్లుగాక ఆయింటిలో యెవరయినను జబ్బుపడినచో ఆజబ్బుయొక్క తీవ్రతనుబట్టి ఆయింటి డాక్టరుగారి జీతము తగ్గుచుండునట. ఆ దేవిధముగా ఆరోగ్యశాఖవారు ప్రజలకు ఆరోగ్యమును బోధించుచు యెంతవరకు మశూచికము - కలరా - ప్లేగు మొదలగువ్యాధులు యెత్తిపోయకుండా యుంటవో అంతవరకు వారి జీతభత్యములను సంపూర్తిగా పుచ్చుకొన నియ్యండి కాని యిట్టిసంకటములు - మశూచి కలరాలు; ప్రజలకు గలిగి జీవులు నష్టమయినచో ఆరోగ్యశాఖవారి జీతములు తగ్గించి యిచ్చుటగాని అసలు యెగబెట్టుటగాని చేయించండి. అప్పుడుగాని ఆవుద్యోగులు ఆయారోగములు రాకుండునటుల తగినశ్రద్ధ ఆరోగ్యవిధులను ప్రజలకు నేర్పరు. ఇంతియేగాని యెంత కాలము యిట్టిపరిశోధనలతో కాలము బుత్తురు? యీనోరెరుగని ప్రజలపై అనారోగ్యకరములైన యిట్టి పరిశోధనలు యెంతకాలము చేయుదురు.

టీకాలపరిశోధన యింకను బాల్యావస్థయందే యున్నది. చాలమంది ప్రఖ్యాతివహించినట్టియు అనుభవమును గణించినట్టి డాక్టర్లు యీటీకాలు వేయుటవలన గలుగువిపత్తులను హానిని ఒప్పుకొనుచునే యున్నారు. గుర్రము - గాడిద - పంది - కోతి మొదలయిన పశుజాతినుండి తీయబడిన చీముతో యింతవరకే పరిశోధన చేయబడినది. కాని యిపుడు ఆవుపెయ్యల నుండి దీసినచీముతో పరిశోధించుచున్నారు. ఏమైనను వారికంటకములగు పరిశోధనలకు మన నోరెరుగని పసికూనలు, ముద్దులపిల్లలు, కులమునుద్ధరించి దేశసేవకులగు మనచంటిబిడ్డలు జాతర పశువులవలె ఏర్పడుచున్నారు.

బిడ్డ ఎట్లుతల్లిగర్భమునందు నిలచి, తరువాత తల్లి స్తన్యమునుగ్రోలి వానిచే దేహమును, కండరములను పెంచుకొని తుదకు తల్లిగుణములు

వానినుండి ఆకర్షించుకొనుచున్నాడో అటులనే యీటీకాల చీము మశూచికము యచ్చట యందేకాక చీము తీయబడ్డ ఆవశిశువునకు యేయే రోగములుగలవో, ఆ వ్యాధినిగూడా యీ చీమే పిల్లవాని రక్తములోగలసి వ్యాధి వుత్పత్తికి గారణమగుచున్నది. అందుకొరకై అనుభవముగల డాక్టర్లు యీ టీకాలవల్ల వచ్చు యితరజాడ్యములను పరిశోధించుచున్నారు.

సహజముగా పశుజాతికి మానవులపట్ల పుట్టుకతో వచ్చిన భయముగలదు. ఆ కారణముచేతనే మానవుడు అడవిమృగములగు సింహము - పెద్దపులి - మొదలగువాటినయినను వశముగావించుకొని తన యిష్టానుసారము వానిని ఆడించుచున్నాడు. అందులో ఆవుపరమసాధువు యిక లేగ ఆవుదూడలమాట యేమనవలయును? అట్టి గుణములుగల లేగదూడనుండి తీసినచీము దేశోద్ధారకులు కాబోవు యీశిశువుల రక్తములోకలిపి ఆవశుత్వమును-సాధుత్వమును- భీరుత్వమును వేయేల శానిసస్వభావముగూడ బాల్యమునందే గలిగింప ఉద్దేశించినటులగా దోచుచున్నది. కాకున్న ఉగ్గుపాలతో పాటు బాల్యమునందే పసికూనల యందిట్టి యమానుషకృత్యమున కొడిగట్టరు.

ముద్దుబిడ్డకు 5,6 మాసములు నిండకపూర్వమే యీ టీకాల మహామారి వానిని వెదకికొనుచు వచ్చి తలవాకిట నిలబడి తన విషహస్తములను జాచి పిల్లను బయటపెట్టుడని పిలుచుచున్నది. జ్ఞానములేని మనము ఆపసికూనలను ఆరోగ్యవంతులుగాయున్న ఆబిడ్డలను చేతులార ఆమహామారి నోటబెట్టుచున్నాము. ఇప్పటికి షుమారు 70 సం॥పైనుండి యీపిశాచము మనలను బీడించుచు బలాత్కారముగా చిన్నప్రాయమునందే మన దేహములో ప్రవేశించి ధైర్యసాహసములను వ్యక్తిత్వమునునశింపచేసి మనలను కేవలము శానిసలుగా మార్చివేయుచున్నది.

**టీకాలకొరకు పిల్లలను పంపుట శుద్ధ పిరికితనము.**

మనము యీ టీకాలవలన గలుగు యుపద్రవములు వినుటచేతను - చదువుటచేతను - యనుభవించుటచేతనుమనకునచ్చినను టీకాలువేయువారి యెదుటికి పిల్లలనుతీసుకురావలసినదిగా చాటింపు వినిననో లేక నోటీసులు చూచుకునిన తోడనో కిక్కురుమనకుండగా శిశువులను తీసుకువెళ్లి టీకాలు వేయించుచున్నాము. ఇది వట్టి పిరికిపందతనము. మన శిశువులకు టీకాలువేయించమని పోరాడినచో ఒక అర్ధరూపాయియో రూకయో లేక రెండో జరిమానా వేతురు. ప్రేమపాత్రమైన శిశువును కాపాడుకొనుట మనధర్మముగాదా? జరిమానాను లెక్క సేతురా? యీ జరిమానాకు భయబడి పిల్లలను ఆటీకాల పిశాచమునకు వప్పగింతురా? న్యాయమా? టీకాలవలనగల్గు విపత్తు తెలిసికూడా ఆటీకాల మారిని యెదుర్కొనకపోవుట మన శిశువుల యెడ ద్రోహము చేయువార మగుచున్నాముగాదా? ఆ శిశువులే తాత్కాలికముగా టీకాలవిపత్తుయెరిగిన వారయి దైవకృపవలన భావమును వెలిబుచ్చు వాక్కువచ్చియుండునేని వారికి చేయు ద్రోహమునకు తల్లిదండ్రులను "మృత్యుదూత"లని యెంతనిందింతురో వూహింపుడు. అట్టివిష పదార్థము వారి దేహములోగల శుద్ధరక్తములో గలుప నెంతకాలము వెనుకాడమో అంతవరకు మనము నిందార్హులమే. నిస్సహాయులయి దైవస్వరూపులైన ఆ పసికూనలకు మనముగలిగించు యకృత్యము మనల నేనాటికయినను హింసింపక మానదు.

టీకాలువేయుట యకృత్యము; వేయువారు హింసకులు. ఇండియన్ పినల్‌కోడు 350 చట్టము ననుసరించి యెవరయినను ఏశిశువునుగాని బలాత్కారముగా టీకాలువేశి దానివలన గలుగు జాడ్యములు గల్పించినచో యట్టివారు వంచకు లగుచున్నారు.

351 వ చట్టముననుసరించి టీకాలు వేయువారె పిల్లలను టీకాలువేయించుటకు పంపమని తల్లి దండ్రిలను బెదరించినచో తమటీకాలువేయు సామగ్రిలతో ప్రిజలమీద దాడి (ద్రొమ్మి) వెడలువారుగా పరిగణింపబడుచున్నారు. 269 చట్టప్రికారము టీకాలువేయువారు మశూచీ జాడ్యమును ప్రిజలలో టీకాలువేయు మూలముగావృద్ధిపరచుచున్నారను నేరమునకు 6 నెలలు కారాగార శిక్షకు గొప్పజరిమానాకు బద్ధులగుచున్నారు. 34 వ సెక్షన్ ప్రకారము టీకాలు వేయువారు, హెల్తాఫీసరు, యింకా టీకాలు వేయించు కొనుటకొరకు నిర్బంధించి పురికొలిపి ప్రాశిక్యూషన్ కొరకు వాదించు వారందరు ద్రోహులు, నేరస్తులుగా పరిగణింపబడవలెను. పినల్‌కోడు 107 సెక్షన్ ప్రికారము నిర్దాక్షిణ్యముగా తమ శిశువులను యీ టీకాల విపత్తులో ముంచు తలిదండ్రిలు నిందార్హులుగా చెప్పబడుచున్నారు. యీ విధముగా టీకాలువేయుట చట్టవిరుద్ధమని నిర్వచించి యుండగా ఆరోగ్య శాఖవారు నిరాఘాటముగా, నిరాక్షేపణగా, యీ పాడిపిల్లు నిర్భయముగా అమలుజరిపించుట చాల యాశ్చర్యకరముగా యున్నది.

ఈ సందర్భములో తలిదండ్రిలకు, గార్డియనులకు ఒకమనవి. మీ పిల్లలను టీకాల విపత్తులో త్రోయుటకు ముందు మీ పిల్లలకు యెవరు టీకాలు వేయించవలసినటుల నిర్బంధించుచున్నారో అనగా వేక్సినేటరుగాని, హెల్తాఫీసరుగాని యినస్పెక్టరుగాని మొదలయిన అధికారుల వద్దనుంచి యీ క్రింద వుదహరించిన ప్రికారము ఒకహామీ పత్రమును వ్రాయించి పుచ్చుకొనండి.

న మో నా.

ఈ క్రింద సంతకముచేసిన నేను మీ పిల్లకు వేయుట్రీకాలవల్ల యెట్టి ఆనారోగ్యము సంభవించకుండగను ప్రాణభయము లేకుండగను చట్టములకు బద్ధుడనై యీ విధముగ మీకు హామీ యిచ్చుచున్నాను.

1. యీ ట్రీకాలవల్ల మీ బిడ్డలకు యేవిధమయిన అపకారము జరుగదనిన్నీ,

2. యీ టీకాలు వేసుకున్న ప్రితిమానవుడు కనీసము 7 సం॥రములవరకు మశూచికమువలన బాధపడడనిన్నీ,

3. మీ బిడ్డకు వాడుచున్న యీటీకాలమందు (చీము) అంటుజాడ్యములనిచ్చు యితరవిష పదార్థములుగాని - అట్టి క్రిములుగాని కలిసియుండలేదనిన్నీ,

4. నేను కేవలము టీకా లసంబంధమయిన చట్టమును తెలిసిన వాడ నేగాక - టీకాలు వేయుటలో చాల సంవత్సరములనుండి నాకు యనుభవముగలదనిన్నీ,

5. మీబిడ్డను నేను పరీక్షించి మంచి ఆరోగ్యస్థితిలోనేయుండి టీకాలు వేయుటకు తగియున్నదని మిమ్ము నమ్మించుచు టీకాలువేయుచున్నాను. కొందరు యీమశూచికపు జాడ్యము నుండి తప్పించుకొనుట యితరమార్గము లేవయినగలవా యని యడుగుచున్నారు. మనపూర్వులు యీ మశూచికపు జాడ్యము దేహములోని యుష్ణాధికతచేత గలుగుచు తరుచు వేసవికాలములో బాధించుచున్నటుల గ్రహించి వేడిని తగ్గించు

టకు మార్గోసా (వేప) పూలను తినునటులును, మశూచికపురోగికి ఆయాకులు ప్రక్కమీద పరచునటులును ఆయాకులతో విసరునటులును చెప్పుచున్నారు. మనపూర్వుల ఆచరణ అనాగరకతగ భావించియో - లేక కష్టతరమనియో యీటీకాలపీడను యంగీకరించుచున్నాము. యిప్పటికయినను మేలుకొని యీటీకాల దుండగమును యెదుర్కొని తిరిగి మన పూర్వాచరణ మగు వేపపూలను తినుట - ఆకులతో రోగికి విసరుట చేసి ఆజాడ్యమునుండి తప్పించుకొందుము గాకయని మనవి.

### ప్రకృతిబద్ధమయిన యొకమార్గముగలదు

యెండాకాలములో పిల్లలు, పెద్దలు వారమునకు రెండు - మూడు పర్యాయములు పొత్తికడుపుమీద అరంగుళము మందముగల బురద పట్టీలు వేసుకొనుటమంచిది. అనగా ప్రాతఃకాలమున పొత్తికడుపుమీద 4,5 అంగుళముల వెడల్పున యిసుకకలియని మెత్తని ఒండుమట్టి పట్టీని చేసి 15 నిమిషములుంచి తీసివేయవలెను. అటులచేయుటలో అధికవుష్ణమును తీసివేయుటయే గాక పొట్టప్రేవులలోగల మాలిన్యమును వాటి బాధలను తీర్చివేయును. పిల్లలకు మంచిపని చేయును.

మనమందరము ఒక్కసారిగా యీటీకాలనిర్బంధమును యెదుర్కొనవలయును. అట్టి హక్కు యిది చదువు ప్రతివ్యక్తియందు గలదు. యిట్టి విపత్తులను చూపుచు చట్టమును రద్దుచేయవలసినదిగా డిస్ట్రిక్టుబోర్డులలోను, మ్యునిసిపాలిటీల లోను లెజస్లేటివు కవున్సిళ్లలోను ప్రయత్నించుట మనవిధియైయున్నది. అవి మన చేతులలోనివి. అటుల ప్రయత్నించనిచో మనధర్మములను మనము నిర్వర్తించక శిశువులయెడ ద్రోహము చేయువారమగుచున్నాము.

మనము కవున్సిళ్ళకుపంపు అభ్యర్థులును ధర్మపరులుగను జాత్యభివృద్ధికోరువారుగను, స్వలాభపరులుగాని వారలుగను చూచుకొని పంపినచో యీ టీకాల విపత్తునుండియే గాక యిటువంటి యింకా యితర దారుణములనుండి దాటింతురు. ఇట్టికార్యములు సిద్ధించుటకు భగవత్సేవ ప్రధానము.



## 3 మశూచికము అంటువ్యాధి కాదు

డాక్టరు రూథర్ మండ్ అను యింగ్లీషువైద్యులు తనకర్బలియిట్ అను వ్యాసములలో యీమశూచికపు జాడ్యమును పరిశోధించి తనయనుభవమునుగూర్చి యిట్లు వ్రాసెను.

1901 సం॥ జాన్యుయరీ 21 వ తేదీ సోమవారం పగలు 11-30 గంటలకు మహరాజశ్రీ......
............వారి గృహములోనికి వెళ్ళితిని. ఆయింటిలో స్టార్కు అను నామె మశూచికముతో బాధపడుచున్నది. నేను ఆయింట ప్రవేశించగానే ఆయింటి యజమాని............
......ఆదుర్దాతోవచ్చి మేము యితరులను మాయింటిలోనికి రానియ్యటం లేదన్నాడు. పరవాలేదు, నేను మశూచికపు రోగిని చూచి వెళతానన్నా. సరేఅమె అదిగో అచట నున్నదనిచూపారు. ఆరోగి చాల పిన్న వయస్సురాలు. ఆయింటి యాబిడ...............రోగివద్ద ఒకకిటికీలో గూర్చుని లేసుకుట్టుకుంటోంది. యింకా 2 ఏళ్ళపిల్ల అచట ఆడుకుంటోంది. నేను దగ్గరకు వెళ్ళి ఆ యమ్మాయినుండి మశూచికం

తగులుతుందని భయంపడరా, మీరు? అన్నా. మాకు భయంలేదు అంది ఆరోగితల్లి. డాక్టర్లు యీరోగం బహు అంటురోగంఅంటూ గందర గోళం చేస్తారే ఎందుచేత? ఆరోగిని మీ అందరికి దూరముగావుంచక యీ యింటినే యింత అజాగ్రత్తగాను నిర్లక్ష్యంగాను డాక్టరు యెందుకు వుంచాడు అంటే సమాధానంలేదు. అపుడు నేను యిది అంటువ్యాధికాదని రుజువుచెస్తానని చెప్పి ఆ అమ్మాయి వంటిమీదవున్న కొన్ని మశూచికపు బొబ్బలు చిదిపి ఆచీము నా ముఖంమీద రాచుకున్నా. ఆమె ముఖము మీద పొక్కులు గొన్నిచిదిపి నాచేతులనిండా, గడ్డానికి, కోటుకు రాచుకుని రుద్దుకుంటూ యిపుడే భోజనానికి వెళుతున్నానని చెపుతూ బయలుదేరా. భోజనానంతరం ఆఫీసుకు వెళ్లా. ఆఫీసులో మొదట నాస్నేహితుడు రివరెండు టి. కలుసుకున్నాడు. సంతోషంతో కరస్పర్శనం చేసుకున్నాం. నిజానికి నావంటినిండ బట్టలనిండ మశూచికపు విషమున్నట్లు నేనే మరచిపోయినా. నేను వ్రాసిన ఒకపుస్తకంకూడా ఆయనకు బహుమతిగాయిచ్చి దానిగుండాకూడా మశూచికపు క్రిములను వ్యాప్తిచేసియుండాలి. ఆసాయంత్రమే కంటిఅద్దాలు ఇవ్వడానికి నేత్రపరీక్ష చేయడానికి యెంతమందినో ముట్టుకొనియుంటా. సాయంత్రం క్లబ్బులో 4 మొదలు 10 గంటల వరకు పేకాటఆడుతూ కూర్చున్నా. ఆ సందర్భంలో మశూచికపు జాడ్యంమీద చర్చవచ్చి ఒకాయన నేను పోద్దున మశూచికపు రోగిని పరీక్షించిన విషయం అడిగాడు. డిక్సన్ అనునాయన నన్ను "డాక్టరుగారూ! మీరు యింత నిర్లక్ష్యంగాయుండి మశూచికపు రోగులయిండ్లకు పోవటం మానరుగదా? ఈ జాడ్యం మీయింటి యందు వ్యాప్తంచేసి మీ పిల్లలకు, మీవద్దకు జబ్బులు నయంచేసుకునేందుకువచ్చు మాపిల్లలకు తగిలిస్తారు" అంటూ కఠినముగా మాట్లాడాడు. పాపం అప్పుడు నేను మసూచికపు విషంతో వున్నట్లు యెరుగడా మానవుడు. పైగా పేకముక్కలద్వారాకూడా మాకు స్పర్శజరుగుతోంది. యిటువంటి పరిశోధనలు యీమాదిరిగా 15 సం॥ లుగా 12 పర్యాయములు చేసాగాని; నేనుగాని యితరులుగాని యెట్టి అనారోగ్యం పొందలేదు.

క్లబ్బునుంచి యింటికివెళ్లి భోజనంచేసి నాకుటుంబంతో పరున్నా. ఉదయములేచి గ్రిక్కబేకు ఆ దుస్తులనే ధరించి స్నానముచేయకుండా వెళ్లా. అచట భోజనంచేసి మహారాజశ్రీ రం... గారి స్టోర్సుకువెళ్లి అచట కొందరికి కళ్ళ అద్దములకు సలహాలుయిచ్చా. వారి సంఖ్య 27; యింకా యీరమ్మోట బండిలోతిరిగి యింటికివచ్చా. మరుసటిరోజు బుధవారం. స్నానంచేసా. అప్పటికి యీ మశూచికపు విషం రాచుకుని 46½ గంటలయింది. నేను ఆఫీసుకు వెళ్లేటప్పటికి మశూచికపురోగి యింటికివెళ్లింది, ఆచీము వంటినిండా రాచుకుంది. యింకా యేంచేసింది చెప్పవలసిందిగా కొందరు నామీదకు దండూరాకు వచ్చి మూగారు. నేను ఔనని కాదని చెప్పలా. కాని యీ విషయమంతా ఆరోగి యింటిప్రక్కనున్న ఒక ఆవిడ కనిపెట్టి యిది వూరిమీద చాటించిందని తెలిసింది.

కొంతకాలానికి చేసింది చెప్పకతీరిందికాదు. వార్తాపత్రికలవారు కొంత అబద్ధం కలుపుతూ ఊరిలో యంటుజాడ్యం నేను వ్యాప్తిచేయ తలచినట్లు వ్రాశారు. (నాల్గవరోజు) గురువారంనాడు నేను యిల్లువెడలి బయటికిరాకూడదని యింటిచుట్టూ పోలీసు నిఘావేశారు. ఇట్లా నన్ను నిఘాలో యుంచటంచేత నా ప్రాణాలు దక్కినవని లేక

పోయినచో యితర డాక్టర్లవల్ల హెల్తు డిపార్టు మెంటువారిచేత ప్రజలు యుద్రేకింపబడి నాప్రాణాలుతీయ సాహసించినారని ఒక పోలీసు నాతో చెప్పాడు.

శనివారం నిర్బంధాన్ని అతిక్రమించి 40 మైళ్లలో యున్న వప్కాకువెళ్ళి అచటినుండి చికాగోకు అచటినుండి "టారీహావుట్"కు వెళ్ళి తిరిగి యింటికి వస్తుంటే "మిల్వాకీలో" మరల బంధించి 4 రోజులు నిర్బంధములో వుంచారు. యీ పరిశోధన ఇంత గందరగోళం కల్పించింది.

యింత గందరగోళంచేసిన ప్రజా వంచకులగు డాక్టర్లు నావలన మశూచికము వ్యాపించినటులుగా నిరూపించుటకు చాల ప్రయత్నములుచేసి తుదకు 1 కేసును బట్టజాలకపోయిరి. అప్పటికి నేను 50 వేల ప్రజలలో తిరిగి మశూచికపు విషముతోవున్న నా హస్తమును 37 గురికి ముట్టించి నప్పటికి యేమీ ప్రమాదము గలుగలేదు. యిటువంటిపనులు చాలా చేసాను. అవి యింకా ఉత్సాహజనకములుగా యుంటవి.

వేలకుమించిన యీ మోసగాండ్రు హత్యకాండ్రు నయిన యీ వైద్యగాండ్లు యెందులకు యీ క్రింద సవాలుచేసి పందెము గెలుచుకొనుటకు ముందుకు రాగూడదు.

**"ఈమశూచికము యంటుజాడ్యమని నిరూపించువారికి ఒక 1000 డాలర్లు బహుమతి యీయబడును. వారునిర్ధారణ చేయుటకు బూనుకున్న ప్రతిరోజుకు 10 డాలర్లవంతున తుదివరకు యీయబడును"**

ప్రజలలో యిదియంటుజాడ్యమని మూఢనమ్మకమున్నట్లు వైద్యునికి తెలియకపోలేదు. అందుచేత వైద్యునికన్న ప్రజలు నిందార్హులుగారా? చాలమందికి మసూచికముఅంటుజాడ్యముగాదని తెలియునుగాని అది వచించుటకు సాహశించరు. అటుల బయలుపెట్టువారిపక్క ధనవంతులు వాకూ్యరు లుండవలయును. మీరు యెంతకాలమిట్టి గుడ్డినమ్మకములోయుందురో అంతవరకు యీ వైద్యులు మీవద్దనుండి డబ్బునులాగి మీ ఆరోగ్యమును నాశముగావింపకమానరు. దయామయుడగు భగవంతుడు ఒకడు చేసిన తప్పుకు తన బిడ్డలనందరిని నరకమున గూలద్రోయునా? యిది నమ్మదగినదా? అటులనే ఒకడుచేసినదోషమునకు అంత ప్రజను యిట్టి జాడ్యములతో పీడించునా? అట్లనుట దయామయుడగు భగవంతుని నిందించుటయేగాదా?

(ఐ) డాక్టర్ రూథర్మాండ్.

**మదరాసువారి యనుభవములు యీదేశవాసులందరికి హెచ్చరికచేయునవియై యున్నవి.**

**నిర్బంధ రీవేక్సినేషన్ చట్టానంతరం మదరాసునందు మసూచికమువలన మరణములు నాల్గురెట్లు హెచ్చుగాబడినవి.**

**మధ్య వయస్సువారికి గాక పసికూనలకే యీ నిర్బంధ "రీవేక్సినేషన్" చేయించవలసినదిగా బొంబాయి గవర్నమెంటువారు చట్టములను ప్రవేశపెట్టుటకు సూచించుచున్నారు.**

టీకాలు మశూకపుయెత్తిపోతలను ఆపలేక యోడిపోయినవి. ఈ మశూచికపు యెత్తిపోతలకు గల కారణములను కనిపెట్టి వానిని తొలగించుటకు బదులు శిశువుల రక్తమును యింకా విషతుల్యముగా చేయుట.

నిర్బంధ రీవేక్సినేష చట్టమును అమలులో వుంచి మశూచీ జాడ్యమును నాప ప్రయత్నించిన మదరాసుయోడిపోయినది. పైగా యీ చట్టము అమలులో పెట్టిన 1932 సం॥ తరువాత మశూచి మదరాసులో అంతకు పూర్వముకన్న యెక్కువయి పోయినది.

**బొంబాయి గవర్నరుగారికి టీకాల ప్రతికక్ష "సంఘమువారి నుండిలేఖ"**

పై సందర్భములో లండన్‌జాతీయ టీకాల ప్రతికక్ష సంఘ శక్రిటరీగారు బొంబాయిగవర్నరుగారికి యీ క్రింది విషయములను మనవిచేయుచున్నారు.

ప్రస్తుతము తమయెదుట నుంచబడిన నిర్బంధ రీవేక్సినేషన్ చట్టమును(Compulsory Re Vaccination Law) ప్రవేశపెట్టు సూచనలను అడ్డగించు కారణములను తమ దృష్టిపథములోనికి తేవలసినదిగా జాతీయటీకాల ప్రతికక్ష సంఘము చేఆజ్ఞాపింపబడితిని.

ఇంతకుపూర్వము యిరువదినాలుగు సంవత్సరములకిందట బొంబాయి పురపాలకసంఘము వారిచే నిర్బంధరీవేక్సినేషన్ చట్టము అమలులోనికి తే నుద్దేశింపబడి 1913 సం॥ లో గవర్నమెంటువారిని కోరినను వారు యెట్టిజోక్యము కలిగించుకొనక పోయిరి. పురపాలకసంఘము వారును ఆచట్టమును యుపసంహరించుకొనిరి.

ఇతరచోట్లనుండి వచ్చినవారికి రీవేక్సినేషన్ విధిగా వేయాలని నిశ్చయించగా గవర్నమెంటు వారు అన్ని ప్రాంతములలోను యింతకుపూర్వమే యీనిర్బంధ టీకాలచట్టము అమలులో యుంచబడినదని సూచించారు. ఈస్థితిలో యితర ప్రాంతములనుండి బొంబాయికి మశూచికము గొని తేబడినదంటే యీరీవేక్సినేషన్ చేయించుకున్నవారివల్లనే యని వొప్పుకుతీరాలి.

బొంబాయి లెజస్లేటివుకవున్సిలు మెంబర్లయిన సర్ ఫిరోజిషామెహతా, సర్ దినేశవాచా సర్ యిబ్రిహింతుల్లా-డాక్టర్ సర్ తుమల్జీనారిమన్-డాక్టరు సుఖియా మొదలయిన ప్రముఖులు రీవేక్సినేషన్ నిర్బంధమునకు ప్రతిఘటించిరి. ప్రథమంలో సర్ ఫిరోజి షామెహతాగారు యీ నిర్బంధచట్టమునకు యనుకూలురయినను కొంతమంది తమస్నేహితులు యీరీవేక్సినేషన్ మూలముగా మశూచిసంకటమునకు లోనగుటచూచి యీనిర్బంధచట్టమును యెదుర్కొనిరి.

## ఇంగ్లండులోని విశ్వాసప్ర క్లాజు
## (Conscience clause in Britain.)

ఇంగ్లాండులో యీటీకాలవిపత్తును విచారించుటకు 13 సభ్యులుగల ఒక "రాయల్ కమిషను" ఏర్పడి 7 సం॥ విచారించిన తరువాత 1896 లో ఒకరిపోర్టు తయారుచేసారు. (వారిలో 11 గురు యీచట్టమునకు అనుకూలురు)అట్టి వీరే వీరిరిపోర్టులో "విశ్వాసయుపచట్టం అనేదానిని కల్పించి దాని మూలంగా తలిదండ్రులు తమ శిశువులను యీ టీకాలనుండి తప్పించుకునేటందుకు వీలు గల్పించారు. రీవేక్సినేషన్ చట్టాన్ని అసలే తిరస్కరించి లాగివేశారు. ఆరిపోర్టు 1898 లో ఆమోదింపబడి 1907 సం॥ లో మంచి రూపాన్ని దాల్చింది. ఈ క్లాజు సహాయమువల్ల సగానికి మించిన శిశువులు యీ టీకాలనుండి తప్పింపబడ్డారు. ఇట్లా 30 ఏళ్లుసాగింది. ఇందువల్ల మశూచిలోనున్నంచి మరణాలు తగ్గినట్లు రికార్డు కనపడింది. కాని 1935 సం॥లో ఇంగ్లాండు వేల్సు మొత్తంమీద ఒక మశూచికపుకేసు కన్పించింది. అది చూచిన హెల్తాఫీసరుగారు అది మసూచికంగాదని నమ్మారు.

యీ పై విషయములనుబట్టి చూడగా మశూచిని యీపుటకు టీకాలు ముఖ్యంగాదని కొంతమంది వైద్యులకు తోచి యీ నిర్బంధటీకాల చట్టమును త్రోసివేసికొవలసిన వారికి ఉచితంగా టీకాలువేయు చట్టమును బెట్టవలసినదిగా సలహాయిచ్చియున్నారు. యీ సలహానే చూపుచు దానిని అమలులోపెట్టమని మ్యునిసిపల్ సంఘము వారు ఆరోగ్యశాఖ మంత్రులను గోరిరి.

ఇంగ్లాండువారి యనుభవములు కష్టనష్టములు చూచి కూడా యీ నిర్బంధటీకాల చట్టమును యెట్లామోదించుచున్నారో తెలిసికొన కష్టసాధ్యంగాయుంది. యింకా రీవేక్సినేషన్ విషయ మేమనాలి? టీకాలవిషయంలో ఇంగ్లాండుకు ఒక చట్టం ఇండియాకు వేరొక విధమయిన చట్టమేమిటి? ఒకవేళ మీరు యిండియాలో మశూచిజాడ్యం ప్రబలమని సమాధానమిస్తే వానికి కారణమేమిటో? నిర్బంధించి టీకాలు చట్టం అమలులోవుంచిన యీ ఇండియా ప్రజలలో జాడ్యం యింత వ్యాప్తంగా యెందుకుండాలో? యిష్టానుసారంగా వేయించుకునే ఇంగ్లాండు వేల్సులలోయింతతక్కువగా యెందుకుండాలో? తెలియపర్చవలసిన బాధ్యతమీమీద వున్నది.

యింకాపైగా ఈనిర్బంధ "రీవేక్సినేషన్" చట్టం యిండియాలో అమలులోపెట్టటం అది వ్యర్థం కూడా అవటం అయింది. 1932 సం॥ లో మదరాసు గవర్నమెంటు వారిచే అమలులోపెట్టబడిన నిర్బంధ రీవేక్సినేషన్ చట్టఫలితమేమయిందో చూడండి? అన్నిప్రాంతాలలో అంతకు పూర్వం వినని ఒకగొప్ప మశూచియెత్తిపోతకు కారణమయింది. 1931 సం॥ మదరాసు రాష్ట్రీయ పరిపాలన రిపోర్టులోవున్న మశూచికపుమరణములను యింకాతగ్గిద్దామని అప్పటి ఆరోగ్యశాఖమంత్రి, యీ నిర్బంధ "రీవేక్సినేషన్" చట్టం పెడితే పాపం 1931 సం॥ లో గలిగిన మరణాలకన్న 1934 సం॥ లో 4 రెట్లకుమశూచీ మరణాలసంఖ్య పెరిగింది.

అన్నిరాష్ట్రములలోను ప్రస్తుతము ప్రకటింపబడు ఆరోగ్య శాఖవారి రిపోర్టులను చూస్తే రీవేక్సినేషన్ వల్ల గలుగుచున్న మశూచియే గనపడుతోంది. క్రిందటి యుద్ధసందర్భములో మెసపుటోమియా ఆంగ్లేయ దళములో వచ్చిన మశూచికం యెత్తిపోత యీ రకంగా వుంది. యిది గవర్నమెంటువారి లెక్కలు రికార్డుననుసరించియే. 3 సంవత్సరములక్రితం రివేక్సినేషన్ చేయించుకుని దానివలన బాగా ఫలితము పొందబడిరనుకొన్న 287 గురు యీమశూచిచే 1916-17 సం॥లో పీడింపబడి అందులో 29 మంది చనిపోయిరి. హిందూదేశంలోకూడా ఆంగ్లేయ దళములమీద సంవత్సరాంతమున యిచ్చు ఆరోగ్యశాఖ రిపోర్టుచూస్తే చాలమంది రివేక్సినేషన్ చేయించుకొన్న సిపాయిలు వారిభార్యాపిల్లలు మశూచిచే పీడింపబడి మరణించినటుల కన్పడుతుంది.

**టీకాలను మశూచికం లెక్కచేయదు.**

బ్రిటిషు దీవులయొక్కయు, జపాన్, ఫిలిప్పయిన్లండు, అమెరికా సంయుక్త రాష్ట్రాలు వీటి చరిత్రచూస్తే యెన్నడు, యెక్కడ యీమశూచికం టీకాలకులొంగి లక్ష్యపెట్టినట్లుగా కనపడదు. నిర్బంధ టీకాలచట్టమును గట్టిగా ననుసరించియు యిటలీ జపాన్ దేశములు మశూచికపు యెత్తిపోతలకు గురియయినవి కాని యీ టీకాల ప్రమేయమేలేని ఆస్ట్రేలియా, న్యూజిలండ్‌లో యీ జాడ్యానికి తావే లేకుండాపోయింది. పుట్టిన శిశువులలో ⅔కు (మూడవవంతుకు) టీకాలువేస్తూ నిర్బంధ వేక్సినేషన్‌లేని యింగ్లాండు వేల్సులలో మశూచి అంతరించింది. కాని స్కాట్‌లెండులో సగానికి తక్కువగా పుట్టినపిల్లలకు టీకాలు వేయుటచే గత 16 సంవత్సరములలో రెండు మరణములు మశూచికము వలన గలిగినట్లుగా రికార్డుగలదు.

ఇంగ్లాండులోను వేల్సులోను టీకాల నిర్బంధం హెచ్చినకొలది మశూచీ జాడ్యం వ్యాప్తిలోకి

వచ్చి తుదకు 1871-72 సం॥ లలో 42000 మంది ప్రజమారణమయ్యే ఒక భయంకరమైన మశూచీ యెత్తిపోతగామారింది. ఆరోగ్యవిధుల ననుసరించినగాని యీ యెత్తిపోత యాగదని గుర్తించిన అప్పటి పార్లమెంటువారు 1875 సం॥ లో ఒక ఆరోగ్యశాఖ కనుసరించిన ఒక చట్టమును ప్యాసుచేసుకొనిరి. 1889 తరువాత టీకాల ప్రాముఖ్యత తగ్గించుకొనిరి. దానివెంటనే మశూచీ వ్యాప్తి తగ్గినది.

ప్రపంచకములో మెక్సికోలోవున్న మశూచీ మరణములు మరి యేప్రాంతములోను లేవు అటులనే అచటయున్న యీ టీకాల నిర్బంధము కూడా అంత తీవ్రముగా మరెచటనులేదు.

శాస్త్రపరిజ్ఞానం లేనివారుకూడా యిట్టి సందర్భములలో తమ యుద్దేశములు వెలిబుచ్చుటకు వారికి హక్కుగలదు. టీకాలువేయుటచే కొన్ని రోగము లుత్పన్నమయి మరణములకుగూడ చోటు గల్గుచున్నది. ప్రొఫెసర్ న్యూమాన్ యనువారు ఆరోగ్యముగాయున్న వ్యక్తిని శిశువును యీవిధముగా నిర్బంధించి పుడ్డలోపెట్టుటకు పార్లమెంటుకు యేలాటి హక్కులేదనిన్నీ ఆరోగ్యవంతుల ఆరోగ్యమును చెరచుట పాతిప్రత్యమును చెరచునటువంటిదేయని యీ టీకాల మూలముగా ఆరోగ్యము చెరచుచున్నారని ప్రకటించియున్నారు.

తమచే యెన్నుకొనబడి యీ కవున్సిళ్లకు పంపబడి, తమకు సమాధానం చెప్పవలసియున్న తమ అభ్యర్థులవల్లనే తమ స్వతంత్రం లాగుకొనబడి 24 సంవత్సరముల క్రిందటనే వారికి కావలసిన దానిని ప్రసాదింప నిశ్చయించుకున్న వారిపాలకుల దయనుగూడా పొందలేకయున్నారు. ఆహా యేమివింత ?

**జన్నరు విశ్వాసములు నిరాధారములు**

తుదిని మా కవున్సిలువారు యీ విషయంలో వైద్యులసలహానుగూడ విచారించవలసినదిగా మనవిచేయుచున్నారు. టీకాలు భ్రమయని వాదించువారిలో చాలమంది ప్రఖ్యాతివహించిన వైద్యులు శాస్త్రవేత్తలయిన ఆల్ఫ్రెడ్‌రస్సల్ వాలేస్, డాక్టరు ఛార్లేస్ క్రిగ్‌టన్ ప్రొఫెసర్ క్రూక్‌షాంక్ - జార్జిబెర్నార్డ్‌షా - యిమ్మాని యేల్ కాంట్ - మొదలయిన ప్రముఖులే, వీరు ప్రథమమున టీకాలకు అనుకూలురయినను అనుభవములు, పరిశోధనలుచేసి టీకాలుకూడ నివిగా యెప్పుకొనుచు జన్నరుమార్గములు తప్పులని, వానివలన అన్ని దేశములవారు మోసపోయిరని వాకుృచ్చుచున్నారు. గణితశాస్త్రయంచనాదారుడున్ను, లండన్ వైద్యఆరోగ్య విషయక స్కూల్ (London School of Tropical Medicine and Hygiene) అధికారియునగు ప్రొఫెసర్ మేజర్ గ్రీన్‌వుడ్ యను వారు 1929 సం॥లో ఒకమీటింగులో యీ జన్నరు వంచకుడని (Rogue) నిరూపించియున్నారు.

ఇది కొంతకాలముబట్టి విషయము. యీ నిర్బంధటీకాల "రివేక్సినేషన్ చట్టములను" పరీక్షించి యీ హిందూదేశ నాయకులు యింకొకదోవతొక్కకున్న యీ చట్టము మశూచిని యాపలేక యోడిపోవుటయేగాక అనర్థదాయకమయి పిల్లలపాలిటి మృత్యువును కాగలదు.

## నావాక్సినేటరు ఉద్యోగం

నేను 1928వ సంవత్సరములో స్కూలుఫయినల్ పరీక్ష ప్యాసయి శానిటరీ ఇనస్పెక్టరు కోర్సుకు బొంబాయివెళ్ళా. దానిలో ఒక భాగ

మయిన టీకాలపరీక్షకుకూడా కూర్చున్నా. ప్రస్తుతగాధ టీకాలుగాన దానినిగురించివ్రాస్తా. వెళ్ళిన మొదట్లో క్రొత్తగాబట్టి కొంత హుషారుగా యుంటూ వచ్చింది. కాని కాలంగడచినకొలది బహు కష్టంతోచింది. కారణాలుమనవిచేస్తున్నా. మధ్యాహ్నం పాఠంచెప్పి, పొద్దున (ప్రాక్టికల్) అంటే చదివినదానిని దృష్టాంతరంగా చేయించి చూపించేవారు. ఒక మహారాష్ట్ర సూపరింటెండెంటు మమ్మన్ని పట్టణంలోని వేరువేరు భాగాలకు తీసుకువెళ్ళి మాచేత పిల్లలకు టీకాలు వేయించేవారు. పిల్లలను దాదులు తల్లులు తీసుకు వచ్చేవాళ్ళు. అసలే ఆ ప్రాంతంవాళ్లు పచ్చగా ఉండటంచేత ఆ చిన్నపిల్లలు పచ్చగాయుండి ముద్దువచ్చేవాళ్ళు. సహజంగా నాకు చిన్నపిల్లలంటే ముద్దుగా వుండడంచేత చక్కగావున్న పసిపిల్లలను అడిగి తీసుకుని ఆడించుకుంటూ కూర్చునేవాడిని. ఆ టీకాలడిపోకు తీసుకొచ్చిన పిల్లలను వరసగాపిలిచి భుజముమీద సబ్బుతో కడిగించి చిన్న గాజుగొట్టములోవున్న టీకాల మందు ఆ భుజముమీద అరంగుళందూరములో 2 బొట్లువేసి చాకువంటి ఒక కత్తిమొనతో ఆ మందుమీద 4, 5 సన్నని సూక్ష్మమయిన కోతలువేయించి ఆ మందు ఆ కోతలలోనుంచి దేహంలోకి (రక్తంలోకి) యింకేవరకువుంచి మళ్ళీవచ్చే ఆ వారంనాడు ఆపిల్లను తనిఖీకి తీసుకురమ్మనిచెప్పి పంపేవారు. మేము పొంగిన టీకాలు చూడటానికి వెళ్ళేవాళ్ళం. కాని నాకు ఆరోజు చాల విచారకరంగా వుంటూవుండేది. యేమంటే! క్రిందటి వారంనాడు యెంతో ముద్దుగా నావంక చూచి నవ్వుతూ ఆడుకుంటూఉండిన ఆ పసిపిల్లలలో ఒకడు నావంకచూడక గుడ్డల్లో కప్పబడి తల్లులఒళ్ళో వుంటూవుండే వాళ్లు. మేము పిలచినప్పుడు తల్లులు పిల్లలను తీసుకొనివచ్చి టీకాలు పొంగినవవనిచెప్పి గుడ్డచుట్టలోనుంచి టీకాలు వేసిన చేయిమాత్రం మాకు చూపించి పోయే వాళ్ళు. ఆరోజు పిల్లలస్థితి చాల విచారకరం. దేహంవడలి కాంతిదగ్గి జ్వరముతో మూసిన కన్ను తెరువకుండా యుండేవాళ్ళు. ఒక్కొక్కప్పుడు టీకాలు వేయించుకోడానికి తీసుకువచ్చిన ఆడుకుంటూ - నవ్వుతూ ఊకొట్టే పిల్లలను ఒకసారిచూచి వారికి మరుసటివారంలో కలుగబోవు స్థితి తలచుకొని ఆ టీకాలడిపో పశుమారణ శాలలవంటి ఒక శిశుమారణశాలయని అనుకుంటూ వుండేవాడిని. పిల్లలను యీ స్థితిలోకి తెచ్చే యీ మందులు ఏమిటయి యుంటుందా! అని విచారించు చుండేవాడిని. కొంతకాలమునకు అది యేమిమందో? యెట్లా తయారవుతుందోకూడా చూపించారు. తరువాత ఆ విధానాన్నిగురించి విపులంగా వ్రాసుకుంటూ. పరీక్ష ప్యాసయి వచ్చినవెంటనే ............ మ్యునిసిపల్ ఆఫీసులో ఒక గుమాస్తాగాచేరి క్రమేణా ఆరోగ్యశాఖలో 1931 లో ఒకవ్యాక్సినేటరుగాతీసుకొనబడ్డా. బొంబాయిలోవున్నప్పుడు కులాసాగా కాలంగడుపుతూ హాషామాషీగా టీకాలడిపోల్లో తిరుగుతూ బాధ్యతల్లేకుండా వుండేవాళ్ళం. అప్పుడింత కష్టనిష్టూరాలు తెలిసేవి కావు. కాని మ్యునిసిపాలిటీలో వ్యాక్సినేటరుగా చేరిన తరువాత గలిగిన ఆందోళన యింతంత కాదు. ప్రతి నెలలో 3,13,22,29 తేదీలలో మదరాసునుండి (గిండీయినిస్టిట్యూట్) టీకాల మందు వచ్చేది. ఆమందుతో 80 మంది పిల్లలకు 20 మంది పెద్దవాళ్ళకు టీకాలువేసి వాళ్ళ జాబితా హెల్తాఫీసరుగారికి చూపాలి. టీకాలు వేశినవాళ్ళని మళ్ళీవచ్చే ఆవారంనాడు వచ్చి పొక్కిన టీకాలు హెల్తాఫీసరుగారికి చూపించి పోవాలని నోటీసు యిచ్చేవాళ్లం. అట్లావచ్చిన

వాళ్ళని హెల్తాఫీసరుగారు పరీక్షించి టీకాలు మాన్పుకునేందుకు "బోరిక్"మందుయిచ్చి పంపే వారు. ఆతనిఖీరోజు (Verification day) వచ్చిందంటే నామనస్సు మనస్సులో యుండేది గాదు. పడేకష్టంగూడా యింతంత గాదు. యెందు కంటే టీకాలువేయించుకున్నవాళ్ళల్లో సగానికి సగమన్న టీకాలు చూపించటానికి వచ్చేవాళ్లు కాదు. పాపం పిల్లలు సలిగి జ్వరంతోను కురుపుల తోను బాధపడుతూ వుండటంచేతనే లెండి— వాళ్లు రాకపోతే టీకాలు వేయకుండా దొంగ పేర్లు వ్రాశామని ఆఫీసరుగారిపోటు అందు కోసం వాళ్లకొరకు నేను జవాను తిరిగి తీసుకు వచ్చి చూపించాలిసివచ్చేది.

ప్రతినెల 6 నెలల క్రిందటపుట్టిన పిల్లలజాబితా జననమరణ రిజిష్ట్రారుమాకు పంపేవాళ్ళు. దానిని చూచుకుని ఆపిల్లలను తీసుకువచ్చి టీకాలు వేయించుకుపొమ్మని నోటీసులు పంపేవాళ్లం. యింకా పొరుగూరునుంచివచ్చిన పిల్లలనుకూడా వార్డులోపట్టుకొని టీకాలు వేసేవాళ్లం. ఆఫీసు కార్యక్రమాన్ని వ్రాయటం అసందర్భమని తోచి నాకు యిందులో గలిగిన అనుభవాన్ని మాత్రం వ్రాసుకుంటా. మదరాసునుంచి మందు తెప్పించి మశూచికం రాకుండా కానియేగాని- అడగకుండాపిలిచి మీపిల్లలకు టీకాలు వేస్తాము రండయ్యా అని యెంతో గౌరవంతో నోటీసులు పంపితే సంతోషించుతూ రావటానికి బదులు - మాపిల్లలు వూళ్లోలేరని— మొన్ననే జబ్బువచ్చి నయమయిందని చాలా బలహీనంగా వున్నా డని—యిప్పుడే కాస్తవళ్ళు చేస్తున్నాడని— యింకోసంవత్సరంపాటు వదిలిపెట్టండి సార్ అని— పండగలువెళ్ళిన తరువాత వేయించుకుంటామని యీనెలలో మంచిరోజే దొరకటంలేదని సాకులు చెపుతూ పిల్లలకు బదులు నోటీసులు పట్టుకు వచ్చి శైలం యిప్పించమని అడిగేవాళ్లు చాలా మంది పిల్లలను తీసుకువచ్చేవాళ్లేగాదు. అందు చేత మాకు గత్యంతరం యేమితోచేదిగాదు. గవర్నమెంటు ఆర్డరుప్రకారం వచ్చినలింపు ఖర్చు చేసి టీకాలు వేయకపోతే యెంతమందికి పంపిన మందు వృధాచేశామో అన్నిఅర్ధణాలు జీతంలో నుంచి కోశేయాలి. ఆకారణంచేత అవసరమై నంత మంది పిల్లలు డిపోకి రాకపోవటంచేత ఆసరంజామా డాలుడవాలు వేసుకుని పిల్లలకోసం వూరివెంట బయలుదేరేవాళ్ళం. యింటికివెళ్ళి టీకాలువేస్తే 0-12-0 అణాలు చార్జిచేయా లసివుంటుంది. అయినప్పటికీకూడా చార్జీలు యివ్వవద్దు వూరికే వుచితంగా వేయించుకోం డయ్యా అంటే బహువినయంగా యీరోజు అంత మంచిదిగా కనుపట్టలేదు లెండి, 2-3 రోజు ల్లోనే నేతమఆఫీసుకుతీసుకొనివచ్చి వేయించుకుంటే సరిగదా అంటూ బహు వినయంగా మనవి చేసేవారు. యిదంతా చదువుకున్నవారు ధని కులుగా వున్నవారిపాఠం. యిక చేయునదిలేక స్కూళ్ళల్లోకి, మాలగూడాలు, పాములపాకలు, వడ్రిపాకలు కూలిజనం వుండే ప్రాంతాలకు (Hut areas) పోయి బలవంతంగా హంగామా చేసి బూతులుతిడుతూనలుగురముఅటూయిటూ కాపలావేసి టీకాలు వేయటం ప్రారంభించే వాళ్ళం మేము ఒకప్రక్కకు వచ్చామని తెలి యటంతోనే గుడిశలన్ని ఖాళీలుచేసి కాలవ గట్లక్రిందకు, యిటికిహాముల్లోకి, పెంటకుప్ప ల్లోకి పిల్లలు తల్లులు పరుగెత్తుకుపోయి దాక్కనే వారు. వాళ్ళకోసం యెక్కడ పరుగెత్తుతాం. అందుచేత అందినంతవరకు పిల్లలకు పెద్దవాళ్ళకు పొడిచి తక్కినలింపు యెక్కడ ఖర్చుచేస్తామురా భగవంతుడాయని యింకొకచోటుకు బయలు దేరేవాళ్ళం, అట్టి సమయాలలో ఆపాటకపు

జనానికి కలిగే కలవరంచూచి నేను ఒంటరిగా టీకాలు వేయడానికిపోవ సాహసించేవాడినిగాదు. నేను అట్టి ప్రాంతాలకు మా రెండవ వాక్సినేటరు ఆయనజవాను లేంది పోకపోవడానికిగల కారణంకూడా మనవిచేసుకున్నా.

ఒకసారి లింపు (Limph) ఖర్చుకాక మిగిలిపోతే యథాప్రకారముగా పాములవాళ్ళ పాకల్లోకి లింపు ఖర్చుచేయటానికి నేను జవాను వెళ్లాం. నేను కుర్రవాడినిగా కనపడటంచేత నన్ను ఆజనం ఆట్టే సరకుచెయ్యక నిలబడేవాళ్లు. అప్పటికి జవాను యేదోతిడుతూ మీపిల్లలకు చొక్కాలు యివ్వటానికి యినస్పెక్టరుగారు వచ్చారనిచెప్పి ప్రక్కగుడిశలోంచి పిల్లలను తీసుకువచ్చి టీకాలు వేయించేవాడు.

ఒక అమ్మాయి తన పిల్లకు గుడ్డచుట్టి వీపువెనక పెట్టుకు నిలబడింది. పిల్లనుదింపు టీకాలు వేస్తానని బెదరించా. వినలే. నేను బలవంతంగా పట్టుకు వేద్దామని లేచేటప్పటికి నేను కడగావున్నానంది. "ముట్టుకోటానికి సందేహించి దాని తాత్కాలికపు యుక్తికి సంతోషించి జవాన్ని ఆ పిల్లవాడిని బయటికి లాగమన్నా. వాడు దాన్ని గట్టిగా పట్టుకున్నాడు. యింతట్లో దాని మగడు గుడిశలోంచి పరుగునవచ్చి టీకాలు యెందుకు వేస్తారన్నాడు? మీ పిల్లలకు మశూచికం రాకుండా వుండటానికిఅన్నా." నేను యింతవరకు యెక్కడ టీకాలు వేయించుకొనలేదు. నాకు మశూచికం రానులేదు. అట్లాగే నా పిల్లకు మశూచికంరాదు. మమ్మల్ని అమ్మతల్లి రక్షిస్తుంది. మీటీకాలు మాకువద్దు. యివి వేయించుకుంటే అమ్మతల్లికి కోపంవచ్చి మా అందరికి పోస్తుంది." అంటూ నాకు వ్యతిరేకంగా ప్రచారం సాగించాడు. అదివిని యికముందు యెన్నడు అక్కడ నేను టీకాలపొడుపులు సాగించలేనని భయంతోంచి కోపంతో జవానుని అదిలించి ఆపిల్లకు టీకాలువేసి నాప్రయోజకత్వం చూపించి తీరుతానని పట్టుపట్టా. వెంటనే ఆపాములవాడు (చాలా కండపుష్టి కలవాడులెండి) వాడి పెళ్లాన్ని యీ శనేశ్వరాల కళ్లల్లో యెందుకుపెట్టావు యీపిల్లని. దీనికి ఆయువు యీ రోజుతో సరిపోయింది. అంటూ భాషలో మమ్మల్ని తిడుతూ పెళ్ళాం నెత్తిమీద ముఖంమీదగుద్ది వెనుకనున్న పిల్లని చేతులోకి లాక్కుని నాముందుకు తీసుకువచ్చి యెట్లాగు యీ పిల్లకు టీకాలు వేయకుండా వదలవు. అందువల్ల చావక మానదు. నా మొదటి కొడుకును నరసరావుపేటలో మీ టీకాలవాళ్ళ పొట్టలో పాతివేశా. దీనిని నువ్వుతినెయ్యి. అంటూ టీకాలు వేసి వేధించిచంపటంకంటే చేతులారా చంపితే నాకష్టంతీరిపోతుందని కంసుడు దేవకి కూతురుని పైకెగరవేసి నరికేలాఘవం చూపిస్తూ ఆపిల్ల రెండు కాళ్ళు ఒక చేతితో పట్టుకొని చాకలాడు బట్టఉతికే మోరిగా ఒకదెబ్బని చంపుతానని తల్లక్రిందుగా తనమీది కెత్తాడు. వాడిపెళ్ళాం గొల్లుమంది. వాడి ముఠాఅందరు అంతలో గొల్లుమన్నారు. యెరగరు పాముల యెరికిలవాళ్ల కలవరాలు. నాకు హత్య జరుగబోతోందని దేహంకంపించి ఒళ్ళు తెలియక గభాలున ఆ పాములవాడిని కావిలించుకొని పట్టుకుని నీపిల్లకు టీకాలు వేయను రాబాబు చంకలోకి యెత్తికోరాఅని బతిమాలి వాడిని సమదాయించేటప్పటికి ముచ్చమటలు పోసి శలప్రాణం తోకకు వచ్చినట్లయింది. చివరకు వాడు శాంతిబొంది అయ్యా! అడవుల్లో గుట్లలో యెండలో వానలో తిరిగేవాళ్ళం మమ్మల్ని ఆతల్లి రక్షించాలిగాని మీ టీకాలు యేంచేస్తవి. మాకు మందులు సూదిమందులు యెట్లావస్తవి. యేదో ఆకులు పసరులు పచ్చి

కాయలు తిని జబ్బులు నయంచేసుకుంటూ యీ వూరినుండి ఆ వూరికి, అక్కడనుంచి యింకొక చోటికి తిరిగే వాళ్ళకు మాకు టీకాలు యెందుకుబాబు! అవన్నీ తమవంటి టీబ్బుగల వాళ్ళకు నూదిపోటులు. మందులు తినేవాళ్ళకు కావాలిసుంటుందికాని మాకువద్దు. వాటిమీద మాకు నమ్మకంకూడా లేదు. అటువంటిమమ్మల్ని యెందుకు చంపుతారు. మాబీదవాళ్ల మీదదయ గలిగి యిట్లాదయచేశామంటున్నారే! చూడండి ఆ పాకలో దిక్కు మొక్కు లేకుండా దగ్గుతో చస్తున్న ఆ ముసలాడికి మందిప్పించి పుణ్యం కట్టుకోండి అంటూ మొత్తుకున్నాడు ఆపాముల వాడు. వాడిగోడవ వింటూ నిలబడ్డ నన్ను జూచి జవాను నవ్వుతూ యీ తొత్తుకొడుకులు యిట్లాగే ఒంటరిగావస్తే యేడిపిస్తారండి అంటూ చెప్పాడు. పాములవాడి మాటలు నామనస్సును కదల్చటంచేత అందులోని యథార్థం చర్చించటం మొదలుపెట్టా. నాకు యెప్పుడు చూచినా ఒకటే శంకతోచేది. యీటీకాలచట్టం 150 ఏళ్ళనుంచి గట్టి పట్టుదలతో అమలులో వుందిగదా! నిజంగా యీటీకాలేయింత కాలమునుంచి ప్రజలకు మంచి చేస్తున్నట్లయితే పిలవకుండానే తమంతట తామే తమపిల్లలను తీసుకువచ్చి టీకాలు వేయించుకొని యెందుకు సంతోషిస్తూ పోరు? పైగా టీకాలవాళ్లంటే యింతఅసహ్యమెందుకో? చిన్నతనంలో టీకాలవాళ్లు వచ్చారని నన్ను మాయమ్మ పిడకల గుడిశలో దాక్షోపెట్టిన విషయంకూడ జ్ఞప్తికివస్తుంది. ఇదంతా విచారించుకుని నూటికి 90 మంది బలవంతంగా తప్పని సరిగా భగవంతుడాఅని వేయించుకుంటున్నట్లుతోచింది. టీకాలునిజంగా మేలుచేస్తున్న పక్షంలో డబ్బియినాయిచ్చి వేయించుకోవలసిన సందర్భములో యింటికివచ్చి వూరికే వేస్తామండి బాబు అంటే యీ ప యింత అసమ్మతెందుకో? అని తోచేది.

గవర్నమెంటువారు యీ 40, 50 సంవత్సరాలనుంచి యీ చట్టం అమలులోపెట్టి టీకాలవల్ల మశూచికంరాదని గొప్పప్రచారం నయాన భయానచేశారుగదా! యీరోజుసపసలైటూరిలో కైనాపోయి మీ యిష్టమువస్తే వేయించుకోండి లేకపోతేలేదు. అని వాక్సినేటరు సంచి విప్పి కూర్చుంటే నూటికి యిద్దరివంతునయినా టీకాలు వేయలేడని నా యనుభవాన్నిపట్టి పందెమేసి చెప్ప సాహశిస్తున్నా. చదువు సంధ్యలేనివాళ్లు జ్వరాలువస్తవని భయంపడుతారని సమాధానం చెప్పబూనుకుంటే పోనీ చదువుకున్న తమ విద్యుక్తాలను గుర్తెరిగి లాభనష్టాలు యెరిగున్ననాగరికుల్లో, వాళ్లను ఒత్తిడిచేయకుండా వారి యిష్టానుసారంగా నూటికి యింతమందికి వేయగలుగుదునని బదులుసమాధానంకోసం యెదురు చూస్తున్నా. ప్రజల్లో బహుమందికి టీకాలలో నమ్మకంలేక యింత అసమ్మతిగావుండి మాకు వద్దు కుయ్యో మొర్రో అని గోలపెడుతూవుంటే మశూచికం రాకుండా కాపలా కాస్తామరో అంటూ యింత పీకులాడటం యెందుకో.

నా యనుభవంలో టీకాలువేసినందునలన గలిగిన విపత్తులను మనవిచేస్తున్నా.

సాధారణంగా పెద్దకుటుంబాలవారిపిల్లలకు చదువుకున్న వారిపిల్లలకు టీకాలు వేయటమంటే అతి భయంగావుండేది. టీకాలువేస్తే పొక్కు రూపాయి వెడల్పున కండకట్టడం, ఒళ్ళంతా పెల్లడం, చేతిమీద, తలలో కురుపులులేవటం తరచుగా సంభవించేవి. వీటిలో యేబాధగలిగిన సార్ - సార్ అంటు హెల్తాఫీసరుదగ్గరకువెళ్లి పిల్లలనుచూపించి రిపోర్టు చేసేవారు. ఆయనగారు మమ్మల్ని

పిలిపించి వాళ్ళయెదుట బాడ్‌వేక్సినేషన్ (Bad Vaccination) అజాగ్రత్తగాచేస్తారు అనేవారు. వూళ్ళో యెక్కడో మశూచికం వుందని గాలి కబురువిన్నా తమ సిబ్బందితో దానిని తరి మెయ్యాలంటూ కార్లమీద బయలుదేరే ఆదు ర్దామనిషి ఆయన. ఇక ఆ స్థితిలోఉన్న పిల్లలను చూస్తే బహుకంగారయేవారు. ప్రతిసారి ఆయన బాడ్‌వాక్సినేషన్ అంటంలో వాక్సినేషన్‌బ్యాడ్ (Vaccination Bad) అని ఆయన యుద్దేశ మేమో అని చివరకనిపించింది. యింతంటూ పడ లేక ఆ పెద్దక్లాసువారిపిల్లలకు నేనువేయటంమాని మా పెద్దవాక్సినేటరు చేతికిచ్చేవాడిని. అప్పటికి యీ రిపోర్టులు తప్పేవికాదులెండి. ఇక మాల మంగ్డి యితర తక్కినజాతులకు నేను వేశేవాడిని వాళ్ళు యిటూ హెల్తాఫీసరుకు రిపోర్టుచెయ్యటం యెరగరుగాని టీకాలువేస్తే పొక్కి తత్వాలను బట్టి ఇతర దుర్గుణాలు పుట్టకమానితే ఆయన చెయ్యి చలవచెయ్యాలని, యేవయిన దుర్గుణాలు పుట్టి త్వరలో మానకపోతే వేడిచెయ్యి అని. మా వెనక దూషణభూషణాలు చేసేవాళ్ళు.

లింపుపోస్టాఫీసు నుంచి రావటంతోనే మూతలిప్పి మొదట్లో టీకాలు వేయబోయేముందు నిలబడి నేను వేయబోయే టీకాలు సక్రమంగాపొక్కి నయంగావాలని, యెట్టి ఆదుర్దాలు నాకు కలగ కుండా వుండాలని యీశ్వరప్రార్థనచేసి మరీ మొదలుపెట్టేవాడిని. యథాప్రకారంగా లింపు వచ్చినది. ప్రార్థన అయింది. ఒక మాలవాడు తల్లిలేని పిల్లవాడిని యెత్తుకుని యెదురుగా నిల బడ్డాడు. వాడికి 4 యేళ్ళువుంటాయి. బాగా గుండులాగా వున్నాడా పిల్లవాడు. యెడంచేతి మీద 2 టీకాలువేశా. ఆమాలవాడు ఆపిల్ల వాడికి యింతకాలంవరకు టీకాలు వేయించ కుండా వుండటానికి కారణాలు - భార్య చచ్చి పోవటం - యిల్లు తగులపడిపోవటం - మొద లయిన వాడి వృత్తాంతం బహుజాలికరంగా వుండేటట్టు చెప్పి కొంతసేపుండి వెళ్ళిపోయి నాడు. ఆతఫాలోవచ్చిన మందు చాలాఘాటుగా యున్నట్లు ఆపిల్లవాడికి గలిగిన యాపత్తువలన గ్రహించి దానిఘాటు తగ్గించటానికి మాదగ్గర వున్న స్పిరిట్ (Spirit Alcohol) ముందు రాచి తరువాత టీకాలువేయవలసిందిగా హెల్తా ఫీసరుగారు సలహాయిచ్చారు. దానిని బట్టి రక రకాల ఘాటుమందులుకూడా రావటం కద్దేమో అనుకున్నాం. 8వ రోజున ఆమాలవాడు డిపోకు చాలా విచారంగావచ్చి. పిల్లవాడు స్పృహతప్పి వున్నాడని, టీకాలపొంగు భుజంమీదనుంచి చంకలోకి రాత్రి దిగిందని పొద్దుటికి ఆవాపు రొమ్ముమీదికి పాకిందని చాలా జ్వరంతోవుండి మూసినకన్ను తెరువకుండా యున్నాడని చెపుతూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. మొదట్లో వాడి బీదజీవిత వృత్తాంతాన్ని విని ఆదరించటం చేత నాయందు భక్తితోవుండి ఆఫీసరుగారికి నా బిడ్డను చూపిస్తే మీకేంమాట వస్తుందోనని ఆసుపత్రికి వచ్చి మందు వేయించుకుని యింటికి తీసుకువెళ్ళి గంజికాచుకొని యీ సంగతి తమతో మనవిచేసుకుందామని వచ్చానండి. తల్లి చచ్చినవాడని ఒకదారిని ఒకడని వాడిని చేతుల్లో పెట్టుకొని పెంచుకుంటుంటే వాడికీ గ్రహచారం యిట్లా మూడిందండి. ఏంచేస్తాను ఆసుపత్రి డాక్టరుగారు యీ జబ్బు టీకాలు వేయటంచేత వొచ్చిందనీ, యీ వాపు రొమ్ము మీదికి పాకటంచేత ప్రాణప్రమాదంకూడా కలుగవచ్చునని చెప్పారు. అందుచేత భయం పుట్టి తమరేదయిన సులిసూత్రం వైద్యం చెప్తారేమోనని మాప్రక్క గుడిశలవాళ్ళకి వాడిని వప్పగించి వచ్చానండి అయ్యా. అంటూ

నిలబడ్డాడు. నాకు నవనాడులు కుంగిపోయి కొంత సేపటికి మనస్సురాయి చేసుకుని చేతులార హత్యచేశాను గాబోలురా భగవంతుడా యని వాడిని వెంటనే వెళ్ళి బండిమీద ఆపిలవాడిని తీసుకురమ్మని 0-3-0 యిస్తూ యింతలో హెల్తాఫీసరువస్తాడని ఆయనకుచూపిస్తానని చెప్పి పంపించా. హెల్తాఫీసరువచ్చారు. ముప్పాతిక గంట తరువాత బండిలో మాలవాడు పిల్లవాడిని తీసుకు దిగాడు. తండ్రి చెప్పినట్లుగా పిల్లవాడు మన లోకంలో లేకుండా వున్నాడు. నాకాళ్లు చల్లపడి ముందు ప్రాణోపద్రవంగావుంది గాబట్టి ఏ మయినా సరేనని హెల్తాఫీసరుగారి ఆఫీసులోకి తీసుకువెళ్ళి పిల్లవాడి దుస్థితి చూపించా. చూస్తేనే చాలాఅజాగ్రత్తగా వేశావు హోప్లెస్ (Hope less) బ్యాడ్ వాక్సినేషన్ (Bad vaccination) అంటూ మామూలుపదం మొదలుపెట్టారు.

శుభ్రంగా చెయ్యి సబ్బుతో కడిగించా - మంచి తువ్వాలుతో తుడిపించా - లాన్సెట్ బాగా వేడి నీళ్లలో కాచా. (Sterilisation) - కావలసి నంత మందే వేసి (మామూలు మాదిరిగా) యెక్కువనెత్తురు రాకుండా (Bleedings) లాంసెట్ త్రిప్పా - మందు రక్తంలో ఇంకేవరకు వుంచా. ఇంకా (Bad vaccination) అంటా డేమిరా దేవుడా అని విచారించుకుని ఇప్పుడేమి చేయమంటారు అన్నా. ఆవాపుమీద ఏదో ప్లాస్టర్ (Plaster) వేసి - (ఫోమెంటేషన్) కాపటంపెట్టి ఫ్లానల్ గుడ్డచుట్టి వుంచాలి అని చెప్పుతూ యీ కేసువిషయం ప్రతిరోజు నాకు యేస్థితిలో వుందో రిపోర్టు యియ్యాలని కోపంతో నాకు ఆర్డరువేసి పంపారు. సాయంకాలమువచ్చి చూస్తానని చెప్పి వాడిని బండిమీద యింటికి పంపించా. మా రెండవ వాక్సినేటరు యెవరికర్మం వాళ్లది మన మేమి భాద్యులమా అంటూ వేదాంతం ప్రారంభించాడు.

సాయింకాలం బోరిక్ మందు తీసుకు బయలు దేరివెళ్లా. గుడిశలో పిల్లవాడిని ముందుపెట్టుకుని రాముడా, దేముడా అంటూ కూర్చున్నాడు ఆ మాలవాడు నన్ను చూచి. కొంత స్థిమితంతో బాబూ అట్లాగేయుండండి, తమరు వచ్చిన తరువాత కాపటంచేద్దామని యేమితోచక కూర్చున్నానన్నాడు. వెంటనే గుడిశలోదూరి వాడి స్థానాన్ని ఆక్రమించి నీవుపోయి యిన్ని చితుతులు యేరుకువచ్చి నిప్పుచేసి నీళ్లుకాచు, అంత వరకు నేను యిక్కడ కూర్చుంటానని చెప్పి వాడిని పంపి పిల్లవాడికి నయంకావాలని దేముడికి మొక్కుతూ కూర్చున్నా. ఆ పిల్లవాడేకనుక చచ్చిపోయి నట్టయితే నాచెయ్యి వేడిచెయ్యని ఆ గుడిశలలోవాళ్లు ఒకళ్ళయినా మనస్ఫూర్తిగా వాళ్ళపిల్లలకు నాచేత టీకాలు వేయించుకోక ఆ యయ్యగారితో వేయించండి (మా రెండవ వాక్సినేటరు) మా అందరి పిల్లలకు ఆ యయ్యగారే యేశారంటూ మొదలు పెడతారుగదా, యెట్లాగో యికముందు అంటూ ఆలోచిస్తూ కూర్చున్నా. యింతలో పడతతో వేడినీళ్లు పట్టుకువచ్చి ప్రక్కన పెట్టాడు. అందులో బోరిక్ మందువేసి దూదితడిపి కాపటం మొదలుపెట్టా. అరగంట సేపయింది. యింతలో ఒక పెద్ద విరోచనమయి ఆ గుడిశలో నిలవలేనంత దుర్వాసన వేశింది. బయటికివెళ్లి కూర్చున్నా. తండ్రి స్థలం బాగుచేసి నన్ను పిలిచాడు. నేను యింటినుంచి పట్టుకువెళ్లిన ఒక గుడ్డ వాడిరొమ్ముచుట్టుచుట్టి పిన్నీసులుపెట్టి పడుకోపెట్టి వాడికి ధైర్యంచెప్పి 7 గంటలు వేసింతరువాత యింటికి బయలు దేరా. రాత్రిఅంతా అదేకలా. ప్రొద్దున్నే 6 గంటలకు ఆదుర్దాతోవెళ్లి చూతునుగదా

తండ్రి కొంచెం స్థిమితంగా బయట కూర్చుని పాపం వచ్చారా మీ ధర్మాన పిల్లవాడికి గుప్టి వచ్చిందండి లోపల చూడండి అన్నాడు. నాకష్టం అక్కరకు వచ్చిందేమో అని సంతోషిస్తూ లోపలికిపోయి చూస్తే ఆ కుర్రవాడు అటూ యిటూ కదులుతూ ఏడుస్తున్నాడు. మళ్ళీ కాపటం పెట్టించి ధారకం నీళ్లుతప్ప మరేమి యివ్వవద్దని చెప్పి యీ వార్త మా ఆఫీసరు గారితో చెప్పా. ఆయన సంతోషించి సాయం కాలం నా వెంటవచ్చి ఆ పిల్లవాడినిచూచి గండం తప్పించుకున్నాడనిచెప్పి వెళ్ళిపోయారు. 2 రోజులకు 4 రోజులకు ఒకసారి పోయిచూచేవాడిని. పాపం వాడు నెలరోజులకు తేలుకున్నాడు. నా మొక్కులుకూడా తీర్చుకున్నాడు. ఇటువంటియుపద్రవాన్ని యింకొకటి మనవి చేస్తా. ఒకావిడ టీకాలు వేయించుకోటానికి 3-4 యేళ్ళున్న మనవరాలిని యెత్తుకొచ్చింది. పిల్ల బొద్దుగాను పచ్చగాను వుంది. మామూలు ప్రకారం టీకాలు వేసిపంపించా. పాపం నాల్గు రోజులయేటప్పటికి ముఖంమీద తలలో వంటి నిండ నల్లటిబొడెలు పడి పిల్ల చాలా అంద విహీనమై యెత్తుకోవటానికి వీలులేకుండా పోయింది. వెంటనే ఆపిల్లను తాతముత్తవలు హెల్తాఫీసరుకు తీసుకువచ్చి చూపించారట. అట్లా వొళ్లంతా పొక్కటానికి కారణం “ఆపిల్ల రక్తంలో తల్లినుంచి గలిగిన (Syphilitic poison) సిప్లిటిక్ విషం వుండివుంటుందని టీకాల మందులో రక్తంచేరినందువలన యీ రెంటికిసంఘర్షణ కలిగి యిట్లా పొక్కిందని. అప్పుడక్కడయున్న నా సోదర ఉద్యోగులతో చెప్పారట. తీరావిచారిస్తే ఆపిల్లతల్లి అత్తవారి వూరిలో స్వేచ్ఛగా విహరిస్తుంటే భర్త ఆ అమ్మాయిని పుట్టింటో దింపివేశాడట. ఆయమ్మాయి యెక్కడో వుండగా యీపిల్ల పుట్టిందని మాజవాను చెప్పాడు. యేమయితే నేమి ఆపిల్ల విషరక్తం విషయం తల్లితండ్రులు ఒప్పుకుంటారా? ఆపిల్లకు టీకాలు వేసి ఆస్థితిలోకి తెచ్చినందుకు నన్ను తిట్టిన బూతులు యింతంతకాదని విన్నా. జవాను ఆప్రాంతానికి వెళ్ళితేసరి; వాడిని పిలిచి కూర్చోబెట్టి తల్లి, తాత, ముత్తవలు నన్ను అడ్డమయినవి తిట్టి దుమ్మెత్తి పోసేవాళ్లట. ఆభయంచేత ఆప్రాంతానికి పోవటం మానుకున్నా. యిప్పటికి ఆరోడ్డు చెపితే ఆసంగతి జ్ఞాపకం వస్తుంది.

ఒక అమీనాబిడ్డకు టీకాలువేస్తే చంటిబిడ్డ గుణంబుట్టి చచ్చేస్థితికి వచ్చి ఒకరాత్రి బండి క్రింద పెట్టుకు కూర్చున్నారు. తిరుగుతూ వున్న పిల్లకు టీకాలువేసి చంపచూచారంటూ దీని కేంచెపుతావని హెల్తాఫీసరు గొంతికాయ మీద కూర్చుని ఆపిల్లచస్తే మిమ్మల్నందరిని కోర్టుకు లాగుతానని ఒట్టుపెట్టుకున్నాడా అమీన. ఆపిల్లతల్లి, వాళ్లతోపాటు ఆరాత్రంతా మేము జాగారణ. హెల్తాఫీసరుగారు కూడా యేదోమందు కొనుక్కొచ్చి యివ్వమని డబ్బు కూడా యిచ్చారుమాకు. అన్నిటికి దుర్గవుం దిగా; తెల్లవారేటప్పటికి యీ తవ్వాయి తప్పి పిల్ల బతికింది.

మాలో యింకొక వాక్సినేటరు—హస్తసాముద్రికం చెప్పుకుంటూ పొట్టతిప్పలకు పూనానుంచి వచ్చిన ఒక బ్రాహ్మడిబిడ్డకు వద్దు మొర్రో అంటుంటే పట్టుకు టీకాలు వేశాడు. రెండో రోజున తల తిరుగుడుపుట్టి పిల్లచచ్చింది. చైర్ మన్ గుమ్మంలో ఆపిల్లను పారేసి యేంచెపుతావంటాడు ఆపూనాబ్రాహ్మడు. చైర్ మన్ వాక్సినేటరును పిలిపించి రుద్రుడయి యీవూరి పిల్లల జనాభా యీవిధంగా తగ్గించటానికి పూనుకు

న్నావా అంటూ కోపంతో నీ ఉద్యోగానికి రాజీనామా ఇస్తావా? ఆపిల్లతో పాటు చస్తావా? అంటూ యీాయన కూర్చున్నాడు (వెంటనే రాజీనామా ఇప్పించారు లేండి).

యీపై హంశాలన్నీ పపులంగా తెలుసుకోవాలంటే యీపత్రికా సంపాకులకు వ్రాయండి. యీఆదుర్దాలకు నాగుండె చాలదనిగాబోలు నాకు యింతకంటె హాయయినది జీతభత్యాలు యెక్కువగల యింకో ఉద్యోగం భగవంతుడు ప్రశాదించాడు.

ఒక సలహా. వూళ్లో మశూచికం వుందని విన్నప్పుడు, మన పిల్లలకు పెద్దలకు జ్వరంతగిలిందంటే మశూచి వస్తుందని విచారిస్తూ కూర్చోక మరునటిరోజు ఉపవాసంవుంచి పొద్దున సాయింత్రం యెనిమాచేసి మలవిమోచనం చేయించండి మరునటిరోజుకూడాను. యేవిధానయితే నేమి మలకోశం శుభ్రంచేయించండి. అట్టి పిల్లవాళ్లకు మశూచికం తగులనే తగులదు. అధవా వచ్చినా దేహంమీద కొన్ని పొక్కులుమాత్రం పుట్టి, చాలా తేలికగా మాత్రం వుంటాడు. అట్లాకాక పూర్తిగ బలువుగాపోసిందని రుజువుచేస్తే యీ ప్రకృతిసేవకు స్వస్తిచెపుదాం. ఆజబ్బులో వున్నప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు, ఆహారం, ప్రకృతి పుస్తకాలుచదివి, శిబిరాలకు హాజరయి నేర్చుకోండి. యీ ప్రకృతి సూత్రాలు గమనించి ఫలరసాదులతోను (కుండ పచ్చళ్లు, వూరగాయలు లేకుండాను) యెవరయితే జీవనం గడుపుకుంటారో అటువంటివాళ్ళు యే వ్యాధికి భయపడనవసరము లేదని నాయావజ్జీవితం సాటిస్తా. యింకా యేమయిన వచ్చేసంచికలో వ్రాసుకుంటా! యిప్పటికి శలవు యిప్పించండి.

ఓం తత్సత్



ప్రకృతి-ఉద్యమాభిమానులారా! టీకాలనుగురించి మేము చేయబోవు ప్రచారమునకు కరపత్రములను చిన్నపుస్తకములను గోడనోటీసులను అనేకములను అచ్చువేయించవలసియున్నది. ప్రచారకులు ఊరూర తిరిగి ఉపన్యాసములు చెప్పవలసియున్నది. అనేక సభలు యేర్పాటు చేయవలసియున్నది. ఉత్తరప్రత్యుత్తరముల జరుపవలసియున్నది. పత్రికలలో ప్రచారముచేయవలసియున్నది. ఈ కార్యభారమంతయును నెరవేర్చుటకు ధనము, ప్రోత్సాహకుల అభిమానము, ఊరంతను మీటింగులయేర్పాటుల చేయుట మొదలగు అనేక సహాయములు కావలసియున్నవి.

ప్రతివ్యక్తియు బాధ్యతవహించి తమ రేవిధమైన స్వల్పసహాయమైనను చేయగలరో వెంటనే ప్రకృతి-కార్యాలయము - బెజవాడకు తెలియపరచుడు.

సంపాదకుడు.

# మశూచికము

బొ. సుందరగోపాలరావుగారు

ఈ వ్యాధి చెన్నపురియందు అధికముగా ప్రబలుచున్నట్లు పత్రికలవలన తెలియుచున్నది. దీనికి అలోపాతిచికిత్సలో టీకాలు వేయుటకన్న చికిత్స లేదు. ఈ టీకాలు వేసినవారికి సయితము యీ వ్యాధి సోకుచునేయున్నది. అలోపాతి సాధనము తిరిగి తిరిగి టీకాలు వేయుటనే చెప్పుచుండును. టీకాలు వేయుటచే మరణముల సంఖ్య తగ్గించుటలోగాని వ్యాధిని అంటకుండ జేయుటలోగాని యేవిధముగాను సాయపడుటలేదని అనుభవమువలన మనకు తెలియుటయేగాక పట్టపరీక్షలో ఆరితేరినఅనుభవశాలురగు పెక్కు వైద్యశిఖామణులు గ్రహించి పాశ్చాత్య పరిపాలనా సంఘముల నొప్పించి ఇంగ్లాండు మొదలగు దేశములలో నిర్బంధ టీకాలవిధాన చట్టమును తొలగించియున్నారు.

ఇండియాలో కాంగ్రెసు పరిపాలనలో ప్రజలున్నను, నిరుపయోగమగు టీకాల నిర్బంధమును తొలగించుకొనుటకు కాంగ్రెసు ప్రభుత్వమునకు మొరలిడుకున్ననూ నిష్ప్రయోజనమగుచున్నది. ఈ విషయములో సత్యము ప్రజలే గ్రహించి టీకాలవిధానములో నమ్మకముతో తృప్తిజెందక జ్వరము రాగానే దేహమునకంతా ఆవిరిపట్టి శ్రీ కూనేగారి కటిలింగస్నానములు చేయుచు జ్వరము తీవ్రముగా నుండిన పొత్తికడుపునకు మట్టి పట్టీలు వేయుచుండిన మూడురోజులలో తాపము తగ్గి పొక్కులు తేలి చిలకబారిపోవును. పొక్కులు చిలక బారువరకూ ప్రతినిత్యము ఆవిరి పట్టి శిరస్నానముచేసి తొట్టెస్నానములు కటి స్నానములు చేయువలెను. జ్వరం తీవ్రముగా నుండిన ఒకకటి స్నానం రెండు లింగస్నానములు చేయువలెను; ఆహారము ఏవిధమైనది లేకుండుట మంచిది. ఆకలియున్న జ్వరము తగ్గువరకు పండ్ల రసమిచ్చి అటుపిమ్మట గోధుమజావ, మెత్తని గోధుమరొట్టె పండ్లనయిచ్చుచుండవలెను కండ్లలో పుసులుకట్టిన యెర్రబడినను తేలికరంగు నీలపురంగుగల సీసాలోని నీరు యెండలోనుంచి పోయుచుండిన కండ్లలో కాయలు పువ్వులు వేయకుండును. ఇట్టి నిరపాయమైన ప్రకృతి చికిత్సచేసికొని ధనవ్యయములేక తొట్రుపాటు లేకవ్యాధిని తొలగించుకొనవచ్చును. ఇట్టివ్యాధి గలగ్రామములలో అనుభవముగల ప్రకృతిచికిత్స చేయించువారు లేనియడల ప్రకృతిచికిత్స తెలిసికొనదగు బెజవాడ ప్రకృతి కార్యాలయమునకు గాని రాజమహేంద్రవరం నాకార్యాలయమునకు గాని మరి ఇతరప్రకృతికార్యాలయములకు గాని వెళ్ళి సంగతులనునేర్చుకొని ప్రకృతిచికిత్సలుచేసి జీవించవచ్చును. మశూచిక వ్యాధియున్న రోజులలో ఇంటఇంట వేపాకుతోరణములు ప్రతిగుమ్మమునకు కట్టవలెను. వ్యాధిగ్రస్తులున్నగదులలో వేపనూనె దీపము పెట్టవలెను. రోగికి వేపకొమ్మలతో గాలి విసరుచుండవలెను. ఆకొమ్మలతోనే యీగలను తోలవలెను. రోగిని మంచిగాలి తగులుగదిలో పరుండ బెట్టవలెను. రోగియున్న గదిలో వేపాకు ధూపములు రోజుకు రెండు మూడు సారులు వేయుచుండవలెను. మశూచికముండు కాలములో తక్కిన జనులు ప్రాతస్నానములు చేయుచు మలబద్ధము లేకుండులాగున విరోచనసాధనము చేసికొనుచు ఉద్రేకఆహారపదార్థములు మాని తేలికగా జీర్ణమగు పదార్థము భుజించుచు విస్తారముగా పండ్లను భుజించి ఈపండ్ల తూకముకు సరిగల ఆహారమును తగ్గించి తినుచుండవలెను.

# టీకాలను గురించి పత్రికాధిపతు లేమంటున్నారు!

ప్రజాభిప్రాయాన్ని పత్రికలు చెప్పుతూఉంటవి. ఇండియన్ ఎక్స్ప్రెస్ కాంగ్రెసుపత్రిక; ఆంధ్రపత్రికను మీరు యెరిగేఉన్నారు; హరిజనపత్రిక గాంధిగారిది. బెసాంటుగారి పత్రిక థియాసఫిస్టు. ఈనాలుగు పత్రికల వారు యేమివ్రాశారో మీకు తెలుస్తే ప్రజాభిప్రాయం తెలుస్తుంది. అందుకని వారివారిఅభిప్రాయాలతో నుండిన సంపాదకీయాలు ఇక్కడ చేర్చినాము.

—సంపాదకుడు.

## టీకాల నిర్బంధం

(ఇండియన్ యెక్స్ప్రెస్ 1-12-37)

లండన్ టీకాలప్రతికక్షసంఘమువారు బొంబాయి గవర్నరుగారికి టీకాలనిర్బంధవిషయంలో వ్రాసిన లేఖమరియొకచోట ప్రచురింపబడినది. బొంబాయి గవర్నమెంటువారిచే పిల్లలకు మరుటీకాలు (Revaccination) వేయవలసినదిగా పెట్టబోవు చట్టమును చర్చించువిషయము సకాలములో మాకు వచ్చిచేరినది. ప్రజారోగ్యవిషయములలో వైద్యుల ప్రమేయమేగాని వైద్యమెరుగనివారిసిద్ధాంతములు వినములని వైద్యులు చెప్పవచ్చును. అట్లాగయితే టీకాలమీద వ్యతిరిక్త ప్రచారము గొప్ప ఘనవైద్యులమూలముననే తేబడినది. ఎట్టియవివేకిగాని పలుకలేనివిధంగా "లండన్ ట్రాపికల్ మెడిసిన్ అండ్ హైజిన్" స్కూలుప్రొఫెసరుగారును గొప్ప గణితశాస్త్రవేత్తలునగు మేజరుగ్రీన్‌వుడ్‌గారొకానొకవైద్యుల కాన్ఫరెన్సుసభలో, బహిరంగముగా టీకాలస్థాపకుడగు జెన్నరు గొప్పమోసగాడని నిరూపించిరి. తమకు గలిగిన యనుభవాలనుబట్టి సర్వప్రపంచము టీకాలను నిరసించుచున్నది. కొన్నికారణములనుమాత్రమే చూపుచు లండన్‌లీగువారు బొంబాయిగవర్నరుగారికి తమ మనవి నందజేసిరి. ప్రపంచములో మెక్సికోలో నున్నంత టీకాలనిర్బంధ మింకెక్కడనులేదు. అచట సంభవించు మితిలేని మశూచిమరణములు గూడ యింకొకచోటలేవు. టీకాల నిర్బంధము లేనట్టియు పుట్టిన పిల్లలలో 3 వ వంతున టీకాలు వేయనట్టి ఇంగ్లాండులోను, వేల్సులోను మశూచి అంతరించింది. 1932 సం॥లో నిర్బంధమరుటీకాల చట్టం (Revaccination) అమలులో పెట్టిన మదరాసు రాష్ట్రములో మశూచివలన మరణాలు అంతకుపూర్వంకంటె నాల్గురెట్లు పెరిగినవి. అనుభవాలకు సిద్ధాంతాలకు వ్యత్యాసం గలిగినప్పుడు సిద్ధాంతం తోసిబుచ్చటం ప్రాజ్ఞుల లక్షణం. టీకాలయందు నమ్మకంకలవాళ్లని అరికట్టటం న్యాయంగాదు; కాని టీకాలలో నమ్మకంలేని వాళ్లనుమాత్రం తప్పక విడిచి వేయాలసిందే. నిర్బంధటీకాలుచట్టం సాగించటానికి తావులేదు.

## విసుగుపుట్టే టీకాలగొడవ

(హరిజన పత్రిక)

ఇంతకుముందు శ్రీమతి సోఫియా వాడియాగారి టీకాలమీద వ్యాసం ప్రచురించాము. దానికి తగిన లెక్కలు అంచనాలు మంచి కట్టుదిట్టంగా వున్నవి. టీకాలపక్షం వాదులాడేవారికి యీటీకాల నిర్బంధం తీసివేయాలని యీ లెఖ్ఖలు చూపగలవు. శ్రీమతి వాడియాగారడిగిన ప్రశ్నలకంటె సులభమయిన యీ హంశాలుచూడండి. (1) ఫ్రాన్సులోను, యిటలీ, స్పెయిన్, పోర్చుగల్, బెల్జియం, నార్వే, రష్యా, టర్కీస్థానములలో నిర్బంధ టీకాలచట్టంలేదు (యన్‌సైక్లోపీడియా బ్రిటానికా 11 వ సంపుటం) (2) ఒకసారి మశూచికంవస్తే మరల పోయదనే హంశము నిర్వివాదము. (3) ఇంగ్లాండులో నయినను 1898 సం॥రపు చట్టము ప్రకారం తమ శిశువుల ఆరోగ్యం టీకాలవలన చెడిపోతుందని భయముంటే విశ్వాసచట్టంక్రింద టీకాలువేసుకోటం మానుకోవచ్చును. అట్లా 1935 సం॥ము

సర్టిఫికెట్లు పుచ్చుకుని మానుకున్న వారి సంఖ్య 299,800; అంటె సగానికి సగం వేసుకోలేదు. (The vaccination Inquirer) (4) ఇంగ్లాండులోను వేల్సులోను గత 32 సం॥రాలలోను 5 సం॥ లోపలి వారు 107 మంది బాలురు మశూచితో మరణించినటులును, 279 మంది టీకాలు వేసినందున మరణించినటులను గలదు. (గవర్నమెంటు వారి లెక్కల ననుసరించియే పై పత్రిక ప్రకటించియున్నది.) (5) వైద్యులును వైద్యులుగానివారును యింకా సర్ ఆర్థర్ న్యూస్‌హోంగారును మరియు సర్ లూ నార్డ్‌రోగర్సు గారును ఇంగ్లాండులోను, హిందూ దేశములోను మశూచి యటువంటి యెత్తిపోతలుగా వచ్చు వ్యాధులకుభూమిలోపారునీరు (Ground water) కు సంబంధముగలదని రుజువుచేసియున్నారు.

ఆ పై చర్చలనుబట్టి టీకాల నిర్బంధం మాత్రం తీసివేసి చట్టమును అనుసరించిపోతూ రోగిని ఏకాంతంగా (Isolation) వుండేటట్టును మైల వ్యాపించకుండా నశింపచేసేటట్లున్ను (Disinfection) నిష్కర్ష చేస్తూ మశూచి యెత్తిపోతకు కారణమయే పరిసరాలను నశింపచేయటానికి కాంగ్రెసుమంత్రులు బూనుకొనవలెను. 1896 లో బహిరంగపరచిన రాయల్ కమీషన్ వార రిపోర్టులుకూడా "మశూచి తగ్గించటానికి వాక్సినేషన్ కాక యింకా యితరముగాయున్న మార్గా లేమిటో వాటిని టీకాలస్థానే యెంతవర కుంచాలి" అనే రిఫరెన్సుమీద కమీషనువారి మిగతా హంశములమీద నిర్ధారణయిచ్చిన యెన్‌సైక్లోపీడియా బ్రిటానికా కర్త తేల్చక పోవడం విచారకరం. డాక్టర్ రాజన్‌గారు, గిల్డర్ గారును యీ రిపోర్టునురల పరిశీలించి మశూచి నాపటానికిగల యితర మార్గాలను మనఃపూర్తిగా విచారించవలెను. వ్యాధిని దాని సహజమగు తీవ్రతతో రానివ్వటం దానికి సరియయిన చికిత్స చేయించుటకంటె యింకొక మార్గములేదు. నిష్పక్షపాతబుద్ధితో మశూచి తగిలిన వారి సంఖ్య ఒకసారి మశూచి పోసినతరువాత యింకా పోసేది పోయ్యింది మొదలయిన మరణపుటంచ నాలు బాగుగా పరిశీలించి ప్రజలయెదుట పెట్టవలెను. ఆరోగ్యవిధులను పెంపొందించు విషయంలో (Sanitation) కఠినచర్య తీసికొంటూ భూమిలోని నీటిప్రవాహముల బాగుకొరకు ప్రయత్నించవలెను.

బొంబాయి మునిసిపల్ కవున్సిలు వారిచే సవరణ చేయబడి ఏకగ్రీవముగాను హృదయపూర్వకముగాను ఆమోదింపబడిన బిల్లు ముఖ్యముగా మలేరియాను ఆపుటకు సంబంధించినదైనను మశూచి వ్యాధినిగూడ నాపుటకుగల కొన్నినియమము లందున్నవి.

## టీ కా ల భ్ర మ

(థియాసఫిస్టు పత్రిక)

బొంబాయి రాష్ట్రములో రెండవసారికూడా టీకాలు వేయించుకు తీరవలసిందనే నిర్బంధ చట్టం విషయంలో కొన్ని యడ్డంకులు చూపుతూ లండన్ జాతీయ టీకాల ప్రతికక్షి సంఘము వారు బొంబాయి గవర్నరుగారి కొక మనవి పంపిరి.

1. నిర్బంధటీకాలచట్టము, మరుటీకాలచట్టము (Revaccination) బహుపట్టుదలతో సంచారముచేయుచున్న మెక్సికోలో ప్రపంచకములో మెచ్చుటలేని మరణసంఖ్య యగుపించుచున్నది.

2. టీకాలపీడలేని ఆస్ట్రేలియా, న్యూజిలండ్ లలో మశూచికం అంతరించి పోయింది.

3. గడచిన ముప్పయిసంవత్సరాలనుండి సగానికి

తక్కువగా వేయబడ్డ పిల్లలుగల యింగ్లాండు దేశములో మశూచికం మాయమయింది.

4. టీకాల పీడ వలన యితరరోగములు సంక్రమించి జీవితహాని గలుగవచ్చును.

ఈ సంఘమువారికికూడా టీకాలవల్ల గలిగే చెరుపు చూపించటానికి లెక్కల ఆధారము వుంది. టీకాలకొరకు వాడబడుమందు జబ్బుది కాదని హామీ నివ్వలేక పోవటమేకాక టీకాల వలన గలిగిన మరణాలకు సమాధాన మీయ లేని విషయమటుంచి - టీకాలు వేయించుకోని ప్రజలలోకన్న టీకాలువేయించుకున్న వారిలోనే మశూచివలన మరణాలు యెక్కువగా యున్నటుల అంచనాలుగలవు. ఇంకా యీ టీకాలువేయుటవలనగలుగుచున్న వ్యాధులపట్టీ జీర్ణకోశములలోను, ప్రేగులలోను బాధలు, మేహవ్రణములు, వెన్నుపాము బిగదీసుకుపోవుట శిరోవ్యాధులు - మొదలయినవాటివలన అసలు మశూచికంకన్న 5 రెట్లు మరణములు వృద్ధి అయినవి. టీకాలు వేసినందువలన పసితనంలో పక్షవాతంవచ్చిన ఒకరోగికూడా గలడు. ఇంగ్లాండులోను, వేల్సులోను 1935 సం॥లో మశూచికమువలన మరణములు లేవని టీకాలు వేసినందువలన 8 మరణములు గలిగినటులును ఆరోగ్యశాఖ మంత్రిగా రొప్పుకొనుచున్నారు. వైద్యమహాశయులలోగూడ పురాతనంగా వస్తువున్న గుడ్డినమ్మకాల్లో పడిపోయేవారు లేకపోలేదు. కాని కొందరు విడబడ్డారు. 1935 మే 30 వ తేదీన విక్టోరియా ఆస్ట్రియాకు ఆరోగ్యశాఖ మంత్రియైన డాక్టర్ హారిస్‌గారును ఇంగ్లాండులోని ప్రిన్సుఆఫ్‌వేల్సు హాస్పటల్ (Prince of Wales Hospital) కు ప్రధానవైద్యులైయున్న డాక్టరు హాడ్జిగారును బహిరంగంగా యీటీకాలు అనారోగ్యకరమును అపాయకరమునని సెలవిచ్చియున్నారు.

1883 జనవరిలో దివ్యజ్ఞానపత్రికలో (IV 92) బ్లావడ్‌స్కీగారు హిందూదేశీయులమీద నున్న నిర్బంధటీకాలచట్టమునుగురించి విచారించుచూ కేవలము హైందవులకే వర్తించియు మనకందనివిగా నున్నను హైందవవిజ్ఞానమును నశింపచేయు యీ నూతన సిద్ధాంతములను ప్రతి దివ్యజ్ఞానియు యెదుర్కొనవలయును.

ఈ టీకాలపద్ధతిమీద ఆమెకు యెంత నిర్లక్ష్యమో అంతకునాలుగురెట్లు దివ్యజ్ఞానసిద్ధాంతమే నిరసించుచుండును. పశుహింసను గూడ అసహ్యించుకొనును. రక్తములోనికి మందెక్కించు చికిత్సలన్నియు టీకాలపద్ధతిలోచేరినవే. టీకాల చీము తయారుచేయటం జంతుకుటుంబంమీద జరుపు దారుణకృత్యం. ప్రకృతివిరుద్ధముగా అట్లుతయారుచేయుట యుపద్రవము కలిగించుటయే. దుర్భిణీయంత్రమునకు గాని కనపడని క్రిములు మనకు తెలియబడకనే శరీరంలో యుండవచ్చును. ఆదశలో యున్నప్పుడవి అపకారులుగా యుండకపోయినను యితర దేహంలో గాని యింకొకదశయందుగాని ప్రాణాంతకముగా వచ్చును. వ్రణముపుట్టుటకు కారణములు యింతవరకు యిదమిద్ధమని తేలలేదు. కాని దేహంలోని అన్యపదార్థం వెలువరించుకు పోవటానికి ఆ వ్రుండునే చూచుకుంటుంది. వ్రణముగూడా యీటీకాలవల్ల గలిగే రోగమే.

ఇంకొక విషయం - యితరసృష్టి మోస్తరుగా వ్యాధివుత్పత్తియి వృద్ధిల్లి క్షీణించి అంతరించిపోవటం ప్రతివారిఅనుభవంలోని విషయమే. అట్లాఅంతరించటం ఆరోగ్యనియమాలవల్లనేకూడాను యెల్లోజ్వరం (Yellow fever) చాలా

నష్టం చేసింది. మిగతా వ్రణవ్యాధులు మొదలయినవి వృద్ధిలోవున్నవి. బయటనుంచియేదో తమ దేహాల్లో ప్రవేశించి దేహారోగ్యాన్ని బాగుచేసి బల మిచ్చి రోగనివారణ చేస్తుందని ప్రజల్లోఆపోహ వేళ్ళుపాతుకుంది. కానిప్రకృతి నియమాల ననుసరించి, ఆరోగ్యవిధులననుసరిస్తే అట్లాజరుగుతుంది. అదయినా మనశ్శుద్ధిమీద ఆధారపడివుంది.

ప్రజలు ఆరోగ్యవంతులుగా యుండగలందులకు వారి రక్తము విషతుల్యముగా చేయుటీకాలు యీ క్రింది హంశములచే ఖండింపబడును.

1. నిర్దాక్షిణ్యములయినవి (Cruel)
2. దేహమంతావ్యాపించునవి (Infective)
3. అసహ్యకరమైనవి (Dirty)
4. ప్రమాదకరమైనవి (Dangerous)
5. ఇంతకంటె ఆరోగ్యవంతమును తప్పకనివారణచేయు మార్గములు చేతిలోనుండగా యివి అనవసరము.

## టీకాల నిర్బంధము

(ఆంధ్రపత్రిక 14-3-38)

మశూచి నివారకముగ టీకాలువేయుట యెంతవర కుపయుక్తముగ నుండగలదో అనేకమంది వ్యాసముల పత్రికయందు ప్రకటించియుంటిమి. ఇందు నిర్బంధ ముండరాదను భావము గాన్పించును. మదాసు ప్రభుత్వమువారు టీకాలను నిర్బంధముగ వేయించుకొనవలె నని చేసిన ప్రకటనము వారికే చాల ఆశాభంగమును గలుగజేయుననుటకు సందియము లేదు. నిజముగా నది యేమాత్రమును సరసముగ గాన్పించుట లేదు. ప్రభుత్వమువారు తమకు వచ్చిన విజ్ఞప్తుల నన్నిటిని పరిశీలించి యుత్తరువు చేసినటుల చెప్పెదరు. కాని అందు దెల్పిన యంశము లన్నియును పాశ్చాత్య వైద్యపరిజ్ఞానమును విశ్వాసమును మాత్రము ప్రకటించుచున్నవి. ఈ దేశపు వైద్యు లేకారణములచేత వద్దనుచున్నారో యీ టీకాలతో నేయే క్రొత్త రోగములు వచ్చునని చెప్పుచున్నారో, టీకాలువేయు రసియం దేయే లోపము లున్నవని నిరూపించుచున్నారో యీ ప్రకటనమునందు చర్చింపలేదు. టీకాలు ఒకసారికి రెండుసార్లు వేయుటయే మశూచి నివారణ మార్గమని సంఖ్యలతో ఘంటాపథముగ జెప్పుచున్నారు. కాని అంతరాత్మ బాధించుటచేత వద్దనుకొనువారు పిల్లలను టీకాలు వేయించుటను మానిన నేరము కాకుండ చేయవలెనన్నను ప్రభుత్వమువా రంగీకరించుటలేదు.

ప్రజారోగ్యమును రక్షించుటకు మహామారి రాకుండ చేయుట కిది యొక్కటియే మార్గమని నమ్మి యీ యుత్తరువు చేయబడినది. కాని కలరా, స్ఫోటకము, ప్లేగు వ్యాధు లన్నింటికిని టీకా లున్నను యీ దేశమున మశూచికము సర్వసామాన్య వ్యాధియైనటుల భావించి బిడ్డ పుట్టిన యేడాదిలోపుగా నేల టీకాలు వేయవలెను ? అంటువ్యాధిగా ప్రబలకుండ టీకాలతో నరికట్టినటుల జెప్పవచ్చును. గాని అందుకు తగిన ఆరోగ్యపరిస్థితులను గలుగజేయుట మంచిది కాదా? అందుకు దగిన ఆర్థికపరిస్థితులు లేవని ప్రభుత్వ ప్రకటనమునందు కలదు. కావచ్చును. స్ఫోటకముతో ప్రజలు నాశము కావలెననియు కోరరు. నిజముగా టీకాలనువేయించి నష్టపడిన కుటుంబములు కలవు. ఆ కుటుంబములవారు యేవిధముగనైనను టీకాల ఆచారము తప్పించుకొనగోరుట సహజము. అందుకైనను అవకాశము కలుగజేయుట న్యాయము. ప్రభుత్వమువారు యీ యంశమును గూర్చి పునరాలోచనజేయుట మంచిది.

# వైద్యవరులేమంటారు?

## హిందూదేశములోనున్న ఆంగ్లేయ సేనల ఆరోగ్యమును పరీక్షించు డాక్టరుగారు టీకాలమీద చేసిన యుపన్యాసం.

కె. శ్రీరాములుగారిచే ఆంధ్రీకరింపబడినది

హిందూదేశములో టీకాలవలనగలిగినయనుభవములే యాటీకాలప్రతికక్షసంఘము వారిలో మమ్ములనుచేర్చినవి.

(మేజరు ఆర్. యఫ్. ఇ. ఆస్టిను యం. ఆర్. సి. యస్. యల్. ఆర్. సి. పి.)

20 సంవత్సరాలు హిందూదేశములో యింగ్లీషుసేనల ఆరోగ్యపరీక్షాధికారి పనిచేసిన మేజరు (ఆర్. యఫ్. ఇ. ఆస్టిను యం. ఆర్. సి. యస్., యల్. ఆర్. సి. పి.) గారు 1931 మే7 వ తేదీన వెస్టుమినిస్టర్ కాగ్సటల్ హాలులో జరిగిన జాతీయ టీకాలప్రతికక్ష సంఘ కాన్ఫరెన్సులో యీ క్రిందివిధముగా నుపన్యసించియుండిరి.

### హిందూదేశములో టీకాలయంటువ్యాధి :

### (Vaccination Infection in India)

1894 సంవత్సరములో నేను హిందూదేశమునకు సేనలమీద మెడికల్ ఆఫీసరుగా పంపబడితిని. మశూచిని యాపుటలో యీ టీకాలకుగల ప్రభావము ప్రపంచకములో మరిదేనియందు లేదని నాకు గట్టినమ్మకముండెడిది. మొదట్లో హైదరాబాదులోయుంటిని. యీ పట్టణము మశూచికి పుట్టినిల్లు. హిందూ దేశములోని నికృష్టపట్టణములలో నిదియొకటి అందరుని తియ్యకుండా టీకాలు వేయించుకుంటున్నా యెప్పుడు మశూచికంతో బాధపడుతూయుంటారు. అట్లాజరగటం చూస్తున్నా సేనలో మాత్రం టీకాలు వేయటం మానుకోలా. మెడికల్ ఆఫీసర్ల ద్వారా సేనలో టీకాలపోట్లు జరుగుతూ యుండేవి.

కొద్ది మాసాలక్రిందటనే టీకాలు వేసుకున్న వారిలో కొంతమంది మశూచికంతో బాధపడటం ఒకరోజున స్వయంగాచూచాను - అప్పటినుంచి టీకాలమీద యనుమానం ప్రారంభమయింది. కొంతకాలానికి నాతోటి వుద్యోగి కలనల్ ఆరంస్ట్రాంగ్ "ఆస్టిన్! నేను టీకాలు వేసినవాళ్లకే మసూచికం వస్తోందేమిటోయి" అన్నాడు. నా యనుమానానికి యింకా దోహదమయింది. చాలాకాలం క్రిందట టీకాలు వేయించుకున్న 3 నెలలకు మసూచికం పడిన ఒకయావిడ హైదరాబాదులో మాకలనల్ ఆరంస్ట్రాంగ్ వద్ద మరల టీకాలు వేయించుకుంది. మూడు నెలల తరువాత మళ్లీ మశూచికం వచ్చిమరణించింది. వైద్యవృత్తిచే జీవించేమాకు - మాకు బోధించిన సూత్రాలు అర్థంకాలేదా? లేక మమ్మన్ని తప్పుదోవకు లాగి నమ్మించారా అనేయనుమానం వృద్ధయింది. 1879లో హిందూదేశములోని సేనల మీద ప్రచురించిన హెల్తురిపోర్టుతిరగేశా. దానిని బట్టి యెత్తిపోతలుగా వచ్చే మశూచికాన్ని ఆరోగ్యమార్గాలతో తప్ప (Sanitation) టీకాలతో యరికట్టటం దుర్లభమని తోచింది. ఆరిపోర్టుకూడా యటులే తేల్చింది. యీ పైఅంశాలని ఒప్పుకుని యిట్లారిపోర్టు తయారుచేసిన యీ గవర్నమెంటు యుద్యోగులు - యింకా టీకాలకెందుకు భూమిమీద తావిచ్చారాయని యనిపించింది.

### మశూచి నిరపాయమైన జబ్బు :

### (Smallpox a safe disease)

ఈమశూచీవ్యాధియొక్క స్వరూపం అదియెట్లా వర్ధిల్లుతోంది నేర్చుకున్న తరువాత టీకాల అనావశ్యకం తేలిపోయింది. మీరు ఇంగ్లాండులో ఇంత గందరగోళం చేయుచున్న యీమశూచికం అసలు మశూచికమేగాదు. మశూచీవ్యాధిని

దర్శించాలంటేతూర్పు దేశాలకు (East) పోవాలి. ఆవ్యాధి దుర్భరస్థితిలో యుంటుంది. అట్టి రోగాన్ని కూడా సక్రమమయిన చికిత్స చేయిస్తే ప్రమాదమేమియు లేదు. అది భయంకరవ్యాధని యీ కాలమువారి యభూతకల్పనగాని యధార్థముగాదు.

ప్రపంచకములో యుపదేశికుడుగా నిలబడి ఖ్యాతివహించిన డా॥ సిడిక్ హాంగారు 1688 లో వ్రాసినదానిని వినుపించుచున్నాను. "చికిత్సా విధానాల్లో అనుభవంగడించిన వైద్యులు అనుభవంలేని మూఢవైద్యులు న్యాయంగా సంచరిస్తే ప్రజలు సుఖవంతులుగా యుండువారు. యీమశూచి భయంకరవ్యాధని ప్రజల్లో యెంత నమ్మకం గలిగివుందో యంత పరిమాణములో నాయనుభవాలవల్లగాని, పరీక్షలవల్లగాని, వైద్యులు, నర్సులు తప్పుడు సిద్ధాంతాలుచేయక, అపోహాలు కల్పించకుండాయుంటే, యింత నిరపాయమయినవ్యాధి, తేలిక వ్యాధి యింకొకటిలేదు" అదియే నాయుద్దేశంగూడానూ. సిడిక్ హాంగారు తమభావాన్ని వెలిబుచ్చిన 200 సంవత్సరంల తరువాత 1898 లో టీకాలనుగురించి యీరాయల్ కమీషన్ వచ్చింది. వేలకువేలు మశూచి రోగులను చికిత్సచేసి అనుభవము గడించిన మెట్రోపాలిటన్ ఎసయిలంబోర్డులో వున్న డాక్టరు రికెట్సుగారు, రాయల్ కమిటీవారితో నర్సులు, దాదులు, చికిత్సచేయించువారు సమర్థులయి సక్రమంగా చికిత్సచేయిస్తే యీవ్యాధి వలన గుంటలు పడతవని, కళ్లుపోతవని, యితర వ్యాధులు గలుగుతవని నాకుభయ మేమాత్రము లేదు" అని చెప్పిరట.

అంచనాలు నమ్మదగినవికావు:
(Statistics not reliable)

యిదేవిధముగా శిశురక్షణాలయపు(Children's Sanitoriums) మెడికల్ సూపరింటెండెంటుగా యున్న డాక్టర్ హెన్రీబ్లంబర్గుగారు రాయల్ కమీషనువారితో "యీటీకాలు అమలులో నుంచాలని చేసిన నిబంధనలు, ప్రచురణాలు, ప్రబోధాలే, యీమశూచికం గొప్పభయంకర వ్యాధని చాటినవి. నేను నా 40సం॥ రాల యనుభవములో యీవ్యాధిని చూచాను. దేహము మీదికి పొంగివచ్చే అన్ని జబ్బులలోను, ఆటలమ్మకాక, యీమశూచి చాల నిరపాయకరమయి అతిసులభనివారణోపాయ మయినదయి నటులుగా నమ్మితిని"

యీ టీకాల సందర్భములో చూపు లెక్కలు పెక్కుకారణములచే నమ్మదగినవిగా గనబడ లేదు. అంచనాలుతయారు చేయుటకు, అందులో అభిమానము పక్షపాతముగలవారిని నియమించుట న్యాయముగాదు. వారిచే తయారుచేయబడునవి నమ్మదగినవియునుగాదు. తాగుబోతు లెక్కలు మంచివిచారణజరిగి సక్రమముగా తయారగుచున్నవా? లేదు. డాక్టర్ బ్లంబర్గు గారిచే తనిఖీగాబడి టీకాల అంచనాలు సాధారణంగా వైద్యవిద్యార్థులకు చెప్పటానికి - ప్రచురించటానికిగా తయారు చేయబడినవే. యింకా పైగా మశూచికం ప్రపంచకములో కల్లా భయంకర వ్యాధని చెప్పటానికి మెడికల్ ఆఫీసర్లున్నారు. విచారించగా వారి చికిత్సావిధానాలే ఆవ్యాధిని అంతి భయంకరమగు దానినిగా చేయుచున్నవి.

ఒక సమర్థుడును సంపూర్ణచికిత్స తెలిసిన వైద్యుడు నాకు చికిత్సకుడుగా యుండునేని నేను మశూచీ దేవతను ఆహ్వానించు కొనుటకు వెనక తీయకుండుటయే కాక ఆరోగము వచ్చినందువలన యిప్పటికంటే దేహము మాలిన్య రహితమయి యుండగలదనిగూడ గట్టినమ్మకముగలదు.

## నివారణోపాయమునకు ప్రకృతి ప్రయత్నములు:
## (Nature's protective measures.)

ప్రకృతిమాత మనలను తన నియమముల నతిక్రమించకుండునటుల ప్రయత్నములను తోసిపుచ్చు సాయశక్తుల తంటాలు పడుచుండును. అట్లు వుల్లంఘించిన వెంటనే ఒక వ్యాధిని ఆమె ప్రసాదించుచుండును. యెవరైన సరియగు చికిత్స పొందుదురేని మశూచివలన చావ నవసరములేదు. అటులనే యితర వ్యాధులవల్లనూ భయములేదు. డాక్టర్ సిడన్‌హాంగారు తరుణ వ్యాధిని యీవిధముగా నిర్వచించియున్నారు. మానవుని పీడించు ఏ వ్యాధియయినను దేహములోనున్న అన్యపదార్థమును వెలువరించి ఆరోగ్యము గలుగునట్లు ప్రకృతి మాతచేయు ప్రయత్నములలో గలుగు సంఘర్షణయే రోగముగాని వేరుగాదు.

ఆయన్యపదార్థం మనవలనే దేహంలో యేర్పడుచున్నది. క్రిములవల్ల దోషంగాదు. అదియెట్లు? మనరక్తమెప్పుడును క్షారగుణముగలిగియుండును. ( Alkaline ) ఉప్పదనం యెంతవరకా గుణం రక్తంలో నిలచియుండునో అంతవరకు వ్యాధి లేదు. యెప్పడయితే ఆమ్లం (Acid పులుపు) గుణంరక్తంపొందునో దేహమప్పుడు వ్యాధిగ్రస్తమగును. అట్టిసమయములలో దేహముతన రక్త సహజగుణము విడవకుండునటుల ప్రయత్నములు జరుపుచుండును. ఆహారములో తీసుకొను లవణమెక్కువయి రక్తము ఆమ్ల (Acid) గుణమును పొందినచో వెంటనే ప్రకృతి ఆలవణమును రక్తమునుండి వేరుపరచి కుటికలలోనికి (Tissue) తోసివుంచును. కొంతకాలమునకు అచట పోట్లు, నొప్పులు, ప్రారంభించును. కొన్ని సమయములలో నాయన్యపదార్థము పడిశభారముగానో - అతిసారముగానో - మశూచిగానో - లేక యింకొక వ్యాధిగానో దేహమునుండి వెలువరింపబడుచుండును. దేహములోని అన్యపదార్థమును వెలువరించుకొనుటలో దేహమునకు గలుగు పరిణామమే రోగము.

## మితితప్పిభుజించుట రోగహేతువు:
## (Wrong feeding breeds disease)

ఆకలి కానప్పుడు రుచికొరకు భుజించి రోగగ్రస్తులగుచున్నాము. యిది సర్వేసర్వత్ర చేయు తప్పిదము. భుజించుట బలముకొరకను అపోహగలదు. కాని యట్లు చేయుటచే మొదటికే మోసము తెచ్చుకొనుచున్నాము. బలవర్ధకశక్తి మనల నావరించియేయున్నది. మన యుల్లాసముకొలది దానిని పెంచుకొనవచ్చును. ఆహారము దేహయంత్రము నడపుటకుగాదు. శిధిలమయిన దేహములోని భాగములను పూర్తిచేసుకొనుటకే దేహయంత్రము ప్రాణశక్తిచే నడచుచున్నది. ఆ శక్తియే దేహములోని అన్యపదార్థమును నెట్టివేయుచున్నది.

ఆహారపదార్థములలోపిండిపదార్థములు (Starch) మాంసకృత్తులుగల పదార్థములు (Protiens) మితిమీరి భుజించిన రోగమును తెచ్చిపెట్టుచున్నవి. పిండిపదార్థములనగా, బ్రెడ్, బిస్కత్తులు, కేకులు, వరి మొదలయినవి. మాంసకృత్తులనగా, పప్పుగింజలు,జున్ను, గ్రుడ్లు, చేపలు, మాంసము. కావలిసినంతకన్న మితిమీరి పిండిపదార్థములు తిన్నచో కోశములలో జీర్ణముకాక మిగిలిపోయి పుల్లి (Acid) ఆమ్ల గుణము బొంది వెలువరింప బడుచుండును. యీ క్రియ నెరవేర్చుటకు క్రిములు దేహములోనే కాచుకొనియుండును. మాంసకృత్తాహారము తిన్నను

(యెక్కువగా) ఆక్రిములుపై క్రియను చేయు చుండును.

దేహములో పై రెండు విధములయిన ఆమ్లములు (Acids) వ్యుత్పత్తియయి ఒకదానితో వేరొకటి కలసి రక్తములోని కణములను చంపియు దేహమునకు యపకారముచేయు అన్యపదార్థముగా మారియుపోవును. అట్టిఅన్యపదార్థమును చర్మము ద్వారా, శ్వాసకోశములద్వారా, మూత్రపిండములద్వారా, మలకోశముద్వారా వెలువరించు క్రియను రోగమని వాడుకొనుచున్నాము.

### టీకాలు వట్టిభ్రమ :

### (Vaccination Superstition)

మలకోశంలో కుళ్లుపదార్థం చేరియుండుటనందున (సర్వరోగాః మలవశాః) జ్వరముగాని, అతిసారముగాని, మశూచిగాని ప్రాప్తించునని యెరిగినవారు యితరదేహంలో అందును పశుదేహంలో ఉత్పత్తియిన కుళ్లుపదార్థముగు చీము, శీరం టీకాలమందు, తనదేహంలో చొప్పించుకొనుటకు యేవ్యక్తి సమ్మతించునో విచారించుడు. యీ అవకతవకను అందరు గ్రహింతురుగాని సత్యమును బయలుబెట్టువారు బహు యరుదు. అట్టివారు నిందార్హులు.

నేను కలకత్తాలో సేనల హాసుపత్రి నడుపుతూయున్నపుడు హార్లేవీధిలో ఒక వైద్యాధికారి యుండేవాడు. నాకు టీకాలమీదగల దురభిప్రాయానికి నవ్వుతూవుండేవాడు. క్రమేణా తాను గూడా మా హాస్పటల్ అనుభవాలను గడించి చివరకు యీ టీకాలవల్ల మేలుగలుగుతుందనుకోటం వట్టిభ్రమయని నమ్మానన్నాడు.

ఆరోజులలో కిచ్నర్ (Lord Kitchner దొరగారు టీకాలు, సూదిపోట్లు సేనలలో నిర్బంధించగూడదని ఆర్డర్లు జారీచేయించారు. అప్పటికిని ఆరోగ్యశాఖాధికారులు బలవంతముగా పని కల్పించుకు టీకాలు వేయటం ప్రారంభించారు. కాని నాదళంలో అట్టి నిర్బంధాన్ని చేయనిచ్చేవాడిని గాదు లెండి. నా క్రింది వైద్యులు "ఫలానా, ఫలానావాడు టీకాలు వేయించుకోవడం లేదు" అని రిపోర్టుచేసేవారు. సేనలో వారు కొంతమంది వచ్చి "మమ్మల్ని మెడికల్ ఆఫీసర్లు వచ్చి టీకాలు వేయించుకోమ్మని ఒత్తిడిచేయుచున్నా"రని రిపోర్టుచేసేవారు. మీరు తప్పక టీకాలు వేసుకు తీరాలని ఆర్డర్లులేవని యిష్టమయితే వేయించుకోండి. కష్టమయితే మానుకోండి అని చెప్పేవాడిని. అందుమీద మీరయితే యేమి నిర్ణయించుకుంటారని అడిగితే "నా ప్రాణం పోతున్న సమ్మతించి వేయించుకోనని చెప్పేవాడిని."

మశూచికం వున్న ఓడదిగింది. పూర్వ్యయుద్ధ సమయంలో పరిచితుడయిన వైద్యుడు దిగాడు. అతడు నావలెనే టీకాలంటే అసహ్యించుకునేవాడు. అభివందనాలయిన తరువాత "యీ పొద్దునసే బుద్ధిలేని 12 గురు నావద్ద టీకాలు వేయించుకున్నా" రన్నాడు. టీకాలబూటకం తెలిసిన నీవుకూడా యెట్లా వేయటానికి ఆమోదించావంటే "నేను వెయ్యకపోతే నా ప్రక్క గదిలో వాడు వేశేవాడు, యెందుకు పోగొట్టుకోవాలేమిటి ఆ పది గిన్నీలడబ్బులు" అన్నాడు. కనుక యీ టీకాలయందు నమ్మకం లేనివారు కూడాడబ్బుచేతనో-మొహమాటంచేతనో వేయటంగాని వేయించుకోటంగాని జరుగుతువుంటూంది.

* * * *

నేను పై తీర్మానాన్ని బలపరుచు గౌరవమును కోరుచున్నాను.

# టీకాల నిర్బంధము

మశూచీ నివారణకు ఇంతకన్న మంచి ఉపాయము లభించునంతవరకు టీకాల నిర్బంధము ఉంచక తప్పదు.

## ప్రభుత్వ ప్రకటన

మదరాసు, మార్చి 11

మదరాసు ప్రభుత్వ ప్రచురణశాఖా మంత్రి ఇట్లు ప్రకటించుచున్నారు.

నిర్బంధముగా టీకాలు వేయించుకొను పద్ధతిని రద్దుచేయవలసినది అని కొన్ని సంఘములును కొందరు వ్యక్తులును మహజర్లు పంపుచున్నారు. ఈ విషయమునుగురించి మొన్నటి హరిజనపత్రికయందును కొంత చర్చ ప్రకటితమయినది.

అంతఃకరణసంబంధమగు అభ్యంతరము కలవారిని వేధించకుండ చూడవలెనని బొంబాయి మదరాసు ఆరోగ్య మంత్రులను కోరిరి. ఇట్టి సందర్భములో ప్రజలకు కల అపోహాలు పోగొట్టుటకు ప్రయత్నము అవసరము. టీకాలు వేసుకొనినందువలన కలుగు ప్రయోజనము జనులకు తెలియుట మంచిది.

మొదటి టీకాలు, మరుటీకాలు, చాలఉపయోగకరములను విశ్వాసము మదరాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖకు కలదు. ఇప్పటివరకు మశూచీ నివారణకు మరొకమార్గమువేదియు కనబడదు. అందుచేత దానిని నిర్బంధము చేయుటలో తప్పు ఉండజాలదు. ఇంగ్లండులోను, యూరపులోనుఉన్న సంఖ్యలను తెలియబరచినందువలనలాభము లేదు. ఆ దేశములలో ఈ మశూచి మన దేశమునందు వలె రెండు శతాబ్దములనుండి పీడించుచుండుట లేదు. ఇండియాలో ఇది ప్రతిసంవత్సరము కనబడుచున్నది. దీనిని ఆపుటకు మరొక మార్గము లేదు. కాబట్టి అందరును ఒకసారియే కాక, మరొకసారి గూడ టీకాలు వేయించుకొనవలెను. అవసరము కనబడిన యెడల మూడవసారి గూడ టీకాలు వేయించుకొనుట ఉత్తమము.

ఆర్థికజీవనము బాగుపడి ఆరోగ్యవంతములగు పరిస్థితులు కలిగిన యెడల ఈ మశూచీ బాధ చాలవరకు తగ్గవచ్చును. కాని, అట్టి పరిస్థితులు కలిగినంతవరకు ఈనివారణోపాయము తప్పక ఉండవలసినదే కదా.

గత మూడుసంవత్సరములలో మదరాసురాష్ట్రమునందును, తిరువాన్కూరు సంస్థానమునందును లెక్కలు చూచిన యెడల మశూచీ మరణముల సంఖ్య ఎంతగా తగ్గుచూ వచ్చుచున్నదో తేటపడును. ఈ సంఖ్యలను చూచిన వారికి టీకాల ఉపయోగము కరతలామలకము కాకతప్పదు.

### మద్రాసు రాష్ట్రము

| మశూచి | 1934-35 | 35-36 | 36-37 |
|---|---|---|---|
| తగిలినవారు | 65151 | 32871 | 9312 |
| మరణించినవారు | 16900 | 10035 | 3418 |

### తిరువాన్కూరు

| | | | |
|---|---|---|---|
| మశూచి తగిలినవారు | 2806 | 1910 | 230 |
| మరణించినవారు | 1074 | 1652 | 76 |

కాబట్టి ప్రభుత్వము ఈ నిర్బంధమును తప్పక ఉంచవలెను. ప్రజలు మొదటిసారియు రెండవసారియు టీకాలు వేయించుకొనవలెను.

మహాశయులారా!

మదరాసు రాష్ట్రప్రభుత్వ ప్రచురణశాఖ మంత్రిగారు టీకాల నిర్బంధవిషయములో మార్చి 11 వ తేదీన చేసిన ప్రకటన చాలా ఆశాభంగము

గలిగించుచున్నది. ప్రజలకు టీకాలు వేసుకొనుట వలన గలుగు మంచిని చూపి వారికి టీకాలమీద గల అపోహను పోగొట్టుటకు గౌరవనీయులయిన రాజన్ మంత్రిశేఖరులు బూనుకొన్నారట. యీ చట్టము అమలులోకివచ్చి షుమారు 100సం॥ములకుపైగా యయినయాన్నా భయాన్నా ప్రజల్లో టకాలు వేయటం సాగిస్తున్నారే! న్యాయంగా వానివలన మేలే గలిగియున్న పక్షంలో టీకాలను గురించి ప్రజల్లో యంత యపోహయెందుకో? వారి యపోహతీసివేయాలని మంత్రిగారికి యింత పని యెందుకు? ఒకనాడా! రెండునాళ్లా!! శతాబ్దముపైగా నుంచి యథేచ్ఛగా సాగుతున్న నిర్బంధ టీకాలచట్టమును గురించిన మేలు, కళ్లు అనుభవించుచూ వచ్చుచున్న, మనదేశ ప్రజలు తెలిసికో లేకపోవట మేమిటో? రాజన్ మంత్రి మహాశయులు యీ రోజున టీకాల ప్రయోజనము వాని యవసరమును ప్రజల్లో తెలియపరచ ప్రయత్నించట మేమిటో!! హాస్యాస్పదంగా వుంటోంది.

మశూచీజాడ్యం అంతరించిన ఇంగ్లాండు తదితర దేశముల యంచనాలను చూపవీలు లేదట. ఆయా దేశములలో యేకారణముచేత వారు శలవిచ్చినటులుగా రెండు శతాబ్దములనుండి మశూచి మాయమయిందో యడుగగూడదట. దానివలన లాభముగూడ లేదట. యెందుచేతనో? యిండియాలో మశూచి ప్రతిసంవత్సరం యగుపడుతోందట. యీ టీకాల నిర్బంధం యెంతో పట్టుదలతోయున్న యీ దేశంలో అట్లా ప్రతిసంవత్సరం మశూచి యగుపడుటకు కారణమడుగుచున్నాము. అట్లా వ్యాధి ప్రతిసంవత్సరం యగుపడుటచేత టీకాలకొరకు వ్యయించిన ధనమంతా వృధాగదా? ఆవ్యయం యెందుకాపగూడదు? అట్లు టీకాలు వేయించుకున్నచో మశూచికం రాదని హామీనిచ్చి నిలబడ్డచో వారి యుపదేశానుసారంగా రెండు, మూడు పర్యాయాలే కాక యేటేటా టీకాలు వేయించుకుంటాం. టకాలు లేకుంటే రెండు, మూడు, పర్యాయములు మశూచికం రావటం నాయనుభవంలో వుందని కేసులు రుజువుచేసే ఆర్. హాచ్ వెన్ యం. డి. యల్. ఆర్. సి. పి. యం. ఆర్. సి. యస్. యల్. యస్. ఏ., గారికి యింకా ఖండాంతరములలో ప్రఖ్యాతి వహించిన తదితర డాక్టర్లకు ఏమి సమాధానమిస్తారో? ఒకవేళ టీకాలు వేసుకున్నవాళ్ళకు యెంతమందికి మశూచికం రాలేదో చూడండని సవాలుచేసే అంతకు రెట్టింపు టీకాలు వేసుకోకపోయినా మశూచికం రానివారిని చూపగలరు.

ఏదో ఆర్థికజీవనం బాగుపడితే మశూచికం అంతరిస్తుందంటున్నారే. దానికొరకెందుకు ప్రయత్నించగూడదు? యేటేటా యీటీకాల సిబ్బంది కొరకు వ్యయంచేసే రు 7,20000 వేలు దాని క్రింద వ్యయంచేసి కొద్దికొద్ది ప్రదేశాలు బాగుపరుసూ యెందుకు రాగూడదు?

చూచారా! ప్రచురణ శాఖామంత్రిగారు, 11-3-38 న చేసిన ప్రకటనలో టీకాలవల్ల మశూచీ మరణాలు మదరాసు రాష్ట్రం తిరువాన్కూరులో తగ్గినట్లు సూచిస్తున్నారు. కాని వారి టీకాలు పెరిగిన కొద్ది ఆవ్యాధివల్ల మరణాలు పెరిగినట్లును టీకాలు తగ్గినకొలది మరణాలు తగ్గినట్లు వారి యంచనాల ప్రకారమే గనపడుతోంది. 12-3-38 హిందూపత్రికలోని స్టేటుమెంటు...

| సంవత్సరం | మదరాసు | | తిరువాన్కూరు | |
|---|---|---|---|---|
| | టీకాలువేయబడిన వారి సంఖ్య | మశూచితో చనిపోయిన వారిసంఖ్య | టీకాలు వేయబడిన వారిసంఖ్య | మశూచితో చచ్చినవారి సంఖ్య |
| 1934-35 | 5157784 | 16900 | 1393306 | 1074 |
| 1935-36 | 4238630 | 10035 | 1076729 | 652 |
| 1936-37 | 3446970 | 3418 | 1166721 | 76 |

పై స్టేటుమెంటు (వారు చూపిన లెక్కల)ను బట్టి మనరాష్ట్రంలో యెక్కువ టీకాలు వేసిన 34-35 సం|లో యెక్కువ మశూచివలన మరణములును, తక్కువ సంఖ్య టీకాలు వేసిన 36-37లో తక్కువ సంఖ్య చావులు గనుపించుచుండగా యింకా టీకాలవలన మశూచికం ఆపబడిన దెక్కడనో విచారించండి. న్యాయంగా ఆరోగ్య నియమాలు మార్గాలవలన రోగాలు అరికట్టబడి అంతరించాలిగాని యీ టీకాలు ఆపుతున్న ట్లగపడదు. యింకో ఉదాహరణ చూడండి.

మదరాసు పబ్లిక్ హెల్తు డయిరక్టరు రిపోర్టు నెం 6 (a) స్టేటుమెంటు ననుసరించి బెజవాడ, బందరు, గుంటూరు మ్యునిసిపాలిటీలలో ఆయా సంవత్సరాలలో ఒకవిధమయిన పొంగువలన చనిపోయినవారి సంఖ్య చూపబడినది. గమనింపుడు.

### పొంగువ్యాధిచే చనిపోయినవారి సంఖ్య

| | 34-35 | 35-36 | 36-37 |
|---|---|---|---|
| బెజవాడ మ్యునిసిపాలిటీ | 40 | 3 | ... |
| బందరు | 10 | 4 | 7 |
| గుంటూరు | 7 | | |

యీవ్యాధిగూడా ఆరోగ్యశాఖవారిచే మశూచివలెనే యంటు (infectious) వ్యాధిగానే పరిగణింపబడు చున్న దేగా? టీకాల నిర్బంధములేదే! ఎందుకు సంవత్సరవారిగా మరణాలసంఖ్య తగ్గుతూవచ్చింది? ఆకారణము చేతనే పై మశూచి మరణములుగూడా సంవత్సరవారిగా తగ్గుచూ వచ్చినవి అంటే ఆరోగ్యమార్గాభివృద్ధి(Sanitary improvements )అయి, దేశ ఆరోగ్యస్థితి బాగుపడుతోందన్న మాట.

ఆరోగ్యశాఖ మంత్రిగారు, ఉపన్యాసం చెపుతూ తిరునామ్మారులో పోలీసు బందోబస్తుతో టీకాలు వేయించి మశూచిని నిర్మూలము చేస్తున్నారని శలవిచ్చి యున్నారే? అంతగా నిర్బంధ టీకాల విధానాన్ని అమలులో పెట్టటానికి ఫలితంగా బోలు 1935-36 సం॥లో మశూచికం తగిలిన 1910 కి 1652 మంది చనిపోయారు. (అంటె నూటికి 86 వంతునన్నమాట) యిక టీకాలు ఆపిందెక్కడ? ఆవ్యాధిని ఆరోగ్య మార్గాలు తప్ప యితరమార్గాలు ఆపుటదుర్లభము. ఆరోగ్యమార్గాలు తప్ప యితర టీకాలమార్గాలు వ్యాధులను ఆపలేవనుటకు యింకొక తార్కాణం చూడండి. అంటుజాడ్య మయిన కలరాయును కలరాటీకాల (Anti cholera inoculations) వలననే ప్రబలి మరణములు పెరుగుచున్నటుల యీ క్రింది స్టేటుమెంటుద్వారా చూపబడుచున్నది. మదరాసురాష్ట్రములో

| సం॥ | సంవత్సరములో కలరాయినాక్యులేషనులు చేయబడినవారిసంఖ్య | కలరావ్యాధి వలన మరణములు | రిఫరెన్సు |
|---|---|---|---|
| 1934 | 770089 | 18158 | 34-35 డి పి. హెచ్ రిపోర్టు పారా 21,23 |
| 1935 | 1889904 | 35456 | 35-36 డి.పి. హెచ్ రిపోర్టు పారా 29,36 |
| 1936 | 1952872 | 34117 | 36-37డి. పి. హెచ్ రిపోర్టు 29-32 |

కలరా యినాక్యులేషనులవలన రోగమాగునని చెపితే రోగమాపటానికి 770089 యినాక్యులేషనులుచేసిన34సం॥18158 చావులేమిటి?1889904 యినాక్యులేషనులు చేసిన 35 సం॥లో 35456 చావులేమిటి? 36 లో తగ్గటమేమిటి? దీనినిబట్టి టీకాలుగాని యినాక్యులేషనులు గాని వ్యాధిని ఆపలేకపోగా సహాయభూతమగుచున్నవని చెప్పక తప్పదు.

పోనీ ప్రభుత్వమువారి యూహాలే సరియగునవని యొప్పుకొన్నను వారిలెక్కలనుండియే మశూచి మరణములు పెరుగుదలలో నున్నటుల యీ క్రింది స్టేటుమెంటుచూపుచున్నది.

| మదరాసులో | | | నూటికి |
|---|---|---|---|
| సం॥ 34-35 లో | మశూచి తగిలినవారు | 65151 | 25.9% |
| ,, | మరణించినవారు | 16900 | |
| సం॥ 35-36 లో | మశూచి తగిలినవారు | 32871 | 30.5% |
| ,, | చచ్చినవారు | 10035 | |
| సం॥ 36-37 లో | మశూచి తగిలినవారు | 9312 | 36.7% |
| ,, | చచ్చినవారు | 3418 | |

వారు టీకాలు నిర్బంధించినకొలది పై సం॥లలో మరణసంఖ్య తగ్గుచున్నదనే చూపతలంచిరిగాని మరణముల సంఖ్య తగ్గుచున్నటు లగుపడినను నూటికి మరణములో 25 మొదలు 36 వరకు పోవుచున్నటుల గమనించిరేమో? మశూచికె మునకే టీకాలనిర్బంధ మేమిటో? ప్రతిసంవత్సరం కలరా రావటంవల్లా దానికీనిర్బంధమేదీ? కలరా మశూచికంటె తేలికవ్యాధియా? కలరా విషయంలో తిరిగి వెనక్కి చూచుకునేప్పటికి మనిషి గల్లంతేనే. అది అంటువ్యాధేనే? యింకా మశూచి రోగి మంచంమీదనా కొన్ని రోజులుంటాడే! కలరాకు యెందుకు నిర్బంధంచేయరు. ఆపలేరా?

ప్రభుత్వమువారికొక మనవి. అందరి ప్రజారోగ్యముకు బాధ్యులుగా వున్నారు గాబట్టి యీ టీకాలమీద నమ్మకం యున్న వారికి కోరువారికి యింతకు పూర్వంకంటె అతిశ్రద్ధతో టీకాలు వేయించండి. ఆ టీకాలయందు నమ్మకంలేక, టీకాలచీము ఆరోగ్యభంగము గలిగించుటయే కాక యితరజాడ్యములను తమ పిల్లలకు తెచ్చి పెట్టి అనారోగ్యవంతులుగాను, నిర్వీర్యులుగాను చేసివేయునని భయపడే ప్రకృతి సేవకసంఘము వారిని విడిచిపెట్టండి. వీరు వ్యాధిని ప్రబలింప చేసేవారుకారు. టీకాలు వేసుకొని వారు వ్యాధిని ప్రబలింపచేసెదరను యూహకు తావులేదు. పల్లెలలో మురికిగానుండు గూడెములయందే వ్యాధి వ్యాప్తమయి ఆనుకొని పరిశుభ్రముగాయుండు ప్రదేశములలో వ్యాధి లేకపోవుట చూచుచున్నాము. దేవునియొక్క యిష్టానుసారము వ్యాధి ప్రబలునుగాని మనుష్యుడు వ్యాధి వ్యాప్తముచేయుటకు కర్తయన్నచో దేవుని నిందించినవారమగుచున్నాము. దేవుడు ఒకని తప్పుకు యితరులను దండింపడు.

రస, విష, గంధక, పాషాణములుగల మందులను వాడక ప్రకృతి సూత్రముల ననుసరించి పెంచిన పిల్లలను యీ టీకాలు హింసింపకుండునట్లు గాను చివరకు విశ్వాసఘ క్లాజు(Conscience clause) నయినను పెట్టి టీకాల నిర్బంధము తీసివేయ గోరుచున్నాము.

టీకాలు వేయగానే ఆసీరం దేహములోని రక్తములో గలసినంతనే మశూచివ్యాధిని రానివ్వకుండా యడ్డుపెట్టగల క్రిములను( Antibodies) ఉత్పత్తి చేసియుంచుననియు, మశూచివ్యాధి వచ్చినప్పుడు ఆ క్రిములు దానిని రానివ్వక ఆపుననియు చెప్పుచున్నారు. ఏ ఋతువు కా ఋతువు తగినట్లుగా దేహమును మార్చుకొను ప్రకృతిమాత మశూచివ్యాధిగాని యింకా యే వ్యాధినయినను ఏల తట్టుకొని ప్రతిఘటించదో చెప్పుడు. యినాక్యులేషన్లు వేయించుకొని వారు యెంతమంది మరణించిరో చూపించెదరు లెక్కలు చూపుదురు. కాని కలరా, మశూచి టీకాలు వేయించుకొన్నవారు చచ్చిపోలేదని చెప్పగలరా? అంటే టీకాలు వేయకముందే వ్యాధి అంకురించింది కనుక టీకాలు, సూదిమందులు యిచ్చిన ప్రయోజనం లేకపోయిందని సమాధానం చెప్పుతారు. కాని దేహం అసలు వ్యాధిని తట్టుకోటానికి పడేశ్రమకు యీ టీకాలువేసినందువలన దేహంలో గలిగే సంఘర్షణ అధికమయి మరణం తటస్థిస్తోందని చెప్పుతామంటేను. దీనికేమి సమాధానం?

ఒక్కొక్కమనిషికి వేసే టీకాలమందు ఖరీదు 4 అణాలు మొదలు ఒక రూపాయివరకు గిట్టు

తోంది. ఆవ్యయం ఆరోగ్యవిధులకొరకు వ్యయం చేస్తే మనదేశంలో ఆర్థికజీవనం యెంతబాగుపడి ప్రజలు ఆరోగ్యవంతంగా వుంటారో జూడండి. ముందు కొన్ని డిస్ట్రిక్టులలో యీ టీకాలు ఆపి ఆవ్యయంతో ఆరోగ్యవిధులను వృద్ధిచేసే విధానాల నేర్పరిచి యీ వ్యాధులు యెంతవరకు అరికట్టబడునో ప్రయత్నించమని మనవి. తుదకు కడప డిస్ట్రిక్టులోను, దక్షిణ ఆర్కాడులోను, కొన్నిభాగములలో టీకాల నిర్బంధము లేకుండా వున్నదే! అట్లాగయినా యీ ప్రకృతి సేవాసమితి వారిని నిర్బంధంలోంచి తీసివేయించాలి. యీ సంఘమువారును బ్రతుక దలచినవారే, ప్రాణముమీద తీపివుంది. టీకాలకంటె యెన్నోరెట్లు విలువగలిగిన మశూచి నాపే మార్గం వీరికి తెలుసు. వారిలోను మంచియనుభవశాలులు ప్రాజ్ఞులు గలరు. కనుక యీసంఘము వారి ఆరోగ్యమునకు ప్రభుత్వమువారు బాధ్యులేగనక కొన్ని మార్గములు చూపి నిర్బంధము నుండి తొలగించి యీవిషయం పునర్విచారము చేయవలసినదిగా గోరుటకు సేచగోపతి సంఘము వారిక ప్రార్థన.

ఈ నిర్బంధమును తొలగించవలసినదిగా గవర్నమెంటు బిల్లును త్రోసివేసిన కూర్గు కవున్సిలు వారి చర్య యీ క్రిందవ్రాయబడినది. యింకా పత్రికాధిపతుల యభిప్రాయములను మేజరు ఆర్. ఎఫ్. ఇ. ఆస్టిక్ గారి యనుభవములు యింకా ముందు వ్రాయబడినవి. వానినిగూడ బాగుగా పరిశీలించి శమయుద్దేశములు ప్రజలలోచాటుడు.

## నిర్బంధటీకాల చట్టమునకు ప్రతిఘటన గవర్నమెంటు బిల్లు నిరాకరింపబడెను కొడగు (కూర్గు) కవున్సిలు

(11 మార్చి మదరాసుమెయిల్ నుండి)

అన్నివర్ణాలయందును నిర్బంధ టీకాలచట్టము అమలులో పెట్టగలందులకు నిన్నటి కొడగు శాసనసభలో మిస్టర్ ఐ. యం. ప్రాజరు గారి అధ్యక్షతక్రింద ఛీఫ్ కమీషనరు యల్ టి. కల్. జె. డి. లాహేగాడ్డెన్ గారిచే యీబిల్లు ప్రవేశపెట్టబడెను.

క్రిందటి సమావేశములో యీబిల్లు ప్రవేశపెట్టుటకు పూర్వము ప్రజాభిప్రాయ మెరుగనిది యీ బిల్లు ప్రవేశపెట్టకూడదనియు కొంతమంది ప్రజలు యీ టీకాలు అపకారం చేసవనే యంలో వున్నారని ఒక మెంబరు పలికెననియు అందుమీద ప్రజాభిప్రాయము తెలిసికొనగా యెక్కువమంది బిల్లు కనుకూలురనియు, టీకాలు వేయబడిన పిల్లల చావులకంటె వేయబడని పిల్లల చావులు మోపనియు అంచనాలు చూపుచు కమీషనరుగారు పలికిరి.

## టీకాలు మశూచిని ఆపలేవు.

మలప్పగారు బిల్లుకు అడ్డుపెట్టిరి. టీకాలు మశూచిని ఆపలేకపోవుటయేగాక, ఆజబ్బును తట్టుకోలేని స్థితిలోకి గూడ తీసుకువస్తవని ఆటీకాల మందు అనేక వ్యాధులను తెచ్చిపెట్టుననియు ఇంగ్లాండు ఆస్ట్రేలియాలోని గొప్ప వైద్యుల అభిప్రాయములను బహిరంగపరచెను.

బుల్ గారు ఆబిల్లునకు ఆమోదమిచ్చిరి. మలప్పగారుచూపిన హంశములను ఒప్పుకొనమనియు ప్రాముఖ్యతవహించిన దేశములు నిర్బంధటీకాల కనుకూలమనియు చెప్పిరి. హెచ్. యఫ్. ముర్ లాండ్ గారు దానిని బలపరచిరి.

**కమీషనరుగారి జవాబు :—** ప్రాజరుగారు టీకాలవల్ల మదరాసు రాజధానికి గలిగిన లాభములను చూపుచు టీకాలు ప్రాణదాతలనిరి. 7గురు సభ్యులు ఆబిల్లును ఆమోదించి 11 గురు సభ్యులు నిరాకరించుటచే **ఆ బిల్లు సభ వారిచే త్రోసివేసి నిరాకరింపబడినది.**

# ఇంగ్లం వేల్సు దేశాలలో

31 సంవత్సరములలో మశూచివల్లా, మశూచిని ఆపటానికి వేసిన టీకాలవల్లా మరణించినవారి లెక్కలు ఈక్రింది అంకెలు నిర్దుష్టమైనవని రిజిస్ట్రారు జనరల్ గారును, ఆరోగ్యశాఖవారును ఒప్పుకొనియున్నారు.

| సంవత్సరము | మశూచీమరణాలు | | | టీకాలవల్లా టీకాలువేయుటచేత కలిగిన వ్యాధులవల్లా మరణాలు | | | నూటికి ఎంతమందికి టీకాలు వేశారు? | పొంగుతో చనిపోయిన వారు |
|---|---|---|---|---|---|---|---|---|
| | 5 సం॥ లోపు | 5 సం॥ పైన | మొత్తం | 5 సం॥ లోపు | 5 సం॥ పైన | మొత్తం | | |
| 1905 | 17 | 99 | 116 | 26 | 0 | 26 | 75.8 | 93 |
| 1906 | 4 | 17 | 21 | 28 | 1 | 29 | 73.4 | 106 |
| 1907 | 1 | 9 | 10 | 12 | 0 | 12 | 70.9 | 120 |
| 1908 | 1 | 11 | 12 | 13 | 0 | 13 | 63.2 | 93 |
| 1909 | 1 | 20 | 21 | 11 | 0 | 11 | 59.8 | 94 |
| 1910 | 2 | 17 | 19 | 8 | 0 | 8 | 55.9 | 97 |
| 1911 | 5 | 18 | 23 | 15 | 0 | 15 | 52.3 | 80 |
| 1912 | 2 | 7 | 9 | 9 | 1 | 10 | 50.1 | 76 |
| 1913 | 1 | 9 | 10 | 7 | 0 | 7 | 46.5 | 183 |
| 1914 | 1 | 3 | 4 | 5 | 0 | 5 | 44.6 | 22 |
| 1915 | 2 | 11 | 13 | 7 | 3 | 10 | 45.5 | 92 |
| 1916 | 3 | 15 | 18 | 2 | 1 | 3 | 44.7 | 65 |
| 1917 | 0 | 3 | 3 | 6 | 2 | 8 | 43.3 | 69 |
| 1918 | 0 | 2 | 2 | 3 | 1 | 4 | 41.5 | 54 |
| 1919 | 2 | 26 | 28 | 6 | 1 | 7 | 40.6 | 55 |
| 1920 | 5 | 25 | 30 | 18 | 0 | 18 | 39.5 | 71 |
| 1921 | 1 | 4 | 5 | 8 | 0 | 8 | 38.3 | 57 |
| 1922 | 4 | 23 | 27 | 6 | 1 | 7 | 40.3 | 40 |
| 1923 | 2 | 5 | 7 | 5 | 7 | 12 | 47.8 | 52 |
| 1924 | 4 | 4 | 8 | 4 | 0 | 4 | 47.5 | 59 |
| 1925 | 2 | 4 | 6 | 8 | 0 | 8 | 44.2 | 83 |
| 1926 | 2 | 9 | 11 | 4 | 0 | 4 | 44.8 | 56 |
| 1927 | 17 | 19 | 36 | 7 | 0 | 7 | 44.9 | 49 |
| 1928 | 5 | 48 | 53 | 15 | 11 | 26 | 42.6 | 62 |
| 1929 | 10 | 29 | 39 | 11 | 12 | 23 | 39.9 | 53 |
| 1930 | 7 | 21 | 28 | 3 | 4 | 7 | 40.1 | 47 |
| 1931 | 4 | 5 | 9 | 17 | 1 | 18 | 39.0 | 54 |
| 1932 | 1 | 2 | 3 | 3 | 0 | 3 | 38.2 | 41 |
| 1933 | 1 | 1 | 2 | 5 | 1 | 6 | 37.0 | 43 |
| 1934 | 0 | 6 | 6 | 4 | 4 | 8 | 36.1 | 46 |
| 1935 | 0 | 0 | 0 | 6 | 2 | 8 | | |
| | 107 | 472 | 579 | 282 | 53 | 335 | | 2112 |

ఈ అంకెలవల్ల ఏమి తేలుతుందీ అంటే టీకాలుతగ్గినకొద్దీ మశూచికము తగ్గింది. మశూచికమువలనకంటె మశూచికాన్ని ఆపడానికి వేసిన టీకాలవల్లనే యెక్కువమంది మరణిస్తూవచ్చారు.

# టీకాలు
## "మురికిపని"

మతవిరుద్ధము నీతిదూరము.

మశూచికము టీకాలవలన ఆగదు.
క్రొత్తవ్యాధులు బయలు దేరును.

## అంటు వ్యాధులకు దివ్యమైన మందేమి?

# గాంధిమహాత్ములవారు చెప్పుచున్నారు:

అంటువ్యాధుల కన్నింటికి ఒకటే మూలకారణము. అందు మశూచకము ముఖ్యమైనది; గాన దాని చికిత్సనుగుఱించి చర్చింతము.

మశూచిక మనిన మనకు భయము. దాని గుఱించి మనకు దురభిప్రాయము గలదు. భారతీయులు కొందఱు దేవత అని జాతరచేసెదరు. ఇందితర వ్యాధులవలెనే ప్రేగులలో పురీషము నిలచిపోయి రక్తము విషీకరణమైనపుడు దానిని వెలువరింప ప్రచండమైన ప్రయత్నము జఱుగును. అదేమశూచికము. అది అంటువ్యాధియే యగుచో రోగినిముట్టుకొనిన ప్రతివారికిని యీ వ్యాధి రావలసినదే గదా! ఇట్లు జరుగుట లేదు. కొద్దిగా జాగ్రత్తపడినయెడల రోగిని ముట్టుకొనినను భయములేదు. అట్లని మశూచికము అంటువ్యాధి కాదని చెప్పుటలేదు. కాని మశూచికము అనారోగ్యస్థితిలో నుండు వారికి వచ్చును. కాననే మశూచికము ఒక ప... ములో అనేకులకు వచ్చుచుండును. కాననే మశూచిక మనిన అంటువ్యాధి యనియు, దాని కందఱును టీకాలు వేసికొనిన మశూచికము రాకుండుననియు దురభిప్రాయులమగుచున్నాము. మశూచికపు రోగి దేహమునుండివచ్చిన చీము ఆవు పొదుగులో చొప్పించి, ఆ యావు దేహమున బయలుదేరిన చీము మానవదేహమున చొప్పించుటయే టీకాల వేయుటయగుచున్నది. ప్రారంభమున ఒకసారి టీకాలు వేసిన మానవ జీవితమున కంతకును సరిపోవుననిరి. టీకాలు వేసిన వారికి సయితము మశూచికము తగులుటవలన కొంతకాలమున కొకతూరి టీకాలు వేయవలయునను సిద్ధాంతము బయలుదేరెను. ఇకనిప్పుడో మశూచికము బయలుదేరినచోట నున్నవారు టీకాలున్నవారైనను సరే టీకాలు వేయించుకొని తీరవలసినదే. అట్లు ౫, ౬ సారులు సయితము టీకాలు వేయించుకొనినవారు గలరు. మనకాలములో మిక్కిలి దుర్మార్గమైన వానిలో టీకాలొకటి. వానిని ప్రపంచములోని అడవి జాతివారు సయితము వేయించుకొనుటలేదు. అది బహుమోటుపని. దాని ననుగమనించువారు యిష్టమైనవారికే గాక పీనల్‌కోడ్డు సహాయమున యిష్టముకాని వారికి సయితము బలవంతముగా వేయించుచున్నారు. టీకాలు వేయించుకొనిన వారు శిక్షింపబడుచున్నారు. టీకాలు పురాతనముగాదు. మరి ౧౭౯౮ లో ప్రారంభమైనది. ఈ కొలదికాలములో టీకాలు వేసికొనిన వ్యాధి రాకుండునను దురభిప్రాయమునకు లోనైరి. టీకాలు లేకున్న మాత్రమున

---

మీకేమైన ప్రకృతివైద్య సలహా కావాలంటే ఇట్లు వ్రాయుము:—
ప్రకృతికార్యాలయట్రస్టు - బెజవాడ.

మశూచకము వచ్చునని చెప్పజాలువా రెవ్వరును లేరు. టీకాలు లేనివారనేకులు మశూచకమునకు లొంగుట లేదు. టీకాలు లేకున్న వ్యాధి వచ్చునని చెప్పువారిలో టీకాలువేసిన వ్యాధి రాకుండునని జెప్పువారును లేదు.

టీకాలు మిక్కిలి మురికిపనియైయున్నది. మానవ దేహములోనికి జొప్పించు టీకారసి ఆవుసంబంధమైనదే గాక మశూచక రోగి సంబంధమైనదియును, సామాన్య మానవుడిది విని వాంతి జేసుకొనును. దానిన చేతితో తాకిన చెయ్యి కుంకుడుకాయ వేసి కడుగుకొనవలసినదే. దానిని తినుట యనిన మిక్కిలి అసహ్యమును చిరాకును గలుగుచున్నది. టీకాలు వేయించుకొను వారిలో దీనిని తినిన యట్లే యగుచున్నదని గ్రహించిన వారెందరున్నారు? కొన్ని వ్యాధులలో నోటితో తిన్నదాని కన్న రక్తములోని ఇంజెక్షన్ చేసిన ఔషధము త్వరగా దేహములోనికి జేరునని తెలిసినవారనేకు లున్నారు. నోటితో, తినుటకును, ఇంజెక్షనుకును భేదమేమనిన నోటితోతినిన నాలస్యముగాను ఇంజక్షన్లో త్వరగాను ఔషధము రక్తమునందు జేరిపోవును. ఇంత తెలిసియు టీకాలనిన మనకు భయమనిపించుట లేదు. పిరికివా రనేక తూరులు చత్తురనిబాగుగా జెప్పబడినది. తాము చత్తుమనియు మశూచకము వలన వికృత రూపము వచ్చుననియు భీతి నొందువారే యీ టీకాలకు లోనగుచున్నారు. టీకాలు వేయించుకొనుట మత విరుద్ధమును, నీతి దూరమును నని తలంపకుండజాలము. మాంస భక్షకులు సయితము చచ్చిన జంతువు రక్తమును త్రాగుట యనిన భీతి నొందెదరు. అయిన టీకాలనిన నోరులేని జంతువుయొక్క రక్తము పానముజేయుట కాక మరేమి? ఇట్టి దుర్మార్గమైన కార్యమునకు లోనగుట కన్న పాపభీతి గలవా రెవ్వరైనను ఇంకను వేయిరెట్లు మశూచకవ్యాధి ననుభవించుటయే శ్రేష్టతరమైనది. చివరకు చచ్చినను మంచిదే.

ఇంగ్లాండులో తెలివిగలవా రనేకులుచేరి టీకాల వలని దుష్ఫలితముల శోధించి టీకాలను మానవలయునను సంఘములుగా బయలుదేరిరి. ఈ సంఘ సభ్యులు టీకాలపై బహిరంగమైన దాడి సలిపిరి. కొందరిందుకు శిక్షింపబడిరి. ఈక్రింద కారణములచే వారు టీకాలు వలదనుచున్నారు.

౧ టీకారసము తయారుచేయుటలో నోరులేని అనేక ఆవులు, దూడలు బాధ నొందుచున్నవి. ఎంత లాభము కలిగినను ఆ జంతువుల నిట్టి బాధలకు లో బఱుపరాదు.

౨ టీకాలువేసిన మంచికలుగుటకు బదులు, ఇంకను వ్యాధులనుః గలిగించుచున్నది. దాని ప్రవేశానంతర మనేక వ్యాధులు తల నూపిన వని టీకా అనుయాయులే ఒప్పుకొనుచున్నారు.

౩ ఎవరి దేహము నుండి టీకారసము తీయబడినదో వాని దేహమునందున్న ఇతరవ్యాధి సూక్ష్మజీవులును ఆ టీకా రసమునందుండును.

౪ టీకాల వేసికొనిన వారికి మశూచకము రాదని హామి యేమియు లేదు. టీకాల సిద్ధాంతము గనిపెట్టిన జెన్నరు వైద్యుడు ఒక చేతిపై ఒకటీకా వేసిన వ్యాధి రాదనిచెప్పెను. అదితప్పుటచే రెండుచేతుల పైనను వేయసాగిరి. అదియును ఉపకారికాక పోవుటచే రెండు చేతుల పైనను ఒకచోట కాక యింకా ఎక్కువటీకాలు ఏడు సంవత్సరముల కొకతూరి వేయవలయు ననిరి.

తరువాత మూడుసంవత్సరములకే తిరిగి వేయవలయుననిరి! దీనివలన వైద్యవిశారదులకే యిందు గట్టి నమ్మకము లేదని తేలుచున్నది. టీకాలు వేయించుకొనని వారికి మశూచకము రాకుండుట లేదని వెనుకనే చెప్పితిమి. మశూచకము తగిలిన అందఱకును టీకాలు లేక పోయియే గాదు

౫. టీకా రసమే మురికి. మురికి మురికిచేఁ బోవునని యెచ్చటను లేదు.

ఈసంఘము వారీపై అభిప్రాయముల వంటి తర్కముతో అధిక సంఖ్యగల ప్రజాభిప్రాయమును ప్రోగుజేసిరి. ఒకపట్టణములో అధిక సంఖ్యాకులు టీకాలు వేయించుకొనమని దిరుగబడిరి. అట్లయ్యు వారికి మశూచికము వ్యాపింపలేదని లెక్కలవలన దేలుచున్నది. దీని కంతకును మూలకారణమేమనిన:- ఈ టీకాలు మానిన, దానికొరకై ఏర్పడిన డాక్టరుల పొట్టలు నిండవు. ఈ భయమున అంధులై ప్రజలకు జరుగు అపకారమును గణింపగలుగుట లేదు. దాని వలన యీ అమానుషమైన దురలవాటు అంతరించుట లేదు. ఎట్లయినను టీకాలు వేయరాదను వైద్యులును గలరు. వారికిందలి అపకారములు పూర్తిగాఁ దెలియవచ్చినవి.

టీకాలయందలి అపకారమును గ్రహించి దానిని మనస్ఫూర్తిగా నిరాకరింప దలచిన వారు శాసనమువలన గలిగిన ఎట్టినష్టములకైనను, శిక్షలకైనను నోర్వ ధైర్యము గలిగి యుండవలయును. తాము నమ్మిన సత్యమును నిలువుకొనుటకై ప్రపంచమున కంతకును ఎదురుదిరిగి ఒంటరిగానుండి యైనను తాను నమ్మినదానిని సమర్థింపవలయును. ఆరోగ్యము కాదనే కారణమున టీకాలువలదను వారాశాస్త్రమును పూర్తిగా నభ్యసించి తాము చెప్పిన దాని నందరచేతను ఒప్పించుటకై వారికి నచ్చజెప్పఁ గలిగి యుండవలయును. వారిని యాచరింపఁ జేయ గలిఁగి యుండవలయును. ఈ విషయమై పూర్తిగా దెలియనివారును, సర్కారు పెట్టు బాధల భరించు సాహసములేని వారును, సర్కారు శాసనముల ననుగమింపవలయు. తమచుట్టు నున్న ప్రపంచము వారి భావము ననుసరించి నడుచుచుండలయును.

టీకాలువలదనువారు నా*ఆరోగ్యాదర్శమునందు వ్రాయబడిన ఆరోగ్య నియమము లన్నియు ననుసరించి తీరవలయును. దానివలన మశూచికమే గాక యితర వ్యాధులను గలిగించు సూక్ష్మజీవులను నిరోధించు శక్తి దేహమునకు గలుఁగును. దాన మశూచికము, యితర వ్యాధులనుండి రక్షింపఁబడుదురు. టీకాలువద్దని ఒకవంక జెప్పుచు తమ కామవ్యామోహమును తగ్గించుకొనఁ జాలనిచో వారు ప్రపంచము యెదుట సత్యమును సిద్ధాంతము జేయజాలరు. తీరా మశూచికము వచ్చిన తరువాత దినమునకు 3 తూరులు తడి గుడ్డ కట్లు కట్టుట మిక్కిలి శ్రేష్ఠమైన చికిత్స. దాన జ్వరముతగ్గును. పుండ్లు త్వరగా మానిపోవును. పుండ్లపై నూనెలు, తైలములు రాయఁబనిలేదు. సాధ్యమైన ఒకటి, రెండు చోట్ల మట్టిపట్టీల వేయవలయును. అన్నము, తేలిక పండ్లు మాత్రమే పథ్యము. ఖర్జూర, సీమబాదం మొదలగునట్టి పదార్థములు మానవలయును. సామాన్యముగా ఒక వారము లోపలనే. తడి గుడ్డ కట్టుటవలన పుండ్లు మాననారంభించును. మాననియెడల యింకను విష మున్నదని యర్థము. మశూచికమనిన భయము

* ఆరోగ్యాదర్శము - వెల 0-8-0 వ కార్యాలయట్రిస్టు
**బెజవాడ - లో దొరకును.**

కలుగరాదు. మరి దేహమునందలి విషమును బహిష్కరించుటకై ప్రకృతిచేయు గట్టి ప్రయత్నమే యీ మశూచికమని గ్రహింపవలయును. అది విషమును బహిష్కరించి, ఆరోగ్యమును నిలుపగలదు.

మశూచికము తగిలినతరువాత కొంతకాలము వరకు రోగి బలహీనముగా నుండును. ఇంకను కొన్ని యితర వ్యాధులచే బాధబడును. ఇది మశూచిక ఫలితము కాక దానిని నివారించుటకై వాడిన వెధవ మందుల ఫలితము. ఇట్లే జ్వరములకు వాడిన క్వైనావలన చెవుడువచ్చును. చివరకు క్వినిజమ్ అను స్థితికివచ్చును. సుఖవ్యాధులలో పాదరసము వాడుక అనేక యితరవ్యాధుల కాకరమగుచున్నది. మలబద్ధకమునకు వాడిన మందువలన మూలవ్యాధి వంటివి కలుగుచున్నవి. ఆరోగ్య నియమానుసరణమువలన రోగముయొక్క మూలకారణమును తీసివేయుటయే సత్యమైన వ్యాధి నివారక పద్ధతి. అధిక వ్యయమువలన తయారై అధిక గుణతరముగా గాన్పించిన భస్మములు సయితము ఫలితమునందపకారులే. అవి మొదట కొంత ఉపకారము చేసినను కామజ్వరమును కలిగించి ఆరోగ్యమును నాశనపఱచును.

బొబ్బలుపోయి పుండ్లుపడిన తరువాత ఆలివ్ నూనెరాచి ప్రతి దినము స్నానము చేయుచుండిన అపుండ్లు రాలిపోవును. తరువాత క్రమముగా మచ్చలు సయితము పోయి దేహమునకు సహజమగు కాంతియు, వర్ణమును కలుగును.

# ప్రకృతి చికిత్సాగ్రం ములు

### వివిధవ్యాధులకు చికిత్సాగ్రంథములు

| | వెల ఇతరులకు | వెల చందాదార్లకు |
|---|---|---|
| క్షయ | 0 12 0 | 0 8 0 |
| శుక్లనష్టము | 0 12 0 | 0 8 0 |
| మలబద్ధకము | 0 12 0 | 0 8 0 |

### వేదాంతము, ఇతరములు

| | | |
|---|---|---|
| ఋషిజీవనప్రకాశము | 0 4 0 | 0 3 0 |
| స్త్రీలవ్రతము | 0 2 0 | 0 1 0 |
| ఆదర్శసుఖజీవనము | 1 0 0 | 1 0 0 |
| మహాయోగము | 0 12 0 | 0 8 0 |
| నిర్వ్యాచారజీవనము | 0 12 0 | 0 8 0 |
| యుక్తిప్రకాశము | 0 8 0 | 0 5 0 |
| రామతీర్థస్వామివేదాంతోపన్యాసములు | | |
| 1 భాగము | 0 8 0 | 0 5 0 |
| 2 భాగము | 0 8 0 | 0 5 0 |

### వ్యాయామము

| | ఇతరులకు | చందాదార్లకు |
|---|---|---|
| అనుభవయోగాభ్యాసము | 1 4 0 | 1 4 0 |
| సూర్యనమస్కారములు | 0 4 0 | 0 4 0 |
| డిటో పటములు | 0 2 0 | 0 2 0 |

### ప్రకృతి వెనుకటి సంపుటములు

| | | |
|---|---|---|
| ప్రకృతి 4,5,6,7,11 సంపుటములు | | |
| ఒక్కొక్కటి | ఇతరులకు | 1 8 0 |
| | చందాదారులకు | 1 2 0 |
| ప్రకృతి 12,13,14,15 సంపుటములు | | |
| ఒక్కొక్కటి | ఇతరులకు | 3 0 0 |
| | చందాదారులకు | 2 8 0 |
| ప్రకృతి 16 సంపుటము | ఇతరులకు | 1 4 0 |
| | చందాదారులకు | 1 0 0 |
| 17 సంపుటము | ఇతరులకు | 3 4 0 |
| | చందాదారులకు | 3 0 0 |

---

## After all we have decided to publish

**Dr. BABBITT'S**

# HUMAN CULTURE AND CURE

**IN 5 PARTS** **IN 1 VOLUME**

The Standard work on Chromopathy, which is not available to the public for a long time.

| | |
|---|---|
| Part I | Philosophy to Chromopathy and apparatus. |
| Part II | Sexualogy and Sociology. |
| Part III | Psychology and Mental Healing. |
| Part IV | Nervous system and Insanity. |
| Part V | Diseases of organs and Cure. |

576 Pages 150 Illustrations

Will be printed on heavy antique paper and bound in cloth.

Pre-publication price (To be paid in advance) .... .... Rs. 10

Post-publication price .... .... .... ... .... Rs. 20

*For detailed prospectus apply to:—*

## The Chromopathic Institute,

**Andhra Grandhalaya Press Buildings,**

BEZWADA.

# టీకాలవలన అపాయములు.



టీకాలు వేయుటవలన కలిగిన లోకోమోటారు అటాక్సియా అను నాడీవ్యాధి పీడితుడు.



టీకాలు వేయుటవలన సంపూర్ణ వికారమునొందిన బిడ్డ.



టీకాల రసము తీయుటకై హింసింపబడి జీవచ్ఛవము చేయబడిన ఆవు దూడ.

Edited, Printed & Published at the Andhra Grandhalaya Press, By Dr. P. VENKATARAMAYYA
PRAKRITI OFFICE, BEZWADA.